# విపుల ఆహ్వానము

# అనువాద కథలకు

సుతిమెత్తని సంవేదనలు
అనురాగభరిత ఆత్మ నివేదనలు
ఉత్కంఠభరిత కథన వేగాలు
ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

## ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన
అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే**
**విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

***రచనలు పంపవలసిన చిరునామా***

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



110 సం॥ల భూత,భవిష్యద్వర్తమాన శతాబ్ది పంచాంగ రచయిత

# పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి గారి

శ్రీ సర్వధారినామ సంవత్సర 2008-2009

# గంటల పంచాంగము

త్వరలో విడుదల అన్ని బుక్ షాపులందు లభించును

## గ్రహ-శాంతి యంత్రములు మంత్రకవచములు

అనేక కష్టనష్టముల నుండి తొలగించి రక్షించును ఇవి శరీరంనందు ధరించు తావీదు యంత్రములు

1. నవగ్రహ శాంతి యంత్రం
2. సర్వజన వశీకరణ యంత్రం
3. జయవశీకరణ యంత్రం
4. సరస్వతి యంత్రం
5. మహాలక్ష్మి యంత్రం
6. వివాహ యంత్రం
7. సంతాన యంత్రం
8. భార్యాభర్తల మైత్రికి
9. సుఖ ప్రసూతి యంత్రం
10. ఉద్యోగ ప్రాప్తియంత్రం
11. వ్యాపారాభివృద్ధి యంత్రం
12. మహాశూలిని యంత్రం
13. రోగనివారణ యంత్రం
14. శనిదోష యంత్రం
15. నరఘోష యంత్రం

పై స్పెషల్ వెండి యంత్రములు ఒక్కొక్కటి పంపుటకు రూ.200/-లు అగును. సొమ్ము ముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము

## మీ యింట యంత్రస్థాపనచేయండి! సకల సిరులు పొందండి!

1. శ్రీ మహాలక్ష్మి యంత్రం
2. శ్రీచక్రరాజ యంత్రం
3. శ్రీ మత్స్య యంత్రం
4. శ్రీ నరఘోష యంత్రం
5. శ్రీ ధనాకర్షణ యంత్రం
6. శ్రీ కుబేర యంత్రం
7. శ్రీ ఆంజనేయ యంత్రం
8. శ్రీ లక్ష్మీగణపతి యంత్రం

ఈ యంత్రం ఒక్కొక్కటి 5X5 అం॥లు సైజు రాగి రేకుపైచేసిపూజించిపంపుటకు రూ.350-/లు అగును. సొమ్ముముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము.


## బుట్టే వీరభద్ర దైవజ్ఞ

తిలక్ రోడ్, రాజమండ్రి - 3, ఫోన్(0883) 2469631

E-mail : bvb_divagna@rediffmail.com

సంపుటి - 30
సంచిక - 10
నవంబరు 2007
358వ సంచిక

# చతుర



కుటుంబసభ్యులను
కలతపెట్టడం ఎందుకని
ఓ నిప్పులాంటి నిజాన్ని
తనగుండెల్లో దాచుకున్న
నేరానికి ఆ చెల్లికి
లభించిన పురస్కారం..
కుటుంబ తిరస్కారం!
అయినా తనను తాను
సాన పట్టుకుంటూ
జాతివజ్రంలా ఎలా
రూపుదాల్చిందనేది
తెలియచెప్పే
అనూరాధ
నవల 'ఆకృతి'
10 వ పేజీలో
బొమ్మలు: భాస్కర్




# పైలెటమ్మ

ఇండియానాపొలీస్ రాష్ట్రంలోని ఫోర్ట్‌లైన్‌కి చెందిన మార్గరెట్ రింగెన్ బెర్గ్ ఇరవయ్యేళ్ల వయసులో తొలిసారిగా విమానంలో ఒంటరి పైలెట్‌గా వ్యవహరిస్తూ 1941లో ఓ విమానాన్ని నడిపింది.




56 ఏళ్ళ తర్వాత కూడా తన 76వ ఏట 1997లో ఆమె ఫ్లయిట్ ఇన్‌స్ట్రక్టర్‌గా కొనసాగుతోంది. ఆవిడ తన జీవితకాలంలో 40 వేల గంటలు విమానాన్ని నడిపింది. అంటే సుమారు నాలుగున్నర సంవత్సరాలు పైలట్‌గా ఆకాశంలో గడిపింది. అంతేకాక గట్టి పోటీ గల విమాన రేసుల్లో కూడా పాల్గొని అనేక బహుమతులు గెలుచుకుంది.

1945లో పోర్ట్‌లైన్‌కి చెందిన లోకల్ రేడియో స్టేషన్ ఈమె సేవలని వినియోగించుకోవడం వల్ల ఇప్పటికీ మార్గరెట్ గురించి అక్కడి ప్రజలు చెప్పుకుంటుంటారు. లోకల్ దినపత్రికల ఉద్యోగస్థులు సమ్మెలో ఉండటంతో ఆ రేడియో స్టేషన్‌వారు, జపాన్ అమెరికాకి లొంగిపోయి, యుద్ధం ముగిసిందన్న సమాచారాన్ని అందరికీ తెలియచేయాలన్న సంకల్పంతో విమానంలోంచి కరపత్రాలని కిందకి పడేయాలని నిర్ణయించి, మార్గరెట్‌ని అందుకు నియమించారు. 56 వేల కరపత్రాలని మార్గరెట్ విమానంలోంచి 'బాంబ్' చేసింది. అవి ఆ ఊరులో నివసించే వారందరికీ అందాయి.

చాలామంది పైలెట్లని తయారుచేసిన మార్గరెట్ ఇప్పటికీ నెలకి 50 గంటలకి తక్కువ కాకుండా విమానాన్ని నడుపుతోంది. సెనెటర్‌గా డేన్‌క్వియర్ పోటీచేసినప్పుడు మార్గరెట్టే అతని ప్రచార విమానాన్ని నడిపింది. దూరంగా ఉన్న మెడికల్ హాస్పిటల్‌కి రోగులను అనేకసార్లు విమానాల్లో తీసుకెళ్ళింది.

తీరంనుంచి తీరందాకా జరిపిన ఆడవాళ్ళ విమాన రేసులో ఆమె మొదటి బహుమతి గెలుచుకుంది. ఆ రేసులో తన కూతురితో, 22 ఏళ్ల మనవడితో కూడా పోటీపడి మొదటి స్థానం గెలుచుకుంది!

# మతలబు మతలబు!

-వారణాసి రామకృష్ణ

మతలబు- మతాబులాంటిది! వొత్తి అంటుకున్నా గమనించకపోతే మొహం కాల్తుంది! అలాగే ఎదుటివాడు చెప్పిందాంట్లోంచి 'మతలబు' పట్టుకోకపోతే 'బత్కు' బండలవుతుంది. పుత్రరత్నం- డాడీ! చిన్నప్పుడు నీకు లెక్కల్లో ఎన్ని మార్కులొచ్చాయి అన్నప్పుడు- వాడి వెనక తన బాబు లేదా వాడి తాత ఉన్నాడో లేక ప్రోగ్రెస్ రిపోర్టుతో ప్రొసీడయ్యాడో మతలబు మడతేస్కుని చూస్కుని ఆన్సర్ చెప్పాలి. అంతే తప్ప లెక్కల్లో శకుంతలాదేవి తర్వాత నేనేరా అని బీరాలు పలికితే రిజల్ట్సు జీరోలొస్తాయి. చుట్టం చూపుగా వచ్చిన పెళ్ళాం తరపు బంధువు- రెండు రాత్రులుంటానక్కయ్యా- అన్నప్పుడు, వచ్చినవాడు రెండు రాత్రులుంటే శివ'రాత్రి' నుండి సంకు'రాత్రి' దాకా తిష్టవేద్దామన్న కుట్రలో ఉన్నాడేమో కూపీలాగాలి. మావాడికస్సలు కట్నం తీస్కోనని ఏ పె.కొ. తండ్రైనా డిక్లేర్ చేశాడూ అంటే లాంఛనాల వాంఛల మేలిముసుగు వేశాడనే- మతలబు!

మతలబులు దీపావళి పటాసుల్లాంటివి. కొన్ని ఢామ్మని పేల్తాయి, కొన్ని తుస్సుమని ఊర్కుని ఆనక మనం ఏమరుపాటుగా ఉండడం చూసి బుస్సుమని పైకి లేస్తాయి. ఒక్కో మతలబు ఒక్కో మందు పాతరకి ఈక్వల్! కొన్ని మతలబులు మనకర్థం అవుతాయి! కానీ ఎదుటివాళ్ళకి చెబితే గొడవలయిపోతాయి. చెప్పకుంటే బాటిల్‌నెక్ పరిస్థితి మనకే! మా కాలనీ ఆరోగ్యరావుకి ఆరోగ్యం పట్ల స్పృహ ఎక్కువ! ఆఫీసవగానే హెల్తుక్లబ్బుకెళ్ళి బాడీ ఫిట్‌నెస్ కోసం బాడ్మింటన్, బ్రెయిన్ కండీషన్ కోసం చదరంగం ఆడి రోజూ ఆలస్యంగా ఇల్లు చేర్తాడు. కానీ అతని కొలీగ్ వెంకట్ వియస్‌కే- అతన్నంతా వెంకట్ విస్కీ అని పిలుస్తారు. సదరు వెంకట్ విస్కీ ఠంచనుగా ఇంటికొచ్చి పెళ్ళానికి మస్కాకొట్టి గంటసేపు గంట వాయించి చీకటి పడగానే, గుడికెళ్ళి కాస్త తీర్థం పుచ్చుకొనొస్తానని చెప్పి వెళ్తుండగా, సరిగ్గా ఈ డైలాగు ఎదురింటి ఆరోగ్యరావు పెళ్ళాం విని, ఆలస్యంగా ఇంటికొచ్చిన మొగుణ్ని చిరాగ్గా చూసి ఇంతసేపయిందే? అంటుంది. ఆవిడ రొటీన్ డైలాగ్‌కి ఆరోగ్యరావు అంతే రొటీన్‌గా క్లబ్బుకెళ్లొస్తున్నా అంటాడు చిరాకుగా! అంతే- ఆవిడ గయ్యిమని ఇంతెత్తున లేచి- వెంకట్ విస్కీని తెగ పొగిడి- క్లబ్బుకెళ్ళే బదులు పెందరాళే ఇల్లుచేరి చీకటి పడ్డాక గుడికెళ్లి 'తీర్థం' పుచ్చుకోవచ్చు గదానని తెగ సతాయిస్తుంది. తీర్థం మతలబు వేరే ఉందని ఆరోగ్యరావు పెళ్ళాంతో చెప్పలేడు. చెప్పాడో వెంకట్ విస్కీ ఇంట్లో రామా

యణంతో మొదలై మహాభారత యుద్ధంతో ముగుస్తుంది. అందుకని పాపం ఆరోగ్యరావు 'తీర్థం' మతలబు తన గుండెల్లోనే పదిలంగా దాచిపెట్టాడు.

కొన్ని మతలబులు పదివేల సరాల్లాం టివి. అంటుకుంటేచాలు, బ్రతుకులో నిత్యం పేలుతుంటాయి. మా కాలనీ కవి సుబ్రావ్ దీపావళి పండక్కి కూతుర్ని అల్లుడ్నీ తోలుకొచ్చేడు. కొత్తల్లుడు మాంచి పవర్‌ఫుల్ మతలబులు మహా బాగా తెల్సినవాడు! పండక్కి మీ నాన్న పల్సర్ ఇస్తాడేమోనంటూ పెళ్ళాం 'పల్స్' చూశాడు! ఇక్కడ అంటించిన పొత్తి- మామ దగ్గర మండి- 'మోటార్ సైకిల్ కొనుక్కో అల్లుడూ' అంది. అయితే మత లబు అల్లుడు మొహం గంభీరంగాపెట్టి- నేను నా స్వంత సంపాదనతోనే కారు




కొంటాను మామా! బైక్‌కి బదులు కారు పెట్రోలు ఖర్చులు మాత్రం నెలనెలా భరించండి, అన్నాట్ట. పాపం పిచ్చి సుబ్రావు ఆహా! నా అల్లుడెంత మంచాడ నుకుని భరోసా ఇచ్చేశాడు. ఇంకేముందీ- పెట్రోల్ రేట్లు రెండు మూడు రోజులకొక సారి గడ్డం మీసాలు పెరిగినట్లు పెరిగిపో తుంటే పాపం సుబ్రావుకి పీక్కోవాలో గోక్కోవాలో అర్థం కాలేదు. పెట్రోలు కంటే పెట్రోల్ ధర ఎంతలా మండు తుందో ఆయిల్ ట్యాంకర్ల మీద తాటికా యలంతేసి అక్షరాలు- 'డేంజర్- హైలీఇన్ ఫ్లేమబుల్!' అని ఎందుకు రాస్తారో మత లబు అప్పటికి అర్థం అయింది!




కొన్ని ఓవర్ స్మార్టు శాల్తీలుంటాయి. ఈ శాల్తీలు ఎదుటివారి మతలబు అర్థం చేస్కోడం అటుంచి, అందులోంచి విపరీ తార్థాన్ని పీకి పైగా వాళ్ళే మందుపాతర లాంటి మతలబు పెడతారు. మా ఆరోగ్య రావు, కూతురి పెళ్ళి చెయ్యబోతూ తన కున్న విపరీత హెల్త్ కాన్‌సెన్స్‌తో- కాబోయే అల్లుడికి ఎయిడ్స్ పరీక్షలు చేయి స్తానన్నాడు. పెళ్లిచూపులకొచ్చిన వాళ్లంతా పిచ్చిచూపులు చూశారు. కానీ ఓవర్‌స్మార్టు పె.కొ. మాత్రం వినగానే చంకలు గుద్దు కుని ఎగిరి గంతేశాడు. వీడి యాక్షన్ మతలబేంటో అర్థంకాక పక్కకి తీస్కెళ్ళి వాకబు చేస్తే- ఎంచక్కా పెళ్లికి ముందే పెళ్లికూతుర్ని తనని గదిలోకి పంపి, ఆ పిల్ల వల్ల తనకి ఎయిడ్స్ వచ్చిందో రాలేదో టెస్టులు చేస్తారన్నట్లు మతలబు ముడత విప్పాడు. వాడు పేల్చిన అలిపిరి టైపు మందుపాతర శబ్దానికి పాపం మా ఆరోగ్యరావు చెవులు దిబ్బళ్లేసి 'అనారోగ్య రావ'యిపోయాడు!

ఇంకొన్ని మతలబులు కాకరపువ్వొ త్తుల్లా నవ్వుల కాంతులు వెదజల్లుతాయి. మొన్నామధ్య మాదోస్తొకడు ఫోన్‌చేసి- ఈ దీపావళికో 'కోతిని' కొంటున్నాం



గురూ అన్నాడు. కోతేమిత్రా కోతిమొహం వెధవా అని ఆలోచిస్తూ బుర్ర గోక్కుంటే- 'రచయితవి కదా, మతలబు పట్టుకో చూద్దాం' అని ఫోన్ పెట్టేశాడు. ఎలకల్ని పడతాయని పిల్లుల్ని, పిల్లుల్ని తరమాలని కుక్కల్ని, కుక్కల పాల కోసం గేదెల్ని- ఇలా పెంపుడు జంతువుల్ని కొందరు 'పెంచు'కుంటూ పోతారుగానీ వీడేంటి? కోతిని కొంటానంటాడే అని చాలా సేపు బుర్ర బద్దలు కొట్టేను. తీరా వాడు స్వీటు ప్యాకెట్టుతో తళతళలాడుతున్న కొత్త 'మారుతి' లోంచి దిగ్గానే మతలబు బుర్రలో హారన్ కొట్టింది! అదిచ్చే అను భూతి మీకు కావాలంటే- కోతిని కొనక్కర్లే దుగానీ కొన్నవారితో- 'మీ కోతి భలే బావుందండీ'- అని చూడండి. మతలబు అర్థంగాక ముందు వాళ్ళు ముడుచుకున్నా మడత మీరు విప్పాక- మొహం విప్పారు తుంది. క్రీడల్లో సైతం చిచ్చుబుడ్లలాంటి మతలబులుంటాయి. పరుగుపందెంలో బంగారు పతకం పొందినవారు పథకం వేసి డ్రగ్స్ సేవించారంటారు. డోపింగ్ టెస్టుచేసి పతకం వెనక్కి లాగేసుకుం టారు. చేసే ఈ డోపింగ్ టెస్టేదో పరుగు పందెం సరిగ్గా స్టార్ట్ చెయ్యటానికో అర గంట ముందేచేసి, పథకం వేసిన వాడ్ని ప్రక్కకి నెట్టి మిగతా వారి ప్రతిభ పరీ క్షించే వీలుంది కదా? అని మన చిన్నదే హంలో సందేహం పుడుతుంది. కానీ అంతర్జాతీయస్థాయి వాళ్లకి బుర్రలు లేవనా? ఇదో 'పెద్ద మతలబు? అంతే!

ఇక పొలిటికల్ మతలబుల మతలబే వేరు! రాకెట్స్‌లా పైకి దూసుకుపోతాయి. పోయాయిలే అనుకుని మనం ఆకాశంవైపు తలెత్తి చూస్తాం- మళ్ళీ మన ప్రక్కనే వాలి ఢామ్మంటాయి! విలేఖర్ల గోష్టిలో సీఎం లేదా పీఎం - నా పదవికేం ఢోకాలేదు పొమ్మంటాడు! ఐదేళ్ళు సుబ్బరంగా పాలిస్తా అని నింపాదిగా నవ్వేడు అంటే ఎక్కడో ఏదో ముసలం పుట్టిందనే మత లబు. పదవికి ఎసరొచ్చే కుర్చీ క్రింద బుస గొట్టే దీపావళీ నాగుపాములు బుస్సు మన్న చప్పుడు పసిగట్టాడనే! మరో నేత వీరావేశంగా- రాజకీయాల్లోకొచ్చాక చిల్లి గవ్వ సంపాయించలేదంటాడు. నిరూపిస్తే రాజకీయాల్లోంచే తప్పుకుంటానంటాడు. ఇలాంటి వాటిలోని మతలబులు 'చిల్లిగ వ్వ'ల్లోనే ఉంటాయి. ఆ మధ్య గల్లీలీడరొ కరు చాలా కూల్‌గా- 'నేను పదికోట్లు తిన్నానన్నది పచ్చి అబద్ధం' అన్నాడు. అది మాత్రం 'పండు' నిజం! ఎందుకంటే ఆయన ఇరవై కోట్లకి తక్కువయితే అస్సలు దానివంక కూడా చూడడు! ఇంకో ఢిల్లీ లీడరు- నా పేరు మీద ఆస్తులు ఉన్నట్టు ఎవరైనా నిరూపిస్తే నాలుగురోడ్ల కూడలిలో బహిరంగ ఉరిశిక్షకి నేను సిద్ధం! అంటూ ఉరితాడు మెళ్ళో వేస్కుని తలారీ భుజం మీద చెయ్యేసి నవ్వుతూ ఫొటోలకి ఫోజిచ్చాడు! ఒహప్పుడేమో కానీ ఇప్పుడివన్నీ బో'ఫార్స్' శతఘ్నిల్లాంటి మతలబులే!

మతలబుల నడమ మడతలు పడి నలిగి నలిగి అసలు తాత్పర్యం కాస్తా పలు చనయింది! నిజమే! మతలబుల్ని మర మ్మత్తు ఎలా చెయ్యగలం అంటే- ఇలా అనటం వెనకున్న మతలబేంటి? అన్న అనుమానం అందరికీ రావటంలో వింత లేదు. ఎందుకంటే- ముందు రాస్తున్న నాకే వస్తుంది!

అవును మరి- మతలబు మహమ్మారి! ఒకరికొకరికీ మధ్య 'చిచ్చుబుడ్లు' పెడు తుంది! చేసేదేదో ముందే చెప్పి- చెప్పిం దేదో ఆనకచేస్తే స్పష్టంగా ఉంటుంది! అప్పుడు మతలబు మనుషుల మధ్య 'అమాస సీకట్లు' తొలగించే మతాబులా వెలుగుతుంది!! ©

# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల గర్భకోశ వ్యాధులకు రసాయన, నాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిరుతుక్రమము సక్రమముగా లేకపోవుట. ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు శుష్కించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు, జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్, ❖ రక్త మొలలు, ఆర్ష మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, జిల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చల్డీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధుమేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగరు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రీన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్ళునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన,
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 60/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

**Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M**

# ఆకృతి

కాలేజీ లోపలా బయటా అక్కను ర్యాగింగ్ చేస్తున్న వారిని ధైర్యంగా ఢీకొంటుందా తొమ్మిదో తరగతి విద్యార్థిని. అక్క మాత్రం ర్యాగింగ్ బాధ పడలేక చదువే మానేస్తుంది. చెల్లెలు చదువు పూర్తిచేసి ఆర్కిటెక్ట్‌గా ఉద్యోగంలో చేరుతుంది. అక్కడ అక్కను ర్యాగింగ్ పేరుతో తీవ్రంగా వేధించిన అక్షయ్ బాస్‌గా దర్శనమిస్తాడు. ఆ తర్వాత ఆమె జీవితం అనూహ్య మలుపులు తిరిగింది. తనెంతో ప్రేమించిన తల్లిదండ్రులు, అక్క ఏవగించుకున్నారు.. మరోపక్క ఏ క్షణాన కాటువేస్తుందోనని భయపడుతూనే పాము పడగనీడన కొలువుచేయక తప్పని స్థితి. అయితేనేం? ఆత్మవిశ్వాసంతో ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొని తన భవితను తీర్చిదిద్దకుందా యువతి. ఆద్యంతం ఆసక్తికరంగా సాగే అనురాధ 'ఆకృతి' ఈ నెల 'చతుర' పాఠకులకు అపురూప కానుక.




- అనూరాధ

**చతుర**
పోటీలో
కన్సొలేషన్
బహుమతి
రూ. **8000/-**
పొందిన నవల

మెల్‌బోర్న్...
క్రిసమస్ సీజన్ కావడంతో నగరమంతా విద్యుత్ దీపకాంతులతో మెరిసిపోతోంది. ఉల్లాసంగా షాపింగ్ చేస్తూ ఉత్సాహంగా తిరుగుతున్న మనుషులతో వాతావరణం సందడిగా ఉంది.

"ఆస్ట్రేలియా వచ్చి ఈ క్రిసమస్‌కి మూడేళ్లవుతోంది" ఆ కోలాహలం చూస్తూ కారు డ్రైవ్ చేస్తోంది అమృత. అపార్టుమెంట్ బేస్‌మెంట్‌లో కారు పార్కు చేస్తుంటే అమిత్‌సింగ్‌గారు ఎదురొచ్చారు.

"ఆఫీస్ సే ఆగయేహో బేటీ...?" ఆత్మీయంగా పలకరించారు.

"హౌ ఆర్ యూ అంకుల్. ఆంటీ కైసీ హై?" నవ్వుతూ ఆయన్ని విష్ చేసింది అమృత.

"అచ్ఛీ హై. ఆజ్ రాత్ తుమ్హారా ఖానా హమారే సాత్..." అమెరికా నుంచి తమ కొడుకు కోడలు వచ్చారని, చిన్న పార్టీ ఎరేంజి చేశానని తప్పక రమ్మని మరీ మరీ చెప్పి వెళ్లారు.

ఒకే అపార్టుమెంట్‌లో ఉన్న ఇండియన్స్ కావడమో లేక తమ కూతురి వయస్సున్న అమృత ఒంటరిగా ఉంటోందనే కారణమో అమృతని అమిత్ సింగ్, ఆయన భార్య పూజ ప్రత్యేకమైన అభిమానంతో ఆదరిస్తున్నారు.

ట్వెల్త్‌ఫ్లోర్లో ఉన్న తన ఫ్లాట్‌కి వెళ్లి కొంతసేపు రిలాక్స్ అయ్యి తీరిగ్గా రెడీ అయ్యి పెద్ద ఫ్లవర్‌బొకే తీసుకుని అమిత్ సింగ్ గారి ఫ్లాట్ కెళ్లింది అమృత.

"అవో బేటి" అంటూ పూజ ఆప్యాయంగా లోపలికి తీసుకెళ్లి వాళ్ల అబ్బాయిని, కోడల్ని, ముద్దులు మూటగట్టే మనవళ్లని మురిసిపోతూ చూపించింది. అమిత్‌సింగ్‌గారు నవ్వుతూ, తుళ్లుతూ, జోకులేస్తూ మహాహుషారుగా తిరుగుతున్నారు.

ఇన్నాళ్లలో వాళ్లలో ఎప్పుడూ చూడని ఆనందాన్ని వెలిగిపోతూ ఉన్న వాళ్ల మొహాలని తదేకంగా చూస్తుండిపోయింది అమృత.

డిన్నర్ చేసి అందరికి గుడ్‌నైట్ చెప్పి ఇంటికొచ్చి పడుకుంది. అమ్మా నాన్న గుర్తొస్తున్నారు.

పిల్లలొచ్చిన సంతోషంతో కళకళలాడుతున్న అమిత్‌సింగ్‌గారిల్లు చూశాక ఎంత వద్దన్నా హైదరాబాద్‌లోని తమ ఇంటికేసి మనస్సు లాగుతోంది.

ఒకసారి వెళ్లి అమ్మని, నాన్నని చూసొస్తే? ఈ మూడేళ్లలో ఎప్పుడు రాని ఆలోచన ఆరోజు మొదటిసారిగా వచ్చింది.

ఆమె మనసు కాంతి కన్నా వేగంగా హైదరాబాద్ వెళ్లిపోయింది.




"గుడ్ మార్నింగ్ నాన్నా! ఈ రోజు పేపర్లో హెడ్‌లైన్స్ ఏంటి...?" నిద్ర లేచి లేవగానే విశ్వనాథ్ దగ్గరకెళ్లి కూర్చుంది అమృత.

"అమృతా ఇలా రా!" అంటూ కిచన్ లోంచి వసంత పిలిచింది.

"వస్తున్నానుండమ్మా"! అంటూ అప్పటికే పేపర్లో మునిగిపోయింది అమృత.

"ఆ పేపర్లో వార్తలు రోజూ ఉండేవేగానీ ఇలా వచ్చి వంట నేర్చుకోవచ్చుగా" మళ్లీ పిలిచింది తల్లి. అది విని-

దీపావళి శుభాకాంక్షలతో...



# Premier

Rs. 394/- onwards

Exchange Upto 50% off




IS:2347



WROUGHT
CM/L 2219342



LISTED
99CA
Certified by
Underwriters
Laboratory, USA

| సైజ్ | ఎమ్ఆర్‌పి | ఎక్స్ఛేంజ్ ధర |
|---|---|---|
| 3.0 ltr. | 787.00 | 394.00 |
| 5.5 ltr. | 1180.00 | 649.00 |
| 7.5 ltr. | 1508.00 | 900.00 |
| 10 ltr. | 1772.00 | 1050.00 |
| 12 ltr. | 1925.00 | 1150.00 |



# Premier

Exchange Rs. 800/-off

తెలివిగలవారు తెలివైన
"ప్రీమియర్" గ్రైండర్‌తో మార్చుకోండి



మీపాత మిక్సీ లేదా
గ్రైండర్, ఏ కండీషన్‌లో
వున్నా తీసుకురండి.
మా ప్రీమియర్ లైఫ్ స్టైల్
గ్రైండర్‌తో మార్చుకోండి.

Distributors for Coastal :



**A.R. ENTERPRISES,** Guntur
Contact : 0863-2255669, Cell : 98661 56021

**Sales Officers : Ramana - 99891 59415, Raju - 98661 56091**

Sai Dinesh Ads



"వసూ...! దానికిప్పట్నించే ఆ పన్లెం దుకు చెప్పడం?" వెంటనే అమృతని వెన కేసుకొచ్చాడు విశ్వనాథ్

"మీ ముద్దుల కూతుర్ని నేనేమి అన లేదు. యమునలాగే ఇదీ కాస్త పనీపాట నేర్చుకుంటే రేప్పొద్దున దానికి ప్రాబ్లమ్ ఉండదని చెప్పానంతే. ఇక మీ ఇష్టం... మీ కూతురిష్టం. నేను చెప్పిందంతా మీకు చాదస్తంగానే తోస్తుంది" అంటూ కాఫీ పట్టుకొచ్చింది వసంత... అమ్మ ధోరణి అలవాటే కనుక అదేం పట్టించుకో కుండా... "అమ్మా! ఆఫీసుకీ రోజు తొంద రగా వెళ్లాలి. మా కొత్త డిఎమ్‌డి ఇవాళ ఛార్జ్ తీసుకొంటాడట" అంటూ పేపర్ పక్కన పడేసి లేచింది అమృత.

ఇంకో గంటలో ట్రిమ్‌గా తయారై "అమ్మా వెళ్లొస్తాను. బై నాన్న" అంటూ స్కూటీ స్టార్ట్ చేసుకుని రయ్యిమని వెళ్తున్న అమృతని గర్వంగా చూసుకుంటూ విశ్వం...

"చూశావా నా కూతుర్ని" అన్నాడు వసంతతో...

"పెద్ద గొప్ప అది నా కూతురు కూడా" ... మురిపెంగా చెప్పి నవ్వింది వసంత. విశ్వనాథ్, వసంతలకి యమున, అమృత ఇద్దరూ రెండు కళ్లు. పెద్దదైన యమునకి అమ్మ దగ్గర చేరికైతే చిన్నదైన అమృత నాన్నకి గారాల పట్టి. యమున పెళ్లయి వెళ్లిపోయాక అమృత అమ్మానాన్నలకింకా దగ్గరైంది. తొందర్లోనే యమున తమని అమ్మమ్మ, తాతయ్యలని చేయబోతోందని తెలిసి వసంతా, విశ్వనాథ్ ఆనందంతో గాలిలో తేలిపోతున్నారు. తన తర్వాత ఈ ఇంట్లోకి రాబోతున్న చిన్ని ప్రాణికోసం ఇప్పట్నుంచే అమృత గిఫ్ట్స్ కొనటం మొద లెట్టేసింది. ఈ ఆనంద సమయంలో తన జీవితంలోకి ప్రవేశించబోతున్న కొత్త ప్రాణివల్ల తన జీవితంలో సమస్యలు రాబోతున్నాయని ఆ క్షణం అమృత ఊహించలేకపోయింది.

★ ★ ★

ఆకృతి... ఆర్కిటెక్చర్స్ & ఇంజనీర్స్... ఆఫీసంతా హడావుడిగా ఉంది.

"హాయ్ అమృతా" స్కూటీ పార్క్ చేస్తున్న అమృతని విష్ చేశాడు దినేష్.

"ఏమిటి విశేషాలు" నవ్వుతూ బ్యాగ్ తీసుకుని మెట్లెక్కుతూ అడిగింది.

"ఇంకేమున్నాయి... మన ప్రాణానికి ఉన్న ఎమ్‌డి చాలదని ఛైర్మన్‌గారు వాళ్ల బ్బాయిని కూడా డిఎమ్‌డిని చేసి మన నెత్తిమీద పెడుతున్నారుగా..ఏం చేస్తాం" నీరసంగా మొహం పెట్టాడు.

ఆకృతి ఛైర్మన్ చంద్రశేఖర్ తనకున్న బిజినెస్‌లు చూసుకుంటూ తన మిత్రుడు రామరాజుని ఆకృతి ఎమ్‌డిగా నియమిం చారు.

అనుభవజ్ఞులైన రామరాజు ట్రైనింగ్‌లో భవిష్యత్తులో తన కొడుకు ఆకృతి వ్యవహా రాలు స్వయంగా చూసుకోగల అనుభ వాన్ని సంపాదించగలడన్న ఆలోచనతో లండన్‌లో చదువుకున్న అతడిని ఇక్కడికి రప్పించారని అమృత కూడా వింది.

సరిగ్గా పది గంటలకల్లా చంద్రశేఖర్, రామరాజులిద్దరితో కలిసి ఆకృతిలో ప్రవేశి స్తున్న వ్యక్తిని చూసి అమృత స్థాణువులా నిలబడిపోయింది.

అతను... అతను... అక్షయ్ కదూ? తన కళ్ళని తనే నమ్మలేనట్లు మళ్ళీ మళ్ళీ చూస్తోంది.

"మీట్ మిస్ అమృత, జూనియర్ ఆర్కి టెక్ట్" అందర్నీ ఇంట్రడ్యూస్ చేస్తూ రామ రాజుగారు అక్షయ్‌కి అమృతని కూడా పరి చయం చేశారు. తననిక్కడ చూసి అక్షయ్ ఎలా ఫీలవుతాడా అని అతని కళ్ళలోకి సూటిగా చూసింది. కానీ అప్పుడే ఆమెని మొదటిసారి చూసినట్లు చాలా కాజువ




దీపావళి శుభాకాంక్షలతో...

ధరలు అందుబాటులో ఉండగానే అనువైన చోట విలువైన ఓ ఇంటిస్థలం

మా రన్నింగ్ వెంచర్లు

- **సాయి గిరి (అయ్యప్ప నగర్)**
గుంటూరు - హైదరాబాద్ స్టేట్ హైవే, వెంగళాయపాలెం సమీపాన, కైలాసగిరి దగ్గర, గుంటూరు.
- **సాయిరామ్**
గుంటూరు అమరావతిరోడ్, లాంను ఆనుకొని
- **సాయికీర్తన (మధురానగర్)**
వెంగళాయపాలెం దగ్గర, నేషనల్ స్టేట్ హైవేకు దగ్గరగా
- **సాయి ద్వారక**
విజయవాడ - మచిలీపట్నం హైవేకు దగ్గరగా, ఉయ్యూరు బైపాస్‌రోడ్ సమీపాన
- **సాయి హనుమ (ప్రీమియం)**
జి.కొండూరు, ఇబ్రహీంపట్నం - మైలవరం, చత్తీస్‌గడ్, N.H.-221 రోడ్
- **సాయి అభయ్**
రాయనపాడు, గొల్లపూడి దగ్గర, విజయవాడ.

నిర్మాణంలో ఉన్న మా అపార్ట్‌మెంట్స్

**(2 & 3 BED ROOM FLATS)**

- **అభినందన హోమ్స్**
లాం, గుంటూరు. (త్వరలో)
- **గోల్డెన్ రెసిడెన్సీ**
- **డైమండ్ రెసిడెన్సీ**
- **ప్లాటినమ్ రెసిడెన్సీ**
గొల్లపూడి, విజయవాడ.

బుకింగ్స్ జరుగుచున్నవి

మీ పెట్టుబడికి భద్రతతోపాటు అనేక రెట్లు ఆదాయం పొందండి!!



# అభినందన హౌసింగ్ ప్రైవేట్ లిమిటెడ్

- నవదీప్, చర్చి ఎదురుగా, బెంజ్ సర్కిల్, విజయవాడ-8. ఫోన్స్ : 0866-6628668, 6628778
- బందరు లాకులు దగ్గర, గవర్నర్‌పేట, విజయవాడ-2. ఫోన్స్ : 0866-6642428, 6642468
- బసవరామ కాంప్లెక్స్, 8/2, అరండల్‌పేట, గుంటూరు-2. ఫోన్స్ : 0863-6641177, 6647799
- లక్ష్మీపురం, మెయిన్‌రోడ్, గుంటూరు-6. ఫోన్స్: 0863-6454588, 6454599
- 3వ అంతస్తు, యన్.వి.ప్లాజా, సాయిబాబాగుడి వీధి, పంజాగుట్ట, హైదరాబాద్. ఫోన్స్ : 040-66367441/43, 66825777

KALYANI ADS, 98499 83669, 95



ల్‌గా పలకరించి లోపలికెళ్ళిపోయాడు.

'అయితే వీడు తనని గుర్తుపట్టలేదా? లేక పట్టనట్లు నటిస్తున్నాడా? ఈ కంపెనీ అక్షయ్‌దని తెలిస్తే తనిక్కడ కనీసం కాలు కూడా పెట్టేది కాదు' తల పట్టుకుని అలాగే సీట్లో కూర్చుండిపోయింది. ఏడెనిమిది సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలు మళ్ళీ మనసులో మెదిలాయి.




నిర్మలంగా ప్రవహించే నదిలా సున్నితమైన మనస్సుతో, అందాలు చిందించే వయస్సులో యమునని ఒక్కసారి చూసిన వాళ్ళెవరైనా మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా ఉండడానికి చాలా కష్టపడేవాళ్ళు.

"అక్కా! బెస్టాఫ్ లక్..." ఇంజినీరింగ్ కాలేజీలో జాయినై, మొదటిరోజు కాలేజీకెళుతున్న యమునకి చెప్పింది అప్పటికి ఇంకా నైన్త్ చదువుతున్న అమృత.

"థాంక్యూ"... హుషారుగా నవ్వుకుంటూ కాలేజీకెళ్ళిన యమున సాయంత్రానికి ఇంచుమించు ఏడుస్తూనే ఇంటికొచ్చింది. కాలేజీలో సీనియర్లు చేసిన రాగింగ్‌కి బాగా బెదిరిపోయిన ఆమెకి, అమ్మా నాన్నా ఆ రోజంతా ధైర్యం చెప్తూ కూర్చున్నారు.

ఫ్రెషర్స్ డే అయ్యేదాకా ఎలాగోలా ఓపిక పట్టమని అమ్మా నాన్నా చెప్పిన మాటలు, ఇచ్చిన ధైర్యం ఆమెకి కాలేజ్‌లో అడుగు పెట్టగానే మటుమాయమైపోయేవి. సీనియర్స్‌ని చూస్తే చాలు ముచ్చెమటలు పట్టేసేవి. అందులోనూ సెకండియర్ స్టూడెంట్స్ సుధీర్, అక్షయ్, రేవంత్ అంటేనే ఉలిక్కిపడేది.

తమని చూసి యమున నిలువెల్లా వణికిపోవడంతో వాళ్ళకి భలే మజాగా ఉండేది. యమునని రాగింగ్ చేయ్యడం వాళ్ళకి మంచి టైంపాస్ వ్యవహారంగా మారిపోయింది.

"ఇదంతా మామూలే యమునా... టేకిట్ ఈజీ..." రాగింగ్‌ని ఫన్నీగా తీసుకుని ఎంజాయ్ చెయ్యమని ఫ్రెండ్స్ చెప్పేవాళ్ళు.

"అక్కా! వాళ్ళమీద మీ ప్రిన్సిపల్‌కి కంప్లైంట్ ఇవ్వరాదూ?" యమున భయం చూసి అమృత కూడా ఓ రోజు సలహా ఇచ్చింది.

"అమ్మో! అలా చేస్తే వాళ్ళింకా రెచ్చిపోతారు" ఫ్రెషర్స్‌డే కోసం రోజులు లెక్కబెట్టుకుంటూ ఎదురుచూస్తోంది యమున.

★ ★ ★

"ఈ సండే మన ఫ్రెండ్స్ అందరికీ నా బర్త్‌డే పార్టీ మా ఫార్మ్‌హౌస్‌లో ఎరేంజ్ చేశాను. అంతా మీ గర్ల్‌ఫ్రెండ్స్‌ని తీసుకొచ్చేయండి. నో ప్రాబ్లెం" అంటూ ఫైనలియర్ స్టూడెంట్ రాకేష్, అక్షయ్, సుధీర్, రేవంత్‌లనీ రమ్మని ఇన్వైట్ చేశాడు.

"సుధీర్ ఐ పిటీ యూ రా... నువ్వొక్కడివే రావాలి పాపం..." వెంటనే సుధీర్‌ని టీజ్ చేయ్యడం మొదలెట్టాడు ప్రమోద్. సుధీర్‌ని చూస్తే చాలు అమ్మాయిలంతా ఆమడదూరం పరిగెడతారని కామెంట్ పాస్ చేసి మరీనవ్వడం మొదలెట్టాడు. ఫ్రెండ్స్‌లో అలాంటి మాటలు మామూలైనా సుధీర్‌కెక్కడో అహం దెబ్బతింది.

"నేను యమునని తీసుకొస్తాను" పౌరు

షంగా చెప్పాడు.

"యమునని తీసుకొస్తావా? నీ కంత సీన్ లేదురా..." ప్రమోద్ కవ్వించడంతో ఇంకాస్త రెచ్చిపోయాడు.

"ఎంతరా బెట్?" ఆమె తప్పకుండా తనతో వస్తుందని ఛాలెంజ్ కూడా చేసేశాడు. తర్వాత...

"పెద్ద హీరోలాగా ఛాలెంజ్ చేశావు గానీ యమున రాకపోతే నీతోపాటు మా పరువు కూడా పోతుందిరా" అంటూ అక్షయ్, రేవంత్‌లిద్దరూ గోల పెట్టారు.

"ఇప్పుడెలాగరా?" సుధీర్ ఆవేశం అప్పుడే చల్లబడి తెల్లమొహమేశాడు. అది చూసి అక్షయ్, రేవంత్‌లిద్దరూ ఆలోచనలో పడ్డారు.

"కాలేజ్‌లో యముననడిగితే అందరికీ తెలిసిపోతుంది. అందుకే ఆమె కాలేజ్ బస్‌ని ఫాలో అయి ఒంటరిగా పట్టుకుని ఎలాగోలా బతిమాలి ఒప్పిద్దాం" అక్షయ్ చెప్పిన ఐడియా విని ఆ సాయంత్రం యమున బస్ వెనక బైకులేసుకుని బయల్దేరారు ముగ్గురూ.

అమృతప్పుడే తన స్కూల్‌బస్ దిగి యమున కోసం వెయిట్ చేస్తూ నుంచుంది. యమున బస్ దిగగానే ఇద్దరూ కలిసి రోజులాగే ఇంటికేసి నడక సాగించారు.

"అమ్మో! వీళ్ళిక్కడికూ్కడా తయారయ్యారా?" అక్షయ్ వాళ్లని చూసి యమున తుళ్ళిపడింది.

"అక్కా! వీళ్ళేనా వాళ్ళు?" అప్పటికే యమున ద్వారా వాళ్ల గురించి అమృతకి బాగా తెలిసిపోయింది.

"పద...పద" అంటూ యమున గబగబా నడవసాగింది. అది చూసి ముగ్గురూ స్పీడుగా వచ్చి చుట్టూ గుండ్రంగా బైకులడ్డంగా పెట్టేశారు.

"ఏయ్... బైక్స్ తియ్యండి." భయంతో బిక్కచచ్చిపోయిన అక్కని చూసి అమృతే గట్టిగా అరిచింది. అదేం పట్టించుకోకుండా సుధీర్ బైక్ దిగి యమున దగ్గరకొచ్చాడు.

"ఐయాం సారీ యమునా... ఇన్నాళ్ళూ మేం నిన్ను సరదాగా రాగ్ చేశామంతే. ఇకనుంచీ మనమంతా ఫ్రెండ్స్ ఓకేనా.." చాలా ఫ్రెండ్లీగా చెప్పాడు.

ఉన్నట్టుండి మారిపోయిన వాళ్ళ బిహేవియర్ని చూసి యమున ఆశ్చర్యబోయింది.

"యమునా! నువ్వు నాకొక చిన్న ఫేవర్ చెయ్యాలి" మెల్లగా అసలు విషయం అప్పుడు బయటపెట్టాడు.

"ఈ సండే నువ్వు నాతో పార్టీకి రావాలి. ఈ ఒక్కసారికీ నా గర్ల్‌ఫ్రెండ్‌లా వస్తే చాలు. మళ్ళీ ఎప్పుడూ అడగను..." సుధీర్ చల్లగా అడిగిన సంగతి విని యమున కొయ్యబారిపోయింది.

"ఏంట్రా! వాగుతున్నావ్?" అమృతకి ఒళ్లు మండిపోయి ఆవేశంగా సుధీర్ నొక్క తోపు తోసింది. సడన్‌గా అమృత తోసిన తోపుకి ప్రిపేర్డ్‌గా లేకపోవడంతో, సుధీర్ తూలి వెనకనున్న తన బైక్‌మీద పడడంతో, ఆ అదటుకి అది కాస్తా పడిపోయింది.

"పదక్కా" ఇదంతా ఇంకా షాకింగ్‌గా చూస్తూ నిలబడ్డ యమున చెయ్యి పుచ్చుకుని బయలుదేరింది.

"ఏయ్! ఆగండి" మూలుగుతున్న సుధీర్‌ని లేవదీస్తూ అక్షయ్, రేవంత్ లిద్దరూ కోపంగా వీళ్ళని పట్టుకోవాలని వెంటపడ్డారు.

"హెల్ప్... హెల్ప్" గట్టిగా అరుస్తూ దారిన పోయేవాళ్ళందర్నీ పిలవసాగింది అమృత.

ఏం జరిగిందంటూ ఆ చుట్టుపక్కల జనాలంతా పరుగు పరుగున వస్తుండడం చూసి కంగారుగా బైక్‌లు స్టార్ట్ చేసుకుని






వెళ్ళిపోయారు ముగ్గురూ... అప్పుడొచ్చింది యమున కాళ్లలోంచి ఒణుకు.

పరుగు పరుగున ఇంటికెళ్ళి వసంతకి చెప్పి, ఏడుస్తూ కూర్చుంది.

"నీకేమైనా బుద్ధుందా? నువ్వీ రోజు చేసిన పనికి రేపట్నుంచీ వాళ్లు దాన్నింకెంత అల్లరి పెడతారో. ఏమో...! మీ నాన్న కూడా ఊళ్ళో లేరు. ఇప్పుడెలా?" వసంతకి కాళ్ళూ చేతులాడక అమృతనే తిట్టింది.

"అక్కా! రేపు వాళ్ళు నిన్నేమైనా అంటే గట్టిగా రియాక్టవు... మనం ఎదురుతిరిగితే వాళ్ళే తోక ముడుస్తారు. లేకపోతే ఇలాగే నీ వెంటపడతారు" తనే అక్కలా యమునకి ధైర్యం చెప్పింది అమృత.

"నీకేం పోయింది నువ్వెన్నయినా చెప్పగలవు. రేపు కాలేజ్‌లో వాళ్లని ఫేస్ చెయ్యాల్సింది నేనేగా" అంతా విని యమున మళ్ళీ మొదటికే వచ్చింది.



★ ★ ★

మర్నాడు భయం భయంగానే కాలేజ్ కె ళ్ళింది. లంచవర్‌దాకా వాళ్ళెవరూ ఎదురు పడకపోవడంతో కాస్త కుదుట పడింది. కానీ లంచవర్‌లో... యమునని రాంగింగ్ చెయ్యాలని చెప్పి ఆమె క్లాస్‌మేట్సందర్నీ బయటకి పంపి క్లాస్‌రూం డోర్ క్లోజ్ చేశాడు సుధీర్. అనుకున్నదంతా అయింది. ఇప్పుడు వీళ్ళు తననేం చేస్తారో? యమున గుండెలు పీచు పీచు మంటున్నాయి.

"నిన్న మర్యాదగా అడిగితే ఒప్పుకోలేదుగా... ఇప్పుడు చూడు" అంటూ పాకెట్ లోంచి ఏదో బాటిల్ తీశాడు సుధీర్.

"అదేంటో తెలుసా యాసిడ్" అక్షయ్ రహస్యంగా చెప్పాడు అంతే.

కెవ్వుమని అరవబోయిన యమున నోరు రేవంత్ గట్టిగా మూసేశాడు. సుధీర్ మెల్లగా తన దగ్గర కొస్తుంటే ఆమె పై ప్రాణాలు పైనేపోయి గడగడా వణికి పోతోంది.

"ఇదే ఫైనల్ వార్నింగ్.. రేపు నువ్వు నాతో రాకపోయావో...?" అంటూ ఆ సీసా మూత తీస్తున్న సుధీర్‌ని చూసి యమునకి ఇంచుమించు స్పృహ తప్పిపో తున్నట్లుంది.

"ఈ విషయం ఎవరికైనా చెప్పినా, రేపు నువ్వు నాతో రాకపోయినా ఇది నీ



మొహం మీద పోసేస్తాను. ఆ తర్వాత నీ ఇష్టం" సుధీర్ బెదిరింపులకి అక్షయ్, రేవంత్‌లిద్దరూ వంత పాడారు.

పాలిపోయిన మొహంతో, ప్రాణాలరచేతిలో పెట్టుకున్నట్లు బెదురుతూ బస్సు దిగిన అక్కని చూసీ చూడగానే ఏదో జరిగిందని అమృతకర్థమైపోయింది.

"ఏమైందక్కా? " అమృత టెన్షన్‌గా అడుగుతుంటే అక్కడే భోరుమంది యమున.

"వాళ్ళు నిన్నేమైనా అన్నారా? ఏం జరిగిందో చెప్పక్కా? " ఆ ఏడుపు చూసి అమృత కూడా బాగా కంగారుపడిపోయింది.

"ఇదంతా నీవల్లే" అంటూ వెక్కుతూ యమున చెప్పింది వినగానే అమృతకీ పెద్ద షాకే తగిలింది.

యమున కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి బయల్దేరినా అమృత మాత్రం...

"యాసిడ్ పోస్తామని బెదిరిస్తారా? " పళ్ళు నూరుకుంటూ డైరెక్ట్‌గా ఆ ఏరియా పోలీస్‌స్టేషన్ కెళ్ళిపోయింది. రాగింగ్ పేరు చెప్పి యమునని బెదిరిస్తున్న సుధీర్, అక్షయ్, రేవంత్‌ల ముగ్గురి మీదా కంప్లయింట్ ఇచ్చేసింది.

రాగింగ్ అనగానే ఎస్సై కూడా వెంటనే రియాక్టయాడు. అమృతతో కలిసి ఇంటికొచ్చి యమునని, వసంతని కలిసి వాళ్ళ కండిషన్ చూసి మరీ వెళ్ళాడు.

అంతసేపూ యమున పరిస్థితి చూసి బెంబేలెత్తుతున్న వసంత, ఇప్పుడీ వ్యవహారం పోలీసులదాకా తీసుకెళ్ళిన అమృతని చూసి నెత్తీ నోరూ బాదుకుంది. ఇక యమున సరేసరి....

"అంటే వాళ్ళేం చేసినా నోరు మూసుకుని ఊరుకోవాలా? " తను చేసిన పనిలో అమృతకి తప్పేం తోచలేదు. ఎక్కడో చెన్నైలో కంపెనీ ట్రైనింగ్‌లో ఉన్న విశ్వం కూడా ఈ కబురు విని నిర్ఘాంతపోయి వెంటనే ట్రైనింగ్ కాన్సిల్ చేసుకుని ఆఘమేఘాల మీద ఇంటికి ప్రయాణమయ్యాడు.

మరుసటిరోజు ఉదయానికల్లా రాగింగ్ కేసు పెట్టి సుధీర్, అక్షయ్, రేవంత్ ముగ్గుర్నీ పోలీసులు తమ కస్టడీలోకి తీసుకున్నారు. ఈ విషయం బయటకి పొక్కితే తమ కాలేజ్ పరువు పోతుందని యజమాన్యం విశ్వనాథ్ కాళ్ళబేరానికొచ్చింది. అప్పటికప్పుడే వాళ్ళ ముగ్గుర్నీ కాలేజ్ నుంచి డిస్‌మిస్ చేసేసింది కూడా.

ఇంత జరిగాక యమున మాత్రం మళ్ళీ కాలేజ్ కెళ్ళనని భీష్మించుకుని కూర్చుంది. వాళ్ళు తనని ఏదో ఒకటి చేసి కసి తీర్చుకుంటారని, ఆమెలో ఒక రకమైన భయం పేరుకుపోయింది. ఈ గొడవలతో విశ్వం, వసంత కూడా మానసికంగా లోలోపల కుంగిపోయారు. ఆ ఊరు మారితే కుదుటపడతామని కర్ణాటక బార్డర్‌కి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయారు.

అక్కడికెళ్ళినా యమున ఫోబియా తగ్గలేదు. మళ్ళీ కాలేజ్ మొహం చూడలేదు. గడప దాటి బయటకెళ్ళడానికి కూడా చాలా రోజులు సంకోచించేది. కరస్పాండెన్స్ కోర్సులో చేరి అతి కష్టంమీద చివరికి డిగ్రీ మాత్రం పూర్తి చేసింది. తరువాత విశ్వం స్నేహితుడి కొడుకు ప్రశాంత్‌తో యమున పెళ్ళి జరిగిపోయింది.

యమునకి జరిగిన అనుభవం తరువాత వసంత ఆలోచనా దృక్పథంలో చాలా మార్పొచ్చింది. అచ్చమైన ఆడపిల్ల తల్లిలాగా ప్రవర్తించడం మొదలెట్టింది. యముననీ, అమృతనీ అరక్షణం కూడా ఒంటరిగా విడిచి పెట్టేది కాదు. ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా పెళ్ళి చేసి అత్తారింటికి పంపాలని తప్ప వాళ్ళ కెరీర్ గురించి తను కన్న కలలన్నీ మర్చిపోయింది. విశ్వానికి లోలోపల ఆందో

# శ్రీ వెంకటసాయి ఏడ్యుకేషనల్ కన్సల్టెన్సీ


# D.No. 11-571, 6th Line,
అన్నపూర్ణ నగర్, అమరావతి రోడ్,
గుంటూరు-522034.


# MBBS IN CHINA

**2004** వ

సంవత్సరము నుండి

ఇండియా నలుమూలల నుంచి

**CHINA MBBS**

కు పంపుతున్న అగ్రగామి సంస్థ.


డైరెక్టర్ :

**పి.సీతారామయ్య,**

Retd. Andhra Bank Manager

Ph:0863-2255535,
2256186,2216792,
9440257535






శనా, ఒత్తిడీ పెరిగిపోయి హై షుగర్ పట్టుకుంది.

మొదట్నుంచీ ఆర్కిటెక్చర్ చదవాలనేది అమృత కోరిక. కష్టపడి చదివి ఉస్మానియా యూనివర్సిటీలో సీటు సంపాదించింది కానీ ఆడ పిల్లలకా చదువు అంత బావుండదని వసంత వెంటనే అభ్యంతరం చెప్పేసింది.

అమృత నొక్కదాన్నీ పంపి చదివించడానికి విశ్వం కూడా సంకోచించాడు. ఏదిఏమైనా సరే తను మాత్రం వచ్చిన సీటు నొదులుకోనని అమృత పంతం పట్టడంతో, చివరికి ఆమెని ఒంటరిగా పంపలేక విశ్వం కూడా మళ్లీ హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకోక తప్పలేదు.

బి.ఆర్క్ కంప్లీట్ చేసిన వెంటనే అమృతకి ఆకృతిలో జాబ్ రావడంతో వెంటనే జేరిపోయింది. జాయినైన నాలుగు నెలల తరువాత ఇక్కడ జాబ్ చేస్తున్నందుకు, ఆమె మనస్సులో ఈ రోజు మధనం మొదలైంది.

## 4

'ఇప్పుడు తనేం చెయ్యాలి?' ఆ రాత్రంతా అమృత ఆలోచిస్తూనే ఉంది.

అక్షయ్‌ని చూడగానే రిజిగ్నేషన్ లెటర్ వాడి మొహం మీద కొట్టి, తన దారిన తను పోవాలన్నంత కంపరం కలుగుతోంది... కానీ ఒకే ఒక ప్రాబ్లం... అడుగు ముందుకు పడకుండా ఆపుతోంది.

ఆకృతిలో జాయినయిన రోజు తను రాసిన ఏడాది బాండ్ గడువు తీరడానికింకో ఆరేడు నెలల సమయం పడుతుంది. ఆ బాండ్ పిరియడ్ పూర్తి

కాకుండా తను ఆకృతి నుంచి బయట పడడం అసంభవం.

పోనీ అమ్మానాన్నల నేదైనా సలహా అడిగితే? అక్షయ్ విషయం ఎలా చెప్పాలా అని చాలాసేపు ఆలోచించింది గానీ... అయిదు నిమిషాలు ఇంటికి రావడం ఆలస్యమైతేనే అమ్మా నాన్నా ఆందోళన పడిపోతారు. అలాంటిది... అక్షయ్ కంపెనీలో తను వర్క్ చేస్తోందని తెలిస్తే...? ప్రతి క్షణం తన గురించే బెంగపడుతూ కూర్చుంటారు.

వాళ్ళ ఆరోగ్యాలూ, మనశ్శాంతీ పోగొట్టి తను మాత్రం సాధించేదేముంది? దీని కన్నా మౌనంగా ఉండిపోవడం నయం. ఇంకోపక్క యమున ప్రస్తుతమున్న సిట్యువేషన్‌లో ఈ విషయం తెలిస్తే...? ఇంకేమైనా ఉందా?

హడలిపోతుంది.

ఎలాగూ అక్షయ్ తనని గుర్తు పట్టలేదు. ఈ ఆరేడు నెలలూ ఎలాగోలా కళ్ళు







మూసుకుని కామ్‌గా గడిపేయడం కన్నా ప్రస్తుతం వేరే దారి కూడా లేదు. తనని తనే సంబాళించుకుంటూ కూర్చుంది.

ఆకృతి నుంచి తను బయట పడేరోజు కోసం ఈ రోజు నుంచీ రోజులు లెక్క పెట్టుకోవడం మొదలెట్టింది.

★ ★ ★

"కమాన్ గైస్... ఎనీ మోర్ సజషన్స్?" ఎమ్‌డీ రామరాజు, ఆర్కిటెక్ట్స్ అందరూ మీటింగ్‌లో కూర్చుని సిటీ హైట్స్ హోటల్ ప్రాజెక్ట్‌కి సంబంధించిన ప్లాన్‌ని సీరియస్‌గా డిస్కస్ చేస్తున్నారు.

భవిష్యత్తులో పెరిగే పార్కింగ్ అవసరాలని దృష్టిలో ఉంచుకుని బేస్‌మెంట్‌తో పాటు ఫస్ట్ ఫ్లోర్‌లో చాలా భాగాన్ని ఖాళీగా వదులుతూ సీనియర్ ఆర్కిటెక్ట్ ప్రభు తయారుచేసిన ప్లాన్ రామరాజుగారికి బాగా నచ్చింది. కానీ ప్రస్తుతం అంత ప్రదేశం నిరుపయోగంగా వదిలి ఉంచడం కన్నా ఇంకో విధంగా దాన్ని ఉపయోగకరంగా తీర్చిదిద్దాలని సూచించారు.

అప్పటికే చాలా ఐడియాలయ్యాయి. ప్రభుతో పాటు ఆకృతిలో సీనియర్ ఆర్కిటెక్ట్ వినోద్, అమృత కన్నా కాస్త సీనియర్ అయిన దినేష్, అందరూ ప్లాన్ చూస్తూ దీర్ఘాలోచనలో ఉన్నారు.

"సర్! దాన్ని ఫంక్షన్ హాల్‌గా మారిస్తే బావుంటుందని నా ఉద్దేశం" అన్నాడు దినేష్.

"అంత లోసీలింగ్ ఉన్న ఏరియా ఫంక్షన్ హాల్‌గా సూట్ కాదు దినేష్" ప్రభు వెంటనే అభ్యంతరం చెప్పేశాడు.

'లో సీలింగ్...' ఆ మాటకి అమృతకేదో మెరుపు మెరిసింది.

"ఐ హావ్ ఏన్ ఐడియా సర్! దాన్ని కిడ్స్ ఫంక్షన్‌హాల్‌గా తయారుచేస్తే...?"

"కిడ్స్ ఫంక్షన్ హాల్? ఇట్స్ సిల్లీ ఐడియా అమృతా" వినోద్ వెంటనే తీసి పారేశాడు.

అన్ని రంగాల్లోకి అమ్మాయిలు ప్రవేశించినట్లే ఈ ప్రొఫెషన్‌లో కూడా వాళ్ల అధికృత నిరూపించుకోవడం అతనికి పెద్దగా గిట్టదు. ఈ కారణంతోనే వ్యక్తిగతంగా అమృతతో అతనికెలాంటి సమస్యలూ లేకపోయినా అన్ని విషయాల్లోనూ అమృత కడ్డం పడుతూనే ఉంటాడు.

"సర్.. ఈ రోజుల్లో పిల్లల కోసం స్పెషల్‌గా ఫంక్షన్స్, పార్టీలూ చేయడం మామూలైపోయింది. పిల్లలకైతే లో సీలింగ్‌తో పెద్ద ప్రాబ్లం కూడా ఉండదు. వాళ్ల కోసం ఒక మంచి థీమ్‌తో ఫంక్షన్‌హాల్ తయారుచేస్తే తప్పకుండా సక్సెస్ అవుతుంది..." తన ఆలోచనని వివరంగా చెప్పింది అమృత.

"ఐ థింక్ ఇట్స్ నాట్ ఎ బ్యాడ్ ఐడియా" అంతా విన్నాక ప్రభు సాలోచనగా చెప్పాడు. అమృత మోస్ట్ జూనియరైనా వర్క్‌లో ఆమె చూపే క్వాలిటీ అతన్ని బాగా ఇంప్రెస్ చేస్తుంది.

"వెరీగుడ్! ఈ రోజుల్లో ఇలాంటి కొత్త కొత్త ఐడియాలే మనకి కావాల్సింది..." రామరాజుగారు మెచ్చుకుంటూ ఈ ప్రాజెక్ట్‌ని అమృతకి హాండోవర్ చేసేశారు. అమృత చురుకుదనం, ఆమె తెలివితేటలూ చూసి ఆడపిల్లంటే ఇలా ఉండాలని ఆయనకనిపిస్తుంటుంది.

"ఐడియా నాది... ప్రాజెక్టు మాత్రం అమృత కొట్టేసింది..." మనస్సులో కొద్దిగా ఉడుక్కున్నాడు దినేష్. కలువరేకుల్లాంటి కళ్లూ, ముద్దబంతిలాంటి మోముతో అమృత అయస్కాంతంలా అతన్ని ఆకర్షిస్తుంటుంది. కానీ ఆమె టాలెంట్, డైనమిక్ నేచర్ చూసినప్పుడల్లా తనకన్నా జూనియరయిన అమృత తననే మించిపోతుందేమోననే కంగారు మొదలౌతుంది.

ఈ మీటింగ్‌తో తనకేం సంబంధం

లేనట్లు మొబైల్ ఫోన్‌లో మెసేజెస్ చూస్తూ కూర్చున్న అక్షయ్‌ని చూసి రామ రాజుగారు ఏమీ అనలేక మీటింగ్ ముగించి లేచారు.

★ ★ ★

"అక్షయ్...! మన కన్‌స్ట్రక్షన్స్ విజిట్ చేయడానికి నువ్వు కూడా నాతో వస్తే బావుంటుంది"

"ఓ గాడ్! ఈ సిమెంటూ, మట్టీ... అదంతా బోర్. నేను రాను" అక్షయ్ ఠక్కున చెప్పేశాడు. ఇంకేం చేయలేక రామరాజు తనొక్కరే వెళ్లిపోయారు.

చాలాకాలం నుంచీ లండన్‌లో ఉన్న అక్షయ్‌కి అక్కడే ఏదన్నా యాడ్ ఏజన్సీ తెరవాలని, ఆ రంగంలో తన ప్రతిభ చూపించాలని, లండన్‌లోనే హాయిగా సెటిలైపోదామని తప్ప ఆకృతి విషయం లోనే కాదు వాళ్ల నాన్న చేసే ఏ బిజినెస్ మీదా అతనికి ఆసక్తి లేదు. ఇండియాలో ఉండాలని అంతకన్నా ఆసక్తి లేదు.

తను అభివృద్ధి చేసిన బిజినెస్‌లని కాదని తన కొడుకు మళ్లీ కొత్తగా బిజినెస్ మొదలు పెట్టడం చంద్రశేఖర్‌గారికిష్టం లేదు. ఆ కారణంతోనే అక్షయ్ అడిగిన పెట్టుబడి ఇవ్వడానికి ముందు కొంత కాలం ఆకృతి వర్క్ చేయాలని కండిషన్ పెట్టారు. అలాగైనా అక్షయ్ మనస్సు కొంచెమైనా ఇటువైపు మళ్లుతుందని ఆయన ఆశ.

అక్షయ్‌ని ప్రతిరోజూ ఫేస్ చేస్తూ ఆకృ తిలో ఎలా వర్క్ చెయ్యాలో తోచక టెన్షన్ పడిన అమృత అసలు విషయం తెలిసి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. అక్షయ్ వాలకం చూస్తుంటే నెలరోజులున్నా చాలా ఎక్కువని అంతా అనుకుంటుంటే ఆ రోజు తొందరగా వచ్చి అతను ఆకృతినొదిలి వెళ్లి పోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంది.

"అమృతా... అన్నం వడ్డించి అరగం టైంది... రా తల్లీ" అప్పటికే పదిసార్లు పిలిచి ఇక లాభంలేదని తనే వచ్చి చూసింది వసంత.

టీస్కేల్ సహాయంతో సెట్‌స్క్వేర్స్ రెండూ పుచ్చుకుని, ఏదో బిల్డింగ్ ఎలివే షన్ డిజైన్‌ని తయారుచేస్తున్న అమృతని తనే బలవంతంగా భోజనానికి లాక్కెళ్లి పోయింది.

"నన్ను డిస్టర్బ్ చెయ్యడం తప్పితే నీకు వేరే పనేం లేదా? " అమృత విసుగ్గా వచ్చి కూర్చుంది.

"ఇందుకే ఆడపిల్లకి చదువొద్దని మొత్తు కున్నాను. పగలంతా ఆఫీసులో పని. అది చాలక కట్టే ప్రతి బిల్డింగు చుట్టూ పది సార్లు తిరగడం... అదంతా సరిపోదని ఇంటికొచ్చి ప్లాన్‌లు గీసుకోవడం వేళకి తిండి కూడా తినకుండా ఏం ఉద్యోగాలో ఏమిటో...? " వసంత వెంటనే క్లాసు మొదలెట్టేసింది.

"అదోపక్క అలిసిపోయుంటే ఇంకోపక్క నీ గోలేంటి వసూ" అమృత మీద ఈగ కూడా వాలనివ్వని విశ్వాన్ని చురచురా చూస్తూ... "అదేగా నా గోల కూడా... ఇదిలా ఉంటే రేపొద్దున్న.." మళ్లీ మొద లెట్టబోయింది.

"అమ్మా! అక్క దగ్గర్నుంచి ఫోనేమైనా వచ్చిందా? " యమున పేరెత్తితే అమ్మ అన్నీ మర్చిపోతుందని అమృతకి బాగా తెలుసు. వెంటనే వసంత చల్లబడిపో యింది.

"సాయంత్రం యమున ఫోన్ చేసింది. ఆరోగ్యం బావుందట. ప్రశాంత్ కూడా తొందరగా ఇంటికొచ్చి దాన్ని జాగ్రత్తగా చూసుకుంటున్నాట్ట.." అంటూ యమున విశేషాలు మొదలెట్టింది.

"అక్కని చూసి చాలా రోజులైంది. ఎప్పుడొస్తుందమ్మా" నవ్వుకుంటూ అడి గింది అమృత.





"ఇంకో రెండు నెలల్లో ఏడోనెల రాగానే తీసుకొచ్చేస్తాను" అంటూ ఏరోజు తీసుకొస్తే మంచిదో అప్పుడే పంచాంగం కూడా చూడడం మొదలెట్టిన వసంత తొందర చూసి అమృతా, విశ్వం ఇద్దరూ ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు.

★ ★ ★

"అసలీ అమృత ఏమనుకుంటోంది? అవసరం లేని పనులన్నిటిలో తనెందుకు దూరుతుంది?"

పొద్దుట్నించీ ఒకటే గింజుకుపోతున్నాడు దినేష్.

సివిల్ ఇంజనీర్ సురేష్‌కి అనుకోకుండా ఏదో ప్రాబ్లమొచ్చి అర్జంటు వర్కేదో పెండింగ్‌లో ఉండిపోయి కంగారు పడుతుంటే అమృత తనంతట తనే వెళ్ళి అతని పనిలో హెల్ప్ చేసి రామరాజుగారేమీ అనకుండా కాపాడిందట.

"రియల్లీ దినేష్! అమృత లాంటి మంచి అమ్మాయినెక్కడా చూడలేదు" ఆ రోజు



ఉదయం అమృత గురించి దినేష్‌కి చెప్పి ఆమెని సురేష్ తెగ మెచ్చుకున్నాడు. అప్పట్నుంచీ ఉడుక్కుంటూనే ఉన్నాడు దినేష్.

ఇక ఉండబట్టలేక సీరియస్‌గా అమృత కాబిన్ కెళ్లిపోయాడు.

"అమృతా... నిజంగానే మీరు నిన్న సురేష్‌కి బ్లూప్రింట్స్ తయారుచేసిచ్చారా?" జలసిగా అడిగాడు.

"యా..." కాజువల్‌గా చెప్పి తన పని చేసుకోసాగింది. వెంటనే కుర్చీ లాక్కుని ఆమె ఎదురుగా కూర్చుని,

"యు నో... అమృతా! మీరింకా జూనియర్... జాబ్‌కి కూడా కొత్తే... మీరిలా అన్ని పన్లూ నెత్తినేసుకున్నారంటే ఆ సురేషేంటి అందరూ ఏదో సాకు చెప్పి మీకన్ని పన్లూ అంటగడతారు. అది తెలుసుకోండి" ... హితబోధలు మొదలెట్టబోయాడు.

"థాంక్స్ ఫర్ యువర్ అడ్వైజ్... బట్ దినేష్, ఎవరికైనా అవసరమైనప్పుడు సహాయం చేయడం నాకలవాటు. అలాగే హద్దులు దాటితే ఎవర్ని ఎక్కడుంచాలో కూడా నాకు బాగా తెలుసు. కంగారు పడకండి"

తన దగ్గర దినేష్ అతిచనువు తీసుకోవాలని ప్రయత్నించడం చూసి అమృత మెత్తగానే చెప్పింది. దినేష్ కామాట మొట్టికాయలా తగిలి మొహం మాడ్చుకుని వెళ్ళక తప్పలేదు.

వీడొచ్చి రెండునెలలైపోయినా ఇంకా ఇక్కడే ఉన్నాడెందుకో? అక్షయ్‌ని చూస్తే చాలు వంటికి కారం రాసుకున్నట్లు అమృత ఒళ్ళంతా మండిపోతుంది.

ఏదో టైంపాసుకొస్తాడు తప్పితే ఆఫీస్ వర్క్‌లో అసలు కల్పించుకోడు కాబట్టి అక్షయ్‌తో ప్రాబ్లమేమీ లేకపోయినా అతనున్న పరిసరాల్లో తనుండడం లోలోపల అమృతకేదో అపరాధ భావన కలిగించేది. మాటవరసకైనా అతనితో మాట్లాడాలంటే మొహం మాడిపోయేది.

"హి ఈజ్ వెరీ హాండసమ్.. నైస్ గై" అంటూ ఆఫీస్‌లో మిగిలిన అమ్మాయిలంతా అక్షయ్ రంగూ, రూపం చూసి అడ్మైర్ చేస్తుంటే అతని అసలు రంగు బయటపెట్టాలని కసిగా ఉండేది.

ఆకృతి నుంచి తనెళ్ళేరోజు ముందొస్తుందో లేక అక్షయ్ వెళ్ళేరోజు ముందొస్తుందో అనుకుంటూ అమృత ఎదురుచూస్తుండేది. కానీ అంతకన్నా ముందే యమున డెలివరీకొచ్చే రోజొచ్చేసింది.

"వావ్! అక్కా నువ్వేనా...? లుకింగ్ గ్రేట్...!" భారంగా, బరువుగా నడుస్తూ ట్రైన్ దిగిన యమునని ఆశ్చర్యంగా చూస్తూ గట్టిగా చుట్టేసింది.

"అమృతా జాగ్రత్త! అదసలే ఒట్టిమనిషి కాదు" వసంత వారించింది.

"అది చాలా కేర్‌ఫుల్‌గా ఉంటుంది ఫర్వాలేదమ్మా" నవ్వుతూ చెల్లెల్ని వెనకేసుకొచ్చింది యమున.

యమున వచ్చి దగ్గర్నుంచీ ఇంటికి కొత్త కళ వచ్చిందని వసంతా, విశ్వం మురిసిపోతుంటే,

అక్కతో కబుర్లు చెప్తూ అమృత సరదాగా కాలక్షేపం చేయసాగింది.

"ఇంతకీ మీ ఆఫీసు విశేషాలేంటే? వర్కెలా ఉంది?" భోజనం మధ్యలో అమృతనడిగింది యమున. అంతే అమృతకి అక్షయ్ గుర్తుకొచ్చి పొలమారిపోయింది.

"అమృతా! హోటల్ ఇనాగ్రేషన్‌కి వెళ్తున్నానన్నావుగా? మరి తయారవలేదేం?" సిటీ హైట్స్ హోటల్ ప్రారంభానికి బయలుదేరుతున్న అమృతని ఆశ్చర్యంగా చూస్తూ యమున అడిగింది.

"అయ్యానుగా..." బ్యాగ్ తీసుకుంటూ చెప్పిన అమృత రోజూలాగే జీన్స్, టీషర్ట్‌తో కాజువల్‌గా ఉండడం చూసి




## మగకప్పగారి బాధ్యతా స్పృహ

యూరోపియన్ మిడ్‌వైఫ్ టోడ్ అనే ఈ మగకప్ప నీటివనరులకు దగ్గరగా ఉండే బొరియలో నివసిస్తుంది. అది ఫలదీకరణం చెందిన ఆడకప్ప గుడ్లబారును ఇలా వీపుమీదకు తెచ్చుకుని కొన్నివారాలు అనేక ప్రయాసలకోర్చి మోసుకుంటూ తిరుగుతుంది. చివరికి గుడ్లు పొదుగుకు వచ్చినప్పుడు నీళ్లలోకి తన వెనుక పాదాలను, వీపును ముంచుతుంది. వాటిలోంచి పిల్లలు బయటికి వచ్చిన తర్వాత ఎంచక్కా తన బొరియలోకి వెళ్లి రొటీన్ జీవితంలోకి పడిపోతుంది.



యమున...

"ఇవాళైనా కాస్త అందంగా తయారైతే బావుంటుంది కదా" అంది మళ్ళీ.

"అక్కా... ఇవాళ అందంగా తయారైతే బావుండేది నేను కాదు, ఆ హోటల్" అమృత నవ్వేసింది.

"అలా కాదే...! ఈ రోజు అందరూ స్పెషల్‌గా రెడీ అయివస్తారు. నువ్విలా వెళ్తే అంతా ఏమనుకుంటారు" నెమ్మదిగా నచ్చజెప్పబోయింది.

"అలా దానిక్కాస్త గడ్డి పెట్టమ్మా యమునా... నేను చేప్తే ఎలాగూ వినదు. ఆ అవతారం చూసి చూసి విసుగొచ్చేస్తోంది. దాని కోసం కొన్న చీరలూ, చుడీదార్లూ బీరువా నిండా పెట్టుకుని ఆ వెలిసిపోయిన పాంట్లేసుకుని మగరాయుడిలా తిరుగుతుంది" ఈలోగా వసంత కూడా వచ్చేసింది.

"అమ్మా... నువ్వు మరీ టూమచ్‌గా మాట్లాడుతున్నావు" టైమైపోతోందని తనోపక్క హడావిడి పడుతుంటే మధ్యలో ఈ సాధింపులకి అమృతకి చిరాకొచ్చింది.

గొడవ ముదురుతోందని గ్రహించి మధ్యలో, యమున కలగజేసుకుని...

"అదికాదే అమృతా! నువ్వు మన కల్చరొదిలేసి ఆ వెస్ట్రన్ కల్చర్‌ని ఫాలో అవుతున్నావని అమ్మ ఫీలవుతోంది" ఏదో సర్ది చెప్పబోయింది.

"అలాగా...! ఐతే అమ్మ చెప్పే ఆ మగరాయుళ్ళు కూడా మన కల్చరైన పంచ, కండువా ఎప్పుడో వదిలేసి పాంటూ, షర్టూ వేసుకుని వెస్ట్రన్ కల్చర్‌నే ఫాలో అవుతున్నారని అమ్మకి చెప్పు" ఎదురుగా కనిపించిన నాన్నని చూపించి మరీ అమృత చెప్పిన జవాబుకి యమునకి ఒక్కక్షణం నోటమాట రాక వాళ్ళమ్మకేసి నిస్సహాయంగా చూసింది.

"మనం ఎడ్డెమంటే అది తెడ్డెమంటుందని తెలిశాక కూడా దీనితో వాదించడం మనదే తప్పు" అంతకన్నా ఏమనాలో వసంతకీ తోచలేదు. ముడుచుకున్న వాళ్ళిద్దరి మొహాలూ చూసి...

"జారిపోయే చీరలు సర్దుకుంటూ, ఎగిరిపోయే చున్నీలు పట్టుకుంటూ చేసే ఉద్యోగం కాదు నాది. వర్కర్స్‌తో కలసి తిరుగుతూ పని చేసేటప్పుడు వీటిల్లో ఐతే తేలిగ్గా, హాయిగా తిరగచ్చు కాబట్టే ఈ డ్రస్ ప్రిఫర్ చేస్తానంతే... అమ్మా ఇంక రోజూ నువ్వు చేసే ఆ గడ్డి పెడితే తినివెళ్తాను" చిలిపిగా చెప్పి నవ్వింది.

"ఈ సిసింద్రీకి చెప్పడం మనవల్ల కాదే యమునా" వస్తున్న నవ్వునాపుకుంటూ అంది వసంత.

తమ వాదనలో గెలుపు అమృతదయినా, తను మాటలు నేర్పిన తన కూతురి చేతిలో ఓడిపోవడంలోని ఆనందాన్ని ఆ అమ్మ మనసు మనస్ఫూర్తిగా ఆస్వాదించింది.




పెద్ద అడవి... అక్కడక్కడా పెద్ద పెద్ద వృక్షాలు, దట్టంగా పెరిగిన కొమ్మలు, రెమ్మలతో ఆకాశాన్ని మూసివేస్తున్నాయి. పట్టుకుచ్చులాంటి పచ్చిక నేలంతా సుతిమెత్తగా పరుచుకుంది. ఛెంగున ఎగిరే జింక పిల్లలూ, గాండ్రిస్తున్న పెద్దపులులూ, నీళ్ళలో జలకాలాడుతున్న ఏనుగులూ,

అల్లరిగా ఆటలాడే కుందేళ్ళూ... రకరకాల జంతువులతో ఆ అడవి శోభాయమానంగా ఉంది.

"వండర్ ఫుల్...! మార్వలెస్...! ఫాంటాస్టిక్...!"

అది అడవి కాదు అమృత క్రియేషన్ అని అప్పుడే తెలుసుకున్న ఆహూతు లంతా ఆశ్చర్యంగా చుట్టూ చేరి కురిపి స్తున్న అభినందనల వర్షంలో అమృత ఉక్కిరిబిక్కిరౌతోంది.

"అమృతా! అసాధ్యురాలివమ్మా"... మినిమం బడ్జెట్ తో ఆ హాలు గోడలమీదా సీలింగ్ పైనా అద్భుతమైన పెయింట్ వర్క్ చేయించి, నేలపైన కార్పెట్స్ వేయించి, అసాధారణమైన లైటింగ్ ఎఫెక్ట్ తో అత్యంత సహజంగా పిల్లల కోసం ప్రత్యేకంగా అమృత సృష్టించిన ఆ ఫంక్షన్ హాలే ఆ హోటల్ కి పెద్ద ఆకర్షణగా తయారవడంతో రామరాజుగారి ఆనందాని కంతులేదు.

"కీపిటప్... అమృతా...! యూ కెన్ డూ వండర్స్" ప్రభు మనస్ఫూర్తిగా ప్రోత్స హిస్తూ అభినందించాడు.

విమర్శించడానికి వంకలకోసం వెతికిన వినోద్ కూడా "నైస్ వర్క్" అని మెచ్చు కోక తప్పలేదు.

"ఐనో...! ఇది పర్ ఫెక్ట్ గా ఫంక్షన్ హాల్ గానే సూటవుతుందని నేనప్పుడే చెప్పాను" ఆ ఐడియా తనదని చెప్పుకోడా నికి దొరికే ఏ ఒక్క అవకాశాన్నీ దినేష్ వదులుకోడు.

"ఫాంటాస్టిక్ అమృతా... కంగ్రాట్యులేషన్స్" అంటూ షేక్ హాండిచ్చారెవరో.

"థాంక్యూ..." ఆ చెయ్యి అక్షయ్ దని అప్పుడే గమనించి చటుక్కున వెనక్కి తీసుకుంది.

"అమృత ఇంత టాలెంటెడా? " అక్షయ్ మొట్టమొదటిసారిగా ఆరోజే అమృతని పరిశీలనగా పరికించి చూస్తున్నాడు.

# అమ్మానాన్నలకు నా కానుక



**అనూరాధ**

అనూరాధ నా కలం పేరు. అసలు పేరు కమలా విజయకుమార్. నివాసం విశాఖపట్టణం. ఇప్పటివరకూ మూడు నవలలు, నాలుగైదు కథలు రాశాను. మొదటి నవల 'తోడొకరుండిన..' 2006 'స్వాతి' మాసపత్రిక అనిల్ అవార్డుకు ఎంపికైంది.

ప్రతిష్ఠాత్మకమైన 'చతుర' మాసపత్రిక నిర్వహించిన నవలల పోటీలో నా'ఆకృతి'కి ప్రోత్సాహక బహుమతి లభించడం అపురూపమైన అదృష్టంగా భావిస్తున్నాను.

అరవై వసంతాలు పూర్తిచేసుకున్న అమ్మ నాన్నలు హైమవతి, పెమ్మరాజు సత్యనారాయణరావులకు ఈ రచనను చిరుకానుకగా సమర్పించే అవకాశం కల్పించిన 'చతుర'కు హృదయపూర్వక ధన్యవాదాలు.

***నా చిరునామా :***

ఎం.కమల (అనూరాధ), W/o ఎం.వి. విజయకుమార్, ఫ్లాట్ నెం: 401, ఈశ్వర్ వినయగర్ ప్యాలెస్, సి.బి.ఎం. కాంపౌండ్, విశాఖపట్నం-3



★ ★ ★

"ఫాస్టని తెలుసుగానీ ఇంత సూపర్ ఫాస్టనుకోలేదు"...

"ఏదో పాపం ఆడపిల్లనుకుంటే ఇట్లా నాకే ఎసరు పెట్టేస్తుందా? ఇంతకన్నా అన్యాయం ఇంకేముంటుంది సార్"... వినోద్‌తో చెప్పుకుని దినేష్ గగ్గోలు పెట్టే స్తున్నాడు.

ఆ రోజు మీటింగ్‌లో రామరాజుగారు లేటెస్ట్‌గా చేయబోయే, అరుదైన ప్రాజెక్ట్‌లో ప్రభుతో పాటు అమృతకి అవకాశాన్ని వ్వడం దినేష్‌కి మింగుడు పడటం లేదు. ఆ ప్రాజెక్ట్ మీద దినేష్‌కి ఇంట్రస్టుంది కాబట్టి అది అతనికివ్వడం బెటరని వినోద్ వెంటనే సజెస్ట్ చేశాడు. తనకెవరైనా ప్రాబ్లెం లేదని చెప్పి ప్రభు తప్పుకున్నాడు. ఆ ప్రాజెక్ట్‌కి అమృత రైట్ ఛాయిస్ అని అక్షయ్ కూడా తన నిర్ణయాన్ని బలపరచ డంతో రామరాజుగారు పునరాలోచన చెయ్యలేదు.

"ఏం చేస్తాం దినేష్... ఎమ్‌డీతో పాటు డీఎమ్‌డీ కూడా అమ్మాయి కదా అని అమృత మీద స్పెషల్ ఇంట్రస్టు చూపిం చాడని నా అనుమానం. లేకపోతే ఆ ప్రాజెక్ట్ తప్పకుండా నీదే..." అన్నాడు వినోద్.

"అంతే...సర్ అంతే...! ఆడపిల్ల కాబట్టే ఆమె చేతికెళ్ళింది" అలా అనుకున్నాక గానీ దినేష్ ఈగో శాటిస్‌ఫై అవలేదు. అంతేగానీ శక్తిసామర్థ్యాలు చూసి ఆ ప్రాజెక్ట్ ఆమెకిచ్చారని మాత్రం మాటవరస కైనా అనుకోలేదు.

★ ★ ★

"పాపం! తను రాలేకపోయినందుకు నిన్నట్నుంచీ బావ సారీలు చెప్తున్నాడు కదక్కా..." ప్రశాంత్ వస్తానని చెప్పి రాక పోవడంతో యమున అలిగి పడుకుంది.

"ఈ టైంలో నువ్విలా మూడీగా ఉంటే లోపల బేబీకెలా ఉంటుంది చెప్పు...?" అమృత బతిమాలుతోంది.

"ఆ ఆలోచన ఆయనకుండాలి కదా? ఈ టైంలో నేనింతగా ఎదురుచూస్తున్నా నని తెలిసి కూడా నన్ను డిజప్పాయింట్ చేశారు" యమున కోపమింకా తగ్గలేదు.

"అనుకోకుండా అర్జంట్ వర్కొస్తే తను మాత్రం ఏంచేస్తాడు. అర్థం చేసుకో"

"బాగానే అర్థం చేసుకున్నాను. ఆయనకి నామీద అస్సలు ప్రేమ లేదు. ఉంటే ఎలా గోలా వచ్చేవారు" అప్పటికే యమున కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమె సున్నిత మైన మనసు ఏ చిన్న ఆశాభంగాన్నీ తట్టు కోలేదని బాగా తెలిసిన అమృతకి జాలే సింది. అందుకే...

"బావకి నీ మీద ప్రేముంది కాబట్టి నిన్ను బాధ పెట్టినందుకు తను బాధపడుతూ, నువ్వెలా ఉన్నావోనని ఆందోళన పడుతూ గంటకోసారి ఫోన్ చేస్తున్నాడు. చూస్తున్నావు కదక్కా..." మెల్లగా సర్దిచెప్పాలని చూసింది.

"ఫోన్‌దేముంది..? ఉన్న చోట నుంచి కదలకుండా ఎన్నిసార్లైనా చెయ్యచ్చు ఇంకెన్ని మాటలైనా చెప్పచ్చు" ఆ విష యాన్ని యమునసలు లెక్కలోకి తీసుకోలే దని గ్రహించి అమృత చిన్నగా నవ్వింది.

"అవునక్కా... ఎన్ని సార్లైనా ఫోన్ చెయ్యచ్చు మాట్లాడచ్చు అది నిజమే కానీ అన్నిసార్లు బావకి నువ్వు గుర్తొచ్చా వని, నిన్ను తలుచుకుంటున్నాడనీ, నీ గురించి ఆలోచిస్తున్నాడనీ నువ్వెందుకను కోవు? అదే కదా ప్రేమంటే...!

ఎక్కడున్నా... ఇంకెంత దూరంలో ఉన్నా అనుక్షణం మన మంచి కోరు కుంటూ, మన క్షేమం కోసం తాపత్రయప డుతూ, మన సంతోషం కోసం తపనప డుతూ, మన కోసం ఆరాటపడే మనస్సు

పడే స్పందనే నిజమైన ప్రేమ.

అదే ప్రేమ నువ్వు కూడా బావమీద చూపించు. తనిప్పుడెంత పని వత్తిడిలో ఉన్నాడో ఆలోచించు.

వద్దామని ఎంత ఆశ పడినా రాలేకపోయినందుకు, నీలాగే తను కూడా ఎంత నిరాశ పడుతున్నాడో ఒకసారి ఊహించుకుంటే నువ్వెప్పుడూ ఇలా మాట్లాడవు" సుతిమెత్తగా చెప్తున్న అమృతని యమున ఆశ్చర్యంగా చూసింది. తన అలక సంగతి మర్చిపోయి.

"అమృతా... ప్రేమ గురించి ఇన్ని కబుర్లు చెప్తున్నావంటే... కొంపదీసి ఎవరి ప్రేమలోనైనా పడ్డావా...? " అనుమానంగా అడిగింది.

"యా" నవ్వుతూ చెప్పిన అమృతని చూసి

"ఈ విషయం అమ్మకీ నాన్నకీ తెలుసా...? " కంగారుపడుతూ అడిగింది యమున.

"ఎప్పుడో తెలుసు"

"అంటే...? తెలియంది నాకేనా...? " తనకెవరూ చెప్పలేదని అప్పుడే మూతి ముడిచేసింది యమున.

"నీకూ తెలుసనుకున్నానే" అల్లరిగా అడిగిన అమృతని చూసి ఆవేశంగా

"ఎవరూ చెప్పకపోతే నాకెలాతెలుస్తుంది? అయినా నాతో చెప్పాల్సిన అవసరం నీకేముందిలే? పెద్దదానివైపోయి పెద్ద ఉద్యోగం కూడా వెలగబెడుతున్నావుగా" నిష్టూరాలు మొదలెట్టింది.

"దట్సిట్... ఐ లవ్ మై ప్రొఫెషన్" ఇక ఆగలేక అమృత గట్టిగా నవ్వేసింది.

"నిన్నూ..." అమృత తనని ఆటపట్టించిందని అప్పుడే తెలిసి ఉక్రోషంగా ఒక్కటేసింది యమున.



**"అమృతా... ప్రేమ గురించి ఇన్ని కబుర్లు చెప్తున్నా వంటే... కొంపదీసి ప్రేమలో పడ్డావా...?" అనుమానంగా అడిగింది. "యా" నవ్వుతూ చెప్పిన అమృతని చూసి "ఈ విషయం అమ్మకీ నాన్నకీ తెలుసా...? " అడిగింది యమున.**



★ ★ ★

"మొదట ఛైర్మన్‌గారింటికి పోనీ..." కారెక్కాక ప్రభు డ్రైవర్‌కి చెప్తుంటే అమృత విని -

"అక్కడికెందుకు సర్..."! ఆశ్చర్యంగా అడిగింది. ఆ రోజు రొటీన్‌గా చెయ్యాల్సిన కొన్ని సైట్ విజిట్స్‌కి ప్రభు, అమృత కలిసి బయల్దేరారు.

"ఏం లేదు. ఫీవరని అక్షయ్ రెండ్రోజుల నుంచీ ఆఫీస్‌కి రావటంలేదుకదా. అతనిచేత కొన్ని సంతకాలు చేయించుకు రమ్మని ఎమ్‌డి గారు చిన్నపని చెప్పారు" అన్నాడు ప్రభు.

"ఖర్మ..! ఆఖరికి అక్షయ్ ఇంటిక్కూడా వెళ్లాల్సొస్తోంది" లోలోపలే చిరాకు పడుతూ కూర్చుంది.

జూబ్లీహిల్స్‌లో ఉన్న చంద్రశేఖర్‌గారిల్లు తను ఊహించుకున్నట్లు పెద్ద భవనం కాకుండా బొమ్మరిల్లులా చిన్నగా, చూడ ముచ్చటగా కనిపిస్తుంటే అమృత కొద్దిగా ఆశ్చర్యపడింది.

పనివాడో, వంటవాడో తెలీదు. అతనే వాళ్ళని హాల్లో కూర్చోపెట్టి అక్షయ్‌ని పిలుచుకు రావడానికి పైకెళ్ళాడు. సోఫాలో కూర్చుని ఆ ఇంటినీ, అక్కడి ఇంటీరియర్స్‌నీ అలవాటుగా పరికించసాగింది అమృత.

చంద్రశేఖర్‌గారి భార్య చాలాకాలం క్రితమే చనిపోయారని ఆమెకి అంతకు ముందే తెలుసు.

"గుడ్‌మార్నింగ్ అక్షయ్. హౌ ఆర్ యూ? " ప్రభు పలకరింపు విని అక్షయ్ వచ్చి కూర్చున్నాడని అమృత అప్పుడు గమనించింది.

"జస్ట్ ఫీవరే.. నో ప్రాబ్లం" అక్షయ్ అతి







మామూలుగా చెప్పాడు.

"అదైనా సరే జాగ్రత్తగా ఉండాలి. మందులు వాడుతున్నారా...?" ప్రభు కుశలప్రశ్నలు మొదలెట్టాడు.

"డోంట్ వర్రీ ప్రభూ... అయాం ఫైన్" అంటూ మౌనంగా కూర్చున్న అమృతకేసి తిరిగి అక్షయ్.

"అమృతా... మీరు నాకో చిన్న పని చేసిపెట్టాలి" రిక్వెస్ట్ చేశాడు.

"ఎస్ సర్..." పళ్ళబిగువున చెప్పక తప్పని తన పరిస్థితికి తనని తనే తిట్టుకుంది.

"మా నాన్నమ్మ పక్షవాతంలో బాధపడుతోంది. ప్రసుత్తం ఆవిడ రూమ్ ఆవిడకేమాత్రం అనుకూలంగా లేదు. ఆ డిజైన్ మార్చి దాన్ని రెన్నోవేట్ చేయండి" అని ఆ పక్కనే ఉన్న ఆవిడ రూమ్ చూపించమని పనివాడికి చెప్పి ఆమెని లోపలికి పంపాడు.



సుమారు డెబ్భై సంవత్సరాలుగల నాన్నమ్మ మంచంమీదున్నారు. ఆవిడ అవసరాలని చూసే మెయిడ్ కూడా అక్కడే ఉంది. అమృత వచ్చినపని చెప్పి పనివాడు పరిచయం చేస్తే తలూపి ఊరు కుందావిడ.

తన బ్యాగ్‌లో ఎప్పుడూ ఉండే టేప్ తీసి అమృత చకచకా కొలతలు తీసుకుంటూ వాటిని నోట్ చేసుకుంటుంటే ఏ భావమూ లేకుండా చూస్తోందావిడ. అన్ని కొలతలూ తీసుకుని ఆఖరుగా ఆవిడ పడు కున్న మంచం కొలతలు తీస్తుంటే మాత్రం మెల్లగా లేచి కూర్చోడానికి ప్రయత్నిస్తుంటే మెయిడ్ సహాయం చెయ్యబోయింది.

వద్దని ఆమెని వారించి తనే నెమ్మదిగా లేచి కూర్చుందావిడ. పక్షవాతంతో ఆవిడ కాళ్ళు చచ్చుబడిపోయాయని గ్రహించిన అమృత జాలిగా చూసి...

"మీకే రంగులు నచ్చుతాయో చెప్తే ఆ రంగులు వాడి మీ గదిని అందంగా తయారుచేస్తాను" నెమ్మదిగా అడిగింది.

"ఏదైతే ఏముంది? నాకిప్పుడన్నీ



ఒక్కటే..." నిర్లిప్తంగా చెప్పి కళ్ళు మూసుకున్నారు నాన్నమ్మ.

"బాగా డిప్రెషన్‌లో ఉన్నట్టున్నారు" అనుకుంది అమృత మనసులో.

★ ★ ★

"ఛ...! పోయి పోయి ఆ అక్షయ్ ఇంటి కోసం కూడా తనే పని చేయాల్సి రావాలా...?" అనవసరంగా అక్కడికెళ్ళి ఇరుక్కున్నందుకు అమృతకి తన మీద తనకు కోపంగా ఉంది.

అయినా ఆ ఇల్లు అక్షయ్‌దొక్కడిదే కాదుగా. చంద్రశేఖర్‌గారిది కూడా... అలాగే ఆ పని కూడా అక్షయ్ కోసం కాదు అసహాయురాలైన వాళ్ళ నాన్నమ్మ కోసం... తనకి తనే సర్ది చెప్పుకుంటూ ఆవిడ రూం కోసం ఎలాగైతేనేం చివరికో స్కెచ్ తయారుచేసి అక్షయ్‌కి చూపించింది.

"ఫైన్... వీలైనంత తొందరగా పని మొదలెట్టండి" వెంటనే చెప్పేశాడు.

"మిగిలినదంతా ఓకె. కానీ కలర్ స్కీమ్ ఇంకా డిసైడ్ కాలేదు" ఎటో చూస్తూ చెప్పింది అమృత.

"కలర్ స్కీమ్...?" అర్థం కానట్లు మొహం పెట్టిన అక్షయ్‌ని మింగేసేలా చూసింది. కాలేజీ రోజుల్లో కలర్స్ మీద అతను చేసిన చేసిన స్కీములు చెప్పాలనిపించింది.

"ఏదైనా ఒక రంగు ప్రధానంగా తీసుకుని దానికి సరిపోయే రంగులు ఉపయోగిస్తూ, ఆ గదిలోని ప్రతి ఒక్క వస్తువూ ఉండేటట్టు చూడడమే కలర్ స్కీమంటే" పొడిపొడిగా వివరించింది.

"రియల్లీ! ఐతే మీరు మా నాన్నమ్మనడిగి డిసైడ్ చేయాల్సింది" అన్నాడు.

"అడిగాను కానీ చెప్పలేదు. ఆవిడకి నచ్చే రంగులేవో మీరే చెప్పండి" అంటూ నోట్ చేసుకోవడానికి పెన్సిల్ తీసుకుంది.

"ఐ డోంట్ నో" భుజాలెగరేశాడు. ఆ తర్వాత "పోనీ ఇప్పుడున్నకలరే కంటిన్యూ చేసేయండి..." అంటూ అక్షయ్ ఇచ్చిన ఉచిత సలహాకి ఒళ్ళుమండి-

"ఆవిడ డిప్రెషన్‌కి సగం కారణం ఆ కలరే" టక్కున అనేసింది.

అక్షయ్ అమృతకేసి సూటిగా చూస్తున్నాడు. ఆమె ప్రవర్తన అతనికెప్పుడూ చాలా చిత్రంగా తోస్తుంటుంది. ఆఫీస్‌లో అందరూ తనకి గౌరవం ఇస్తూ తనతో చాలా మర్యాదగా ప్రవర్తిస్తారు. కానీ అమృత మాత్రం తనేదో తప్పు చేస్తే దండించే టీచర్‌లా తనతో కొట్టినట్లు మాట్లాడుతుంది. కోపంగా చూస్తుంది. అదొక్కటే కాదు. ఈ అమ్మాయి తనకెక్కడో తెలుసని తనకెందుకనిపిస్తుంది.?

"పోయిన సంవత్సరం తాతయ్య పోయాక ఆ షాక్‌తో ఆవిడకి పక్షవాతం వచ్చింది. అప్పటినుంచీ డిప్రెషన్‌లోనే ఉంది. కానీ ఆవిడ డిప్రెషన్‌కీ ఆ రూంకున్న కలర్‌కీ సంబంధమేమిటి?" తనే మళ్ళీ అడిగాడు.

"చాలా ఉంది. మన చుట్టూ ఉండే రంగుల ప్రభావం మనమీద తప్పకుండా ఉంటుంది. మీ నాన్నమ్మగారి రూమ్‌ని గమనిస్తే ఆ గదిలో ఉన్నది ఒకే ఒక పెద్ద విండో. అది కూడా ఉత్తరం దిక్కులో ఉంది. దానివల్ల ఉదయం నుంచీ సాయంత్రం వరకూ ఆ గదికి ప్రవేశించే కాంతి ఎప్పుడూ ఒకే విధమైన వెలుతురునిస్తుంది. ఆ గది గోడలకి ప్రస్తుతంఉన్న ముదురు నీలిరంగు ఆ కాంతినింకా తగ్గిస్తూ నిస్తేజమైన వెలుతురునీ, నిరాసక్తమైన వాతావరణాన్నీ కలిగిస్తోంది.

అనారోగ్యంతో మంచం పట్టిన మీ నాన్నమ్మగారు ఇరవై నాలుగ్గంటలూ ఆ గదిలోనే ఉండడం వల్ల ఆ నిరుత్సాహకర

మైన వాతావరణం ఆవిడపైన తన ప్రభావం చూపిస్తోంది. అదే చాలావరకూ ఆవిడ డిప్రెషన్‌కి కారణం" టకటకా చెప్పేసింది.

"రియల్లీ... ఇందులో ఇంత సైన్సుందని నాకిప్పుడే తెలిసింది. నాన్నమ్మ రూమ్‌కి సరిపోయే కలర్ స్కీమ్‌ని మీరే డిసైడ్ చేయండి" అక్షయ్ వెంటనే చెప్పేశాడు.

"కాంతి తక్కువగా ఉన్న ఆ గదికి పసుపురంగు ప్రకాశవంతం చేస్తుంది. అలాగే ఆ రంగు ఉత్తేజాన్నీ, ఉల్లాసాన్నీ కలిగిస్తుంది. అందువల్ల ఆ కలర్‌స్కీమ్ తీసుకోవడం బెటరని నా ఉద్దేశం" అని చెప్పి ఊరుకుంది.

"ఓకె.. మీ ఇష్టం" అదంతా ఆమె నిర్ణయానికే వదిలిపెట్టేశాడు.

'టాలెంట్‌తో పాటు తలబిరుసు కూడా ఎక్కువే' అంతసేపూ ముళ్ళమీద కూర్చున్నట్లున్న కూర్చున్న అమృత వెళ్ళిపోయాక కూడా అక్షయ్ ఆమె గురించే ఆలోచిస్తున్నాడు.




"నువ్వే చూస్తున్నావు కదా యమునా! దాని వయసు అమ్మాయిలంతా ఫ్యాషన్లనీ, బ్యూటీ పార్లర్లనీ తిరుగుతుంటే ఇది మాత్రం ఆ బిల్డింగూ ఈ బిల్డింగూ అంటూ తిరుగుతుంది. ఆ ఇల్లెలా కట్టాలీ, ఈ ఇల్లెలా కట్టాలీ అని గంటలు ఆలోచిస్తూ ప్లాన్‌లు గీస్తుంది కానీ తన గురించి మాత్రం ఒక్కనిమిషం కూడా ఆలోచించదు. ఆ పని ధ్యాస తప్పితే పెళ్లి ధ్యాస అసలు లేనే లేదు. దాని వాలకం చూస్తుంటే నాకేమనుకోవాలో తెలియటం లేదు..." యమునకి చెప్పుకుని వసంత బాధ పడింది.

"అమ్మా! నువ్వలా కంగారు పడకు. ఈ మధ్య అది ప్రేమ గురించి చెప్పిన కబుర్లు వింటే నాకే కళ్ళు తిరిగాయి తెలుసా...?" యమున నవ్వింది.

"అయితే నువ్వే ఓ సారి అమృతతో మాట్లాడి దాని మనస్సులో ఏముందో కాస్త కనుక్కో యమునా, నేనేదైనా అంటే అది మాట మార్చేస్తుంది లేకపోతే అడ్డదిడ్డంగా వాదించి నా నోరు మూయిస్తుంది. మీ నాన్న సంగతి తెలిసిందేగా. ఎన్నాళ్ళైనా ఆయన కళ్ళకది చిన్నపిల్లలానే కనపడుతుంది తప్ప దానికి పెళ్ళీడొచ్చిందని, సంబంధాలు చూడాలని అనిపించదు..." తన గోడు వెళ్ళబోసుకుంది వసంత.

ఆ సాయంత్రం అమృత ఇంటికొచ్చాక కాసేపు చల్లగాలిలో తిరుగుదాం రమ్మని మేడపైకి తీసుకెళ్ళింది యమున.

"అమృతా! చక్కగా చదువుకున్నావు. కోరుకున్న ఉద్యోగం సంపాదించావు. ఆ తర్వాత విషయం గురించి ఎలా ఆలోచిస్తున్నావు...?" మెల్లగా కదిపింది యమున.

"ఇప్పుడు నేనాలోచించేది ఈ ప్రొఫెషన్‌లో ఎలా పైకి రావాలా అనే... అది తప్ప ఇంకో ఆలోచన లేదు" అమృత నిజాయితీగా చెప్పేసింది.

"అంటే...? కెరియర్ గురించి తప్ప పెళ్లి గురించి నీకే ఆలోచనా లేదా...? ఆశ్చర్యంగా అడిగింది యమున.

"పెళ్ళి గురించాలోచించడానికి చాలా



## అమెరికన్ జోక్

ఒక అమెరికన్ యాత్రికుడు వెసూలియస్ అగ్నిపర్వతాన్ని, దానిలో న్నుండి వెలువడు తున్న పొగని అబ్బురంగా చూస్తున్నాడు. పక్కనే వున్న ఒక ఇటాలియన్ గర్వంగా అన్నాడు.

'ఇలాంటివి మీ అమెరికాలో మచ్చుకి కూడా కనిపించవు గదా...?'

'ప్చ్...!!! నిజమే... కాని మా దగ్గర నయాగరా జలపాతాలున్నాయి... అవి చాలా బ్రహ్మాండమైనవి... ఇలాంటి వాటిని నిమిషంలో ఆర్పేయగలవు!!!



టైముంది. ముందు కెరియర్‌లో నిలదొక్కుకోవాలి కదా? " అంది.

"నీకు చాలా టైముండచ్చు కానీ వచ్చే ఏడాది నాన్న రిటైరైపోతారు. ఈలోగా నీ పెళ్లిచేస్తే అమ్మా నాన్నలకి నీ బరువు బాధ్యతలు తీరిపోతాయికదే" యమున నెమ్మదిగా కన్విన్స్ చేయాలని చూస్తోంది.

"ఏంటీ...? నాకు పెళ్ళిచేసి నన్ను పంపించేస్తే అమ్మా నాన్నల బరువు తీరుతుందా? " అమృతకి నవ్వొచ్చేసింది.

"అక్కా! అంత బరువుండడానికి నేనేమైనా కొండరాయినా...? లేక బండరాయినా...? " ఇంకా గట్టిగా నవ్వసాగింది. తనకిష్టం లేని టాపిక్ మాట్లాడితే అమృత పాయింట్‌ని పక్కదారి పట్టించేస్తుందని యమునకి బాగా తెలుసు. అందుకే సీరియస్‌గా చూసింది.

"వాళ్లకి నేనెప్పుడూ బరువు కాదక్కా... ఇంకా చెప్పాలంటే నేనే వాళ్ళని బాధ్యతగా చూసుకోవాల్సిన అవసరముంది" అంది మళ్ళీ.

"అమ్మా నాన్నల బాధ్యత తీసుకోవడానికి నువ్వేమీ కొడుకువి కాదు కూతురువి. ఆ విషయం కాస్త గుర్తుపెట్టుకో..." అప్పటికే యమునకి చిరాకొచ్చేసింది.

"తన బాధ్యతలు తను తీసుకోవడానికి కూతురో కొడుకో కానవసరం లేదు. మనిషైతే చాలు..."

ఈసారి ఇంకాస్త మొండిగా చెప్పింది.

"నీ వితండవాదం మళ్ళీ మొదలెట్టావా? " యమున నిస్సహాయంగా నిట్టూర్చింది.

★ ★ ★

"ఇదిగో జగదీష్! సరిగ్గా వారం రోజుల్లో పనంతా పూర్తయిపోవాలి. ఒక్కరోజు లేటయినా ఛైర్మన్‌గారికి నువ్వే సమాధానం చెప్పుకోవాలి... ఆ తరువాత నీ ఇష్టం" అమృత ముందే గట్టిగా చెప్పేసింది.

"వారం రోజులంటే కష్టం మేడం... పదిరోజులైతే పక్కాగా సరిపోతుంది..." అతను గొణుగుతున్నాడు.

"అదేం కుదరదు... వారం రోజుల్లో వర్కయిపోవాలి. కావాలంటే ఇంకో ఇద్దరు వర్కర్స్‌ని ఎక్స్‌ట్రాగా తెచ్చుకో" అని చెప్పాక జగదీష్ ఒప్పుకున్నాడు.

ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా ఆ పని పూర్తిచేసి ఆ ఇంటికో నమస్కారం పెట్టేయాలని అమృత ప్రయత్నం. ఆ కారణంతోనే చంద్రశేఖర్‌గారి పేరుచెప్పి మరీ పని చేయించడం మొదలెట్టించింది.

ఆ ఇంటి పనివాడు శేషు బాగా నెమ్మది... అతనే నాన్నమ్మగారిని పక్కగదిలోకి షిఫ్ట్ చేశాడు. అక్షయ్, చంద్రశేఖర్ ఇద్దరూ ఇంటిపట్టునుండరు కాబట్టి అతనే

# చెట్టుకొట్టు లేదా జైలుకెళ్లు!

ఈస్ట్‌పిట్స్‌బర్గ్‌లోని ఓ ఇంటి యజమాని అయిన జేమ్స్ హామిల్టన్ (41) తన ఇంట్లో ఉన్న మల్బరీ చెట్టు వల్ల జైలుకి వెళ్లాల్సి వచ్చింది!

అతని ఇరుగుపొరుగు అతనింట్లోని ఆ చెట్టువల్ల తమకి ఇబ్బందిగా ఉందని ఫిర్యాదు చేయడంతో అతనికి సమస్య మొదలైంది. ఆ చెట్టు కాసే తియ్యటి మల్బరి పళ్ళకోసం ఎలుకలు, పాములు, పావురాలు లాంటివి వస్తున్నాయని, అందువల్ల తమకి ప్రమాదం ఉందని వారు సిటీ అధికారులకి ఫిర్యాదు చేశారు.

దాంతో అధికారులు అతనికి 5 వేల డాలర్ల ఫైన్ విధించి, ఆ చెట్టు పళ్లు పక్క ఇళ్లల్లో పడుతుండటంతో దాన్ని వెంటనే కొట్టేయమని ఆజ్ఞాపించారు. తన తల్లిదండ్రుల నుంచి సంక్రమించిన ఆ ఇంట్లో హామిల్టన్ ఒంటరిగా జీవిస్తున్నాడు. ఆ చెట్టు మీద గల మమకారంతో అతను దానిని కొట్టడానికి ఒప్పుకోలేదు. కాకపోతే పక్క ఇళ్లల్లోకి వెళ్లిన కొమ్మలని మాత్రం కొట్టేయించాడు.




ఇతనికి మరికొన్ని నోటీసులను సిటీ అధికారులు పంపడంతో కోర్టుకి వెళ్లాడు జేమ్స్ హామిల్టన్.

ఇతని చిన్నతనం నుంచీ ఆ చెట్టుంది. దాంతో పాటే పెరిగిన జేమ్స్‌కి ఆ చెట్టుమీద గల మమకారం అంతులేనిది. 'అతని బాల్యాన్ని, తల్లిదండ్రులను అది గుర్తుకు తెస్తోంది. ఆ చెట్టు ఇతరులకి న్యూసెన్స్ కాదు' అని జేమ్స్ తరపు




న్యాయవాది వాదించాడు.

జడ్జి మాత్రం దాన్ని కొట్టేయాలని ఆజ్ఞాపించాడు. చివరకు చెప్పిన గడువుకి ఆ పని చేయని హామిల్టన్‌కి జైలుశిక్ష విధించాడు కూడా. 1998 జూన్ 13 నుంచి నలభై మూడు రోజులపాటు జైలుశిక్ష విధించాడు. అమెరికా అంతటా పండగగా జరుపుకునే జులై 4న కూడా జేమ్స్ జైల్లోనే వున్నాడు. అతను హైకోర్టుకి అప్పీల్ చేశాడు.

హైకోర్టు జడ్జి కేసును పరిశీలించి కింది జడ్జి తీర్పుని కొట్టేస్తూ చెప్పాడు-

"తన ఆస్తి హక్కులని కాపాడుకోడానికి పోరాడే జేమ్స్ హామిల్టన్‌ని అభినందించాలి. ప్రభుత్వానికి ప్రజల ఆస్తి విషయంలో తల దూర్చి వాళ్లు ఏంచేయాలో శాశించే హక్కు లేదు" అని తీర్పు చెప్పారు.

విశేషం ఏంటంటే, ఆ చుట్టుపక్కల అందమైన దృశ్యం ఒక్క ఆ మల్బరీ చెట్టే!



ఆ ఇంటి వ్యవహారాలన్నీ చూసుకుంటాడు.

"శేషు...! ఆ టీవీ, స్టీరియో కూడా ఆవిడ రూంలో పెట్టించు. ఆవిడకి తోచదు కదా. పాపం..." ఆ రూంలోని సామాన్లన్నీ ఖాళీ చేయిస్తూ చెప్పింది అమృత.

"ఎందుకమ్మా... పెద్దమ్మగారికవేవీ అక్కర్లేదు..." అన్నాడతను.

"మరి రోజంతా ఆవిడేం చేస్తారు?" ఆశ్చర్యంగా అడిగింది అమృత.

"అలాగే పడుకునుంటారు..." కొంచెం జాలిగానే చెప్పాడు.

"ఇప్పుడేనా...? ఇది వరకు ఆరోగ్యంగా ఉన్నప్పుడు కూడా ఇంతేనా...?"

"ఏమోనమ్మా...! ఇంతకు ముందు అమ్మగారెక్కువగా ఇక్కడికొచ్చేవారు కాదు... పెద్దయ్యగారు పోయాక మంచం పట్టిన ఆవిడని, అయ్యగారు బలవంతంగా ఇక్కడికి తీసుకొచ్చేశారు. అప్పట్నుంచీ ఇంతే ఇలాగే ఉన్నారు" శేషు వినయంగా చెప్పాడు.

వర్కర్స్‌కు పనంతా అప్పగించి, వాళ్ళ చేత పని మొదలు పెట్టించి అమృత ఆఫీస్ కెళ్ళిపోయింది.

"ఏంటీ...? అక్షయ్ గారింట్లో ఏదో పని చేయిస్తున్నారట...?" ఆఫీస్‌లో అడుగు పెట్టగానే దినేష్ ఆరాగా అడిగాడు.

"యా...! వాళ్ళ నాన్నమ్మగారి రూం రెనోవేషన్ వర్క్ చేయిస్తున్నారు" అమృత చెప్పగానే ఇలాంటి పన్లన్నీ చేయించి ప్రాజెక్టులు కొట్టేస్తోందని దినేష్‌కి లోలోపల కడుపు మండిపోయింది.

"ఓహో...! మీరయితే ఇలాంటి పనులు చెయ్యడంలో స్పెషలిస్ట్‌కదా...?" నొక్కి నొక్కి పలికాడు.

"సో... వాట్...?" అమృత తీక్షణంగా అడిగింది. ఇలాంటి డొంకతిరుగుడు మాటలంటే అమృతకి అరికాలిమంట నెత్తికెక్కుతుంది.

దినేష్ వెంటనే తగ్గిపోయాడు.

"అదే... మీకయితే ఈ వర్క్‌లో మంచి ఐడియా ఉందని మీ చేత చేయిస్తున్నట్టున్నారు" సర్దుకుని వెళ్ళిపోయాడు కానీ... అమ్మో! ఈ అమ్మాయి పేరు అమృత కాదు ఆటంబాంబు... అనుకున్నాడు మనసులో.

★ ★ ★

"ఏం జగదీష్...! పనెంతవరకొచ్చింది" అంటూ రెండ్రోజుల తరువాత అమృత మళ్ళీ వెళ్ళి సూపర్‌వైజ్ చేస్తోంది. అప్పటికే పెయింటర్లు పుట్టీ వర్క్ మొదలుపెట్టేశారు. ఎలక్ట్రీషియన్, కార్పెంటర్స్ చేస్తున్న పనులన్నీ పర్యవేక్షించి సలహాలు, సూచనలు ఇస్తోంది.

"పెద్దమ్మగారు పిలుస్తున్నారమ్మా" శేషు వచ్చి చెప్పడంతో గదిలోకెళ్ళి ఆవిడను పలకరించింది.

పక్కనున్న కుర్చీలో కూర్చోమని కాఫీ తెప్పించారావిడ. ప్రతిసారీ అది మామూలే. అతిథి మర్యాదలే తప్ప అసలు మాట్లాడరు.

అమృత మౌనంగా కూర్చుని కాఫీ సిప్ చేయసాగింది. మధ్యలో...

"ఈ పనులతో మీకు చాలా డిస్టర్బెన్స్‌గా ఉండి ఉంటుంది. వీలైనంత తొందరగా పూర్తి చేయించేస్తాను" సంజాయిషీగా చెప్పింది.

"పర్లేదమ్మా... మెల్లగా చేయించు" మొట్టమొదటిసారి రెండు ముక్కలు మాట్లాడిందావిడ.

అమృతని మొదటిసారి చూసినప్పుడు ఆమె మీద ఆవిడకంత సదభిప్రాయం కలగలేదు కానీ తర్వాత తర్వాత వచ్చిన దగ్గర్నుంచీ అమృత చకాచకా తిరుగుతూ వర్కర్స్‌ని గడగడలాడిస్తూ పనిచేయించడం ఓ కంట గమనిస్తున్న ఆవిడకి ఆమెలోని ఆ లక్షణం ఆకట్టుకుంది.

"వస్తానండీ" అంటూ అమృత బయల్దే

రుతుంటే...

"రేపు మళ్ళీ వస్తావామ్మా!" మెల్లగా అడిగారు.

"ఈ పనయ్యేదాకా వస్తూనే ఉండాలి కదండీ" అని చెప్పి వెళ్ళిపోయింది.

"శేషూ...! ఇవన్నీ ఏమిటి...? " ఆ రోజు ఏదో పనిమీద స్టోర్‌రూంలోకెళ్ళిన అక్కడున్న అట్టపెట్టెలని చూసి అడిగింది.

"పాత ఫోటోఫ్రేములమ్మా...! పెద్దమ్మగారి కూడా పట్టుకొచ్చినవి... అలాగే పడున్నాయి" అన్నాడు.

"ఇలా పడేస్తే పాడయిపోతాయి. అవన్నీ తియ్యి చూద్దాం..." అంటూ తీయించింది. చాలాకాలం క్రితం తీసిన ఆ పాత ఫోటోల్లో నాన్నమ్మగారి పెళ్ళి ఫోటోలతో పాటు, చంద్రశేఖర్‌గారి చిన్ననాటి ఫోటోల నుంచీ ఆయన పెళ్ళిఫోటోలదాకా చాలా ఫోటోలు సజీవంగా ఉన్నాయి.

"ఇవన్నీ పక్కనపెట్టు" అని తనకి నచ్చిన ఫోటోఫ్రేంలన్నీ ఓ పక్కన పెట్టించి వాటన్నింటినీ జాగ్రత్తగా లామినేషన్ చేయించుకురమ్మని జగదీష్‌కి మళ్ళీ పని పురమాయించింది.

ఆ ఇంట్లో అక్షయ్ ఆమె కెప్పుడూ ఎదురుపడలేదు. ఆమెకిచ్చిన పనిలో జోక్యం చేసుకోలేదు. అందుకుమాత్రం అమృత సంతోషించింది. ఆవిడ గదికి తను చేసిన డిజైన్‌తో మార్పులూ చేర్పులూ చేసి మెరుగులు దిద్దడం పూర్తవగానే...

ఫైనల్‌గా ఆరోజు ఆ గది డెకరేషన్ పని మొదలెట్టింది. అంతకుముందు తను నోట్‌చేసుకున్న నోట్స్ చెక్ చేసుకుంటూ, ఒక్కో వస్తువుకీ టిక్ చేసుకుంటూ ఆమె చేస్తున్న పనిని శేషూ ఆశ్చర్యంగా చూస్తున్నాడు. విడ్డూరం కాకపోతే ఒక గదిని సర్దాలంటే ఇన్ని పుస్తకాలు చూడాలా...? అనుకున్నాడు మనస్సులో.

అలంకరణ అయిపోయాక ఒకసారి ఆ గదిని సంతృప్తిగా చూసుకుని...

"ఈ రోజుతో పని పూర్తయిపోయిందండీ.. మీ రూం చూద్దురుగాని రండి.." అంటూ నాన్నమ్మని వీల్‌ఛైర్‌లో కూర్చోపెట్టించి మెల్లగా లోపలికి తీసుకెళ్లింది.

"ఈ గది... ఆ గదేనా...? " అప్పటికీ ఇప్పటికీ ఏమాత్రం పోలికలేని ఆ గదిని చూసి ఆవిడ సందేహంగా అడుగుతూ, ఆశ్చర్యంగా చుట్టూ చూస్తున్నారు.

కొత్తగా వేసిన పసుపురంగుతో గోడలన్నీ బంగారువర్ణాన్ని సంతరించుకున్నట్టు మెరిసిపోతున్నాయి.

విశాలమైన విండోకి వేసిన లేత రంగు కర్టెన్‌లోంచి కొత్త కాంతి వస్తోంది. అది నలుదిశలా ప్రసరించి ఆ గది ప్రకాశవంతంగా మారిపోయింది.

ఆవిడకోసం కొత్తగా తయారుచేయించిన బెడ్, రెండు సోఫాలు మాత్రమే ఉంచి, ఆవిడ వీల్‌ఛైర్ సులభంగా తిరగడానికి వీలుగా ఆ గదిని విశాలంగా తయారుచేసింది.

కానీ నాన్నమ్మ సంభ్రమంగా చూస్తున్నది వేరు... లామినేట్ చేయించి కొత్తగా తయారుచేసిన పాతఫోటోలన్నీ ఆ గది గోడలపైన అక్కడక్కడా అందంగా నిలబడి తనను పలకరిస్తుంటే తదేకంగా వాటికేసి చూస్తూ తన్మయం చెందుతున్నారు.

"ఇవన్నీ నీకెక్కడ దొరికాయమ్మా? "... అప్పటి జ్ఞాపకాలతో కళ్ళు చెమర్చినా, ఆవిడ కళ్ళలో ఒక చిన్న మెరుపు అమృతకి స్పష్టంగా కనిపించింది.

తను చేసిన పనికి దక్కిన ఆ కాస్త ఫలితం అమృతకి కొండంత తృప్తినిచ్చింది.

"ఈ గదిలో మీకు కావలసిన సౌకర్యాలన్నీ అమర్చాను బామ్మగారూ... మీకు నచ్చిందా? " ఆత్మీయంగా అడిగింది.

"చాలా బాగుందమ్మా... ఆ ఫోటోలిక్కడ పెట్టించమని మా అబ్బాయికోసారి





చెప్పాను. వాడు మర్చిపోయాడు కానీ నువ్వు మాత్రం నాకోరిక తీర్చావు" అమృత చెయ్యి పట్టుకొని ఆత్మీయంగా చెప్పారా విడ.

"వస్తాను బామ్మగారూ".... అంటూ ఆవిడకీ, ఆ ఇంటికీ వీడ్కోలు చెప్పి తేలిగ్గా ఊపిరి తీసుకుంది.

అమృత స్కూటీ పార్క్ చేసి ఆకృతి మెట్లెక్కుతూ గాలికెగురుతున్న ఉంగరాల జుట్టు సర్దుకుంటూ ఎందుకో వెనక్కి చూసింది. అక్షయ్...!

పోయిన జన్మలో వీడు గండుపిల్లిలా పుట్టుంటాడు. ఆ లక్షణాలింకా పోలేదు. చడీచప్పుడూ లేకుండా అతను తన వెనక రావడం చూసి మనస్సులో తిట్టుకొంది.

"థ్యాంక్యూ వెరీమచ్... మీరు చేసిన స్కీమ్ నాన్నమ్మకి బాగానే పనిచేస్తున్నట్లుంది. నిన్నట్నుంచీ కొద్దిగా ఉత్సాహంగానే ఉంది తను. డిప్రెషన్ చాలా తొందరలోనే తగ్గుతుందని నమ్మకమూ వచ్చింది. ఫైన్ వర్క్" అని మెచ్చుకుని ముందుకు నడవబోయి మళ్లీ ఆగాడు.

"అసలే అనారోగ్యంతో బాధపడుతున్న ఆవిడ ఆ ఫొటోలన్నీ చూసి అవన్నీ గుర్తుకుతెచ్చుకుని మరింత బాధ పడుతుందని డాడ్ అనుకున్నారట. ఆ ఫొటోలు నాన్నమ్మకి అంత ఆనందాన్ని కలిగిస్తాయని తెలిస్తే ఎప్పుడో పెట్టించేవారు. థ్యాంక్స్ వన్స్ ఎగైన్" చంద్రశేఖర్‌గారి తరపు నుంచి కూడా థ్యాంక్స్ చెప్పేశాడు.

"ఈ వయసులో ఆవిడకి తన పాత జ్ఞాపకాలు, అప్పటి మధుర స్మృతులు తన అనారోగ్యాన్ని మర్చిపోయేలా చేస్తాయి. ప్రస్తుతం ఆవిడ అనుభవిస్తున్న ఒంటరితనానికి అవే మంచితోడు కూడా" అమృత ఇంకేదో చెప్పబోతోంది.

"నాన్నమ్మ ఒంటరిగా ఎక్కడుంది...? పక్కనే మెయిడ్ ఉంటుంది. పిలవగానే పనివాడొస్తాడు. మీరు కూడా చూశారుగా...?" అక్షయ్ కాస్త సీరియస్‌గానే అడిగాడు.

"ఓ మెయిడ్, ఇంకో పనివాడుంటే సరిపోతుందా?" తనూ ఎదురుప్రశ్న వేసింది.

"అంటే... నేనూ మా డాడ్ ఇద్దరం రోజంతా ఆవిడని ఎంగేజ్ చేస్తూ కూర్చోవాలనా మీ ఉద్దేశం?"

అమృతకి తల బిరుసుతోపాటు తల తిక్క కూడా ఎక్కువే అనుకుంటూ తీవ్రంగా అడిగాడు.

"అంతపని చెయ్యలేకపోయినా ఆవిడ తనని తాను ఎంగేజ్ చేసుకునేలా ఏదైనా వ్యాపకం గురించి ఆలోచించచ్చు" అమృత కూడా తీవ్రంగానే సమాధానం ఇచ్చేసింది.

"ఆర్ యూ క్రేజీ...? బెడ్‌మీదున్న మా నాన్నమ్మకి పనులు చెప్పమంటావా?" కోపంగా అడిగాడు.

ఆ మాటకి అమృతకప్పటికే తెచ్చిపెట్టుకున్న సహనమంతా అయిపోయింది.

"మీ నాన్నమ్మ కండిషన్ చూసి జాలిపడి సలహా చెప్పాలనుకోవడం నా తప్పు" చిటపటలాడుతూ సీట్లోకెళ్లి కూర్చుంది.

ఓ గాడ్! ఈ అమ్మాయికి చిటపటలే తప్ప చిరునవ్వులు రావా చిరాకుపడుతూ తన కాబిన్‌లో కూర్చుని అక్షయ్ ఆలోచిస్తున్నాడు.



అక్షయ్ సంగతి బాగా తెలిసి కూడా వాళ్ల నాన్నమ్మ గురించి ఆలోచించడం తన పొరపాటు.

ఇన్నాళ్లయినా అక్షయ్‌లో ఏ మార్పు రాలేదు... అలాంటి వాడికి సలహా ఇవ్వాలనుకోవడం తన బుద్ధి తక్కువ... ఆ వేడిలోనే అమృత దినేష్‌తో కలిసి ఏదో ప్లాన్ తయారుచెయ్యాల్సొచ్చింది.

ముక్కుమీద ఆ కోపమొక్కటి లేకపోతే

అమృత ఇంకా బావుండేది. చురుక్కుమనే ఆమె చూపులు, వాత పెట్టి వదిలే ఆమె మాటలు చూస్తుంటే దినేష్ తన మనస్సులోని మాట బయట పెట్టలేక మానలేక సతమతమౌతుంటాడు.

అమృతదీ తనదీ ఒకటే చదువు. ఒకటే ఉద్యోగం. అలాంటి తామిద్దరం ఒకింటివాళ్లమైతే ఎలా ఉంటుందని అడగాలని ఎంత ప్రయత్నించినా అడగలేకపోతున్నాడు.

"అమృతా... కొత్త సినిమా రిలీజైంది తెలుసా...? " ఆమెని పిలవాలన్న ఆలోచనతో నెమ్మదిగా మొదలెట్టాడు.

"తెలీదు..." ఆమెకున్న చిరాకు ఇంకాస్త పెరిగి ముక్తసరిగా చెప్పింది.

"తెలీదంటే సినిమా గురించి తెలీదా...? లేక వెళ్ళి చూడడం గురించి తెలీదా...? ' సాగదీశాడు.

"అదీ తెలీదు..." కొలీగ్ అని ఊరుకుంటోంది కానీ దినేష్ వాలకం చూస్తే చిర్రెత్తుకొస్తోంది.

"చూడడానికైతే ప్రాబ్లమేమీ లేదు. కావాలంటే మీకు నేను కంపెనీ ఇస్తాను" చటుక్కున అనేశాడు. అంతే.

భగ్గుమంటూ అమృత చూసిన చూపుకి బుగ్గయిపోతానని దినేష్ కంగారుపడి మాట మార్చేశాడు.

ఇంతలో టేబుల్ మీదున్న ఇంటర్ కమ్ రింగయింది. దినేషే లిఫ్ట్ చేశాడు.

"అమృత నొకసారి నా కాబిన్‌కి రమ్మని చెప్పండి" అక్షయ్ అతనికి చెప్పి ఫోన్ పెట్టాడు.

"ఈ టైంలో అమృతతో అక్షయ్‌కి పనేంటి? కొంపదీసి కొత్త ప్రాజెక్ట్ ఏదైనా వచ్చుంటుందా...? "

ప్రాజెక్ట్‌ల విషయం వచ్చిందంటే పోటీ తప్ప దినేష్‌కింకేదీ గుర్తుకు రాదు. అక్షయ్‌కిప్పుడు మీతో ఏం పనీ? " అదోలా అడిగిన అతణ్ణి ఆసాంతం ఓసారి చూసి .. "తెలీదు" అంటూ లేచెళ్ళిపోయిన ఆమెని చూసి జుట్టు పీక్కోవాలనిపించింది.

**ముక్కుమీద ఆ కోపమొక్కటి లేకపోతే అమృత ఇంకా బావుండేది. చురుక్కుమనే చూపులు, వాత పెట్టి వదిలే ఆమె మాటలు చూస్తుంటే దినేష్ మనస్సులోని మాట బయట పెట్టలేక సతమతమౌతూ ఉంటాడు.**

"టేక్ యువర్ సీట్" అమృత తన కాబిన్‌లోకి రాగానే అక్షయ్ మర్యాదగా చెప్పాడు.

"ఇప్పుడు చెప్పండి... నాన్నమ్మ కోసం మీరివ్వాలనుకున్న సలహా ఏమిటో? " తనే మళ్ళీ అడిగాడు.

"ఏమో... గుర్తులేదు... అప్పుడే మర్చిపోయాను" ముభావంగా చెప్పిన అమృతని చూసి, అమెకింకా కోపం తగ్గలేదని తెలిసిపోయి ఒక్క నిమిషం తనూ మౌనంగా కూర్చున్నాడు. తర్వాత-

"ఐ. నో... ఆ గొడవ మీరింకా మర్చిపోలేదు. మార్నింగ్ నాకూ మా డాడ్‌కీ జరిగిన గొడవతో నేనూ అదే మూడ్‌లో ఉన్నాను. ఆ చిరాకు మీమీద చూపించాను. అయాం సారీ..." అక్షయ్ ఎప్పుడూ కాజువల్‌గానే మాట్లాడతాడు.

ఓ చూపు చూసి ఊరుకుంది. అది చూసి చిన్నగా నవ్వాడు.

"టేకిటీజీ... అమృతా...! ఇవన్నీ మామూలే... ఈ కాస్త విషయాన్ని ఇంత సీరియస్‌గా తీసుకుని అంత ఫీలైపోతే ఎలా...? నా విషయమే తీసుకోండి. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా లండన్ వెళ్ళిపోవాలి. నా యాడ్ ఏజన్సీ



మొదలెట్టాలని నేనెంత ట్రై చేసినా మా డాడ్ రోజుకో కండిషన్ పెడుతుంటారు" అంటూ మొదలెట్టాడు.

"యాడ్ బిజినెస్ మీద ఆయనకి అస్సలు ఆసక్తిలేదు. అలాగే నాకీ బిజినెస్ మీద ఇంట్రస్ట్ లేదని నేను చెప్పినా సరే ఇక్కడకొచ్చి కూర్చుంటే ఆటోమేటిక్‌గా నాకు ఇంట్రస్ట్ పుట్టుకొచ్చేస్తుందని ఆయన అభిప్రాయం. నాకింకా సొంతంగా బిజినెస్ చేసే వయసు, అనుభవం రెండూ లేవని వంకలు పెట్టి వాయిదా వేయడానికి చూస్తుంటారు తప్పితే తనూ బిజినెస్ మొదలుపెట్టినప్పుడు ఇదే పరిస్థితిలో ఉన్నానని ఒప్పుకోవడానికి ఇష్టపడరు.

ఏదిఏమైనా సరే ఈ నెలాఖరుకి వెళ్ళిపోవాలని నేను డిసైడ్ చేసుకున్నాను. అందుకే వెళ్ళేముందు నా బాధ్యతగా నాన్నమ్మకేదైనా చేద్దామని నా ప్రయత్నం"

అంత సేపూ నిరాసక్తంగా వింటూ కూర్చున్న అమృత ఒక్కసారి తలెత్తి చూసింది. వెళ్లిపోతున్నానని అక్షయ్ చెప్పిన ఆ మాట వినగానే ఆమె చెవుల్లో అమృతం కురిసినట్లైంది. కంట్రోల్ చేసుకుందామని ఎంత ప్రయత్నించినా ఆనందంతో మొహం విప్పారింది.

"థాంక్ గాడ్... కూలయ్యావు కదా... ఇందాక నువ్వు చెప్పిన ఆ వ్యాపకం అంటే ఏమిటో ఇప్పుడైనా చెప్తావా....?" ఫ్రెండ్లీగా అడిగాడు. అక్షయ్ వెళ్ళిపోతానన్నాలే కానీ అమృత ఏమడిగినా చెప్తుంది.

"నా ఉద్దేశంలో వ్యాపకమంటే ఆవిడకి ఆసక్తి ఉన్న విషయంలో ఆవిడని ఇన్వాల్వ్ చెయ్యడం. దానివల్ల ఆవిడకి సంతృప్తి కలుగుతుంది. సంతృప్తి అనేది ఎవరికైనా సంతోషాన్ని కలిగిస్తుందని మీకూ తెలుసు కదా" అంది.

"యూ ఆర్ కరెక్ట్ కానీ... నాన్నమ్మకి ఏ విషయంలో ఆసక్తి ఉందో నాకు తెలీదు. అసలావిడకిప్పుడు ఇష్టాయిష్టాలున్నాయని నేననుకోను... చాలా డల్‌గా ఉంటుంది" అన్నాడు.

"లేదు లేదు... మేం వర్క్ చేసేటప్పుడు చూశాను కదా... మేం చేస్తున్న పనులన్నీ ఆసక్తిగా గమనించేవారు. అప్పుడప్పుడూ అడిగి తెలుసుకునేవారు కూడా. మీరు నెమ్మదిగా ట్రై చేస్తే ఆవిడ ఇంట్రస్ట్ ఎందులో ఉందో తప్పకుండా తెలుస్తుంది. ఓకే సర్" అంటూ లేచింది.

అమృతకి తెలివితేటలతో పాటు తీయనైన మనసు కూడా ఉంది. అక్షయ్‌కి ఆమె మీదున్న అభిప్రాయం అప్పుడే మారింది.




నెలలు నిండుతున్నకొద్దీ యమున ఆరోగ్యంలో చిన్నచిన్న సమస్యలు ఎదురౌతున్నాయి. సహజంగానే ఆమె భయస్తురాలు కావడంతో ఇప్పుడింకాస్త భయం, బెంగ పట్టుకున్నాయి.

"అమృతా! నిద్రపోయావా?" ఆరోజు రాత్రి నెమ్మదిగా పిలిచింది యమున.

"ఇంకా లేదక్కా...నీకేమైనా కావాలా?" అంటూ వెంటనే లేచిపోయింది.

"వద్దు" భారంగా లేచి కూర్చుంది యమున.

"నాకెందుకో చాలా దిగులుగా ఉందే" అంది మెల్లగా.

"ఏమయింది? బావతో ఏదైనా గొడవ

పడ్డావా? " అమృత వెంటనే అడిగింది.

"అదేం లేదు..."

"మరింకెందుకు దిగులు... హాయిగా పడుకుని పుట్టబోయే బేబీకి ఏ పేరు పెట్టాలో ఆలోచించుకో..." అమృత నవ్వుతూ చెప్పింది.

"అదేగా నా దిగులు... అవన్నీ చెయ్యడానికి ఆ రోజుకి అసలు నేనుంటానో లేదో అని భయమేస్తోంది" యమున బేలగా చెప్పింది.

అమృతకి ఆమె పరిస్థితి అర్థమైంది.

"అక్కా...! నువ్వు పుట్టబోయే ముందు అమ్మ కూడా ఇలాగే భయపడిందట... లేనిపోని ఆలోచనలు తన మనసులో పెట్టుకుని బెంగపడుతూ కూర్చునేదట. ఆ సమయంలో అమ్మ పడిన భయాలూ, బెంగలూ సహజంగానే నువ్వు కూడ పంచుకున్నావు. వాటితోనే పుట్టి పెరిగావు. అవునా...? అదే నేను పుట్టేముందు...? ఎదురుగా ఉన్న నీ ఆట పాటలు, అల్లరి చేష్టలు చూసుకుంటూ అమ్మ ఒక్కక్షణం కూడా తీరిక లేకుండా తిరుగుతూనే ఉందట. దాని ఫలితం నువ్వే చూస్తున్నావు కదా... ఇప్పుడు చెప్పు...! నీకు పుట్టబోయే పాపాయి ఎలా పుట్టాలని నీ కోరిక...? " ఆమెనే అడిగింది అమృత.

"అచ్చంగా నీలాంటి గడుగ్గాయిలా" అమృత మాటలకి యమునకి కొద్దిగా నవ్వొచ్చింది కూడా.

"అక్కా...! నువ్విలా నవ్వుతూ, సంతోషంగా ఉంటే లోపలున్న బేబీ కూడా ఉల్లాసంగా ఉంటుందని నీకిదంతా చెప్పాను కానీ నీకు పుట్టబోయే పాపాయికి నా పోలికలొస్తే నీకేకష్టం..." అని నవ్వింది.

**"అక్కా...! నువ్విలా నవ్వుతూ, సంతోషంగా ఉంటే లోపలున్న బేబీ కూడా ఉల్లాసంగా ఉంటుందని నీకి దంతా చెప్పాను కానీ నీకు పుట్ట బోయే పాపాయికి నా పోలికలొస్తే నీకేకష్టం..." అని నవ్వింది.**

"రేపొద్దున నువ్వు కూడా అమ్మలాగా రేపొద్దున్న... రేపొద్దున... అంటూ నీ బేబీ వెనక క్లాసులు తీసుకుంటూ తిరగాలి పాపం..." అమృత చిలిపిగా చెప్తుంటే యమునకి ఫక్కుమని నవ్వొచ్చేసింది.

"అమృతా! నువ్వెప్పుడూ మా కళ్ళకి చిన్నపిల్లలా, పసిపిల్లలా కనిపిస్తుంటావు. కానీ నువ్వు బాగా ఎదిగిపోయావని, నీ ఆలోచనలింకా ఎదిగిపోయాయని ఇప్పుడిప్పుడే నాకు తెలుస్తోంది" ఆప్యాయంగా చెప్పింది యమున.

"తెలిసింది కదా. ఇక హాయిగా పడుకుని మంచి మంచి కలలు కంటూ నిద్రపో. నాక్కూడా మంచి నిద్రొస్తోంది" అప్పటికే అమృత కళ్లు మూతలు పడుతున్నాయి.

★ ★ ★

"అమ్మా... అమృతం... ఓసారిలా రారా" విశ్వానికి మరీ ప్రేమొచ్చినప్పుడు అమృతనలాగే పిలుస్తుంటాడు.

"ఇంకోసారలా పిలిస్తే పలకను నాన్నా" అంటూనే వచ్చింది అమృత.

"మరేం లేదమ్మా... నీ గురించి నేనసలు పట్టించుకోవటం లేదనీ, అదనీ... ఇదనీ... మీ అమ్మ ఒకటే నస పెట్టేస్తోంది. అందుకే పిలిచాను" అన్నాడు.

"అలా నస పెట్టడం అమ్మ హాబీ... అందుకే నువ్వు కూడా నాలాగే ఈసారి అమ్మ నస మొదలెట్టగానే చెవుల్లో దూది పెట్టుకొని కూర్చో నాన్నా..." సలహా చెప్పి చిలిపిగా నవ్వింది.

"గుడ్ ఐడియా... తప్పకుండా ట్రై చేస్తాను" విశ్వం కూడా నవ్వాడు.



"నవ్వింది చాలుగానీ దాన్నసలు విషయం అడగండీ" వసంత ఫోర్స్ చేయ డంతో-

"అదేనమ్మా... ఏదైనా మారేజ్ బ్యూరోలో నీకు మ్యాచ్ వెతుకుదామని అనుకుంటున్నాం. నీ వాంటింగ్స్ తెలుసు కుందామనీ" అంటుండగానే వసంత అందుకుంది.

"ఆడపిల్ల...! అలా అడిగితే అదేం చెప్తుందండీ. నన్నడగండి నేను చెప్తాను. అబ్బాయి తెల్లగా, పొడుగ్గా, అందంగా చూడముచ్చటగా ఉండాలి. డాక్టరైనా, ఇంజనీరైనా కాకపోతే కనీసం దీనిలాగా ఆర్కిటెక్ట్ అయినా అయ్యుండాలి. ఏ దుర లవాట్లూ లేకుండా మంచివాడై ఉండాలి. మంచి ఉద్యోగం ఉండి బరువు బాధ్యత లేవీ లేకుండా ఉంటే మరీ మంచిది" వసంత పెద్ద లిస్టే చదివింది.

"ఓ గాడ్" అమృత పడీ పడీ నవ్వసా గింది.

"ఇందులో నవ్వడానికేముందే...? " ఆవిడ కొద్దిగా చిన్నబుచ్చుకుంది.

"నాన్న బజారుకెళ్ళేటప్పుడు తాజాగా, లేతగా, పుచ్చుల్లేకుండా ఉన్న కూరగాయలు పట్టుకురమ్మని చెప్తావు చూడు... ఇప్పుడు కూడా అచ్చంగా నువ్వలాగే చెప్తుంటే నవ్వు రాదా? " ఇంకాస్త నవ్వింది.

"అమృతా! అమ్మ నీకోసం మంచి అబ్బా యిని చూడాలని తాపత్రయపడుతుంటే నువ్విలా అనడం చాలా తప్పు" యమున వారింపుగా చెప్పింది.

"అక్కా...! నేనూ అదే చెప్తున్నాను. అమ్మే కాదు, ఎవరైనా సరే కోరుకోవా ల్సింది ముందు మంచి అబ్బాయిని కానీ అందం, చందం, ఆస్తీ పాస్తీ ఉన్న అబ్బా యిని కాదు. తెచ్చిన కూరగాయల్లో పుచ్చు లున్నా పెద్ద నష్టంలేదు. కానీ వచ్చిన మనిషి స్వచ్ఛమైన మనసున్నవాడు కాక పోతే మనకే నష్టం. అసలిప్పుడప్పుడే ఇవన్నీ నాకిష్టం లేదు కూడా" చాలా ఖచ్చి తంగా చెప్పేసింది.

"అది చెప్పింది నిజమే వసంతా. మ్యారేజ్ బ్యూరోల దగ్గర అబ్బాయిల వివరాలు తప్పితే అంతకుమించి మనకేమీ



తెలియదు" అన్నాడు విశ్వం.

"సర్లేండి... ఆ మ్యారేజ్ బ్యూరోలు కాక పోతే కనీసం తెలిసిన సంబంధాలేమైనా దొరుకుతాయేమోనని వాకబు చేయడమైనా మొదలెట్టండి" వసంత చిరాగ్గా చెప్పింది.

అమృత ఇప్పుడే వద్దని చెప్పినా వసంత తొందర మాత్రం వసంతదే.

★ ★ ★

"అమృతా...! టోటల్ గా మా ఇల్లు





రెన్నోవేషన్ చేయించాలని డిసైడ్ చేశాను. వర్క్ స్టార్ట్ చేయించండి" అక్షయ్ తనే అమృత కాబిన్‌కొచ్చి చెప్పాడు.

"ఆ వర్క్ మీరు దినేష్‌కి చెప్పడం బెటర్. నాకన్నా అతనింకా సీనియర్" ఒక దెబ్బకి రెండు పిట్టలని వెంటనే చెప్పేసింది అమృత.

"ఐనో అమృతా! కానీ నేను మా ఇంటిని మీ చేతిలో తప్పించి ఇంకెవరి చేతిలోనూ పెట్టలేను. మీమీద నాకంత నమ్మకం ఉంది. నేను మీకు చెప్పే ఆఖరిపని ఇదొక్కటే. ప్లీజ్..." బతిమాలాడు.

"అసలిప్పుడింత అర్జంటుగా మీ ఇల్లు రెన్నోవేట్ చేయించడమెందుకు...?" సూటిగా అడిగింది.

"ఏం లేదు. మా డాడ్‌ని కొంచెం ప్లీజ్ చేద్దామనీ..."

"నాకర్థం కాలేదు" అంటూ అమృత తికమకగా చూసింది.

"అమృతా...! నీకు తెలుసు కదా. నేను లండన్‌లో యాడ్ బిజినెస్ చేయడం మా డాడ్‌కిష్టం లేదని! నేను ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుని నాన్నమ్మ రూమ్ రెన్నోవేట్ చేయించడం ఆయనకి నచ్చిందని నీకు తెలుసు. అందుకే నాకు మా ఇంటిమీద ప్రేమ, మా ఫ్యామిలీ అంటే ఇష్టం ఉన్నాయని ఆయనకింకా బాగా అర్థమవ్వాలంటే ఇదే మార్గం. ఆ సంతోషంలో నేనడిగినది చేయడానికి ఆయన తప్పకుండా ఒప్పుకుంటారని నా ఆశ. అమృతా నీకు ఫ్రీ హాండ్ ఇచ్చేస్తున్నాను. నీకు నచ్చినట్లు మా ఇల్లు రెన్నోవేట్ చేసి పెట్టు" అర్థించాడు.

"ఓకే..." అమృత చివరికి ఒప్పుకోక తప్పలేదు.

★ ★ ★

"మళ్లీ పని మొదలెడతారా...! మంచిదమ్మా" అమృత మళ్ళీ రావడం చూసి నాన్నమ్మగారు చాలా సంతోషించారు.

శేషుని తీసుకుని ఇల్లంతా తిరిగి చూస్తూ మొదటిసారి మేడమీదకెళ్ళింది.

"ఇది అయ్యగారి గదమ్మా" అంటూ శేషు మొదట చంద్రశేఖర్‌గారి రూం చూపించాడు. సింపుల్‌గా నీట్‌గా ఉన్న ఆ రూంని చూసి బయటకొచ్చి అక్షయ్ రూంలో అడుగు పెట్టింది.

"ఏంటిదంతా...?" అంటూ విస్మయంగా చూస్తోంది. టేబుల్ మీదా, బెడ్ మీదా ఎక్కడ చూసినా ఏవేవో పేపర్లూ, పుస్తకాలు, ఫైల్స్‌తో ఆ గది పూర్తిగా నిండిపోయింది.

"బాబు... ఎప్పుడూ ఆ కాగితాలేసుకుని కూర్చుంటారు. సర్దుదామని చూస్తే నన్ను కనీసం ముట్టుకోనివ్వరమ్మా" ఇబ్బందిగా చెప్పాడు శేషు.

"ముట్టుకోనివ్వడా? అసలేం పేపర్లవి...?" అమృతకి వెంటనే అవి చూడాలన్న కుతూహలం వచ్చేసింది.

టేబుల్ మీదున్న పేపర్లు తీసి చూసింది. యాడ్ రంగానికి సంబంధించిన ప్రతి ఒక్క ఇన్‌ఫర్మేషన్, అక్షయ్ తయారుచేసుకున్న నోట్స్, ప్రాజెక్ట్ ఫైల్.

ఎన్నో ఏళ్ళు శ్రమించి తయారుచేసిన ఆ ఫైల్ చూసిన తర్వాత ఆమెకి నిజంగానే అక్షయ్‌కి ఆ బిజినెస్ మీద అంత ఇంట్రస్ట్ ఉందని అప్పుడే తెలిసింది. అన్ని రోజులూ అక్షయ్ వాళ్ళ నాన్న దగ్గర్నుంచి ఎలాగోలా డబ్బులు పట్టుకెళ్లాలని ప్రయత్నిస్తూ, ఏవో కథలు చెబుతున్నాడని అనుకునేది తప్ప అది నిజమని కలలో కూడా నమ్మలేదు.

అయితే ఏదిఏమైనా అక్షయ్ లండన్ తిరిగి వెళ్ళిపోవడం ఖాయం అని కచ్చితంగా తెలిసిపోయి అమృత రిలీఫ్‌గా ఊపిరి పీల్చుకుంది. అతను తొందరగా వెళ్ళిపోవడానికి తను చెయ్యగలిగిన సహాయాన్ని సంతోషంగా మొదలెట్టింది.

# మిత్రలాభం

స్మితం

ప్రపంచ ప్రసిద్ధ హాస్యనటుడు చార్లీచాప్లిన్ కుమారుడు ఒకసారి జబ్బు పడ్డాడు. 'మీ కుమారుడి ఆరోగ్యం బాగుపడాలంటే అతన్ని ప్రతిక్షణం నవ్విస్తుండాలి. ఆ ఏర్పాటు చూడండి' అని సలహా ఇచ్చి డాక్టర్ వెళ్లిపోయాడు.

దానిపై కొడుకును ఇరవై నాలుగ్గంటలూ నవ్విస్తుండే వాడెవడా అని ఆలోచించిన చాప్లిన్‌కు తన మిత్రుడు ఒకరు గుర్తొచ్చారు. అతనూ హాస్యనటుడే. వెంటనే అతనికి టెలిగ్రాం ఇచ్చి పిలిపించాడు చార్లీచాప్లిన్.

అదిచూసి చాప్లిన్ ఇంటిపక్కనుండే పెద్ద మనిషి 'మీరు గొప్ప హాస్యనటులు కదా? మీవాడ్ని నవ్వించడానికి అతడ్నెవరినో రప్పించడం ఏమిటి?' అని ప్రశ్నించాడు.



దానికి చాప్లిన్ 'నా ఒక్కదినం షూటింగ్‌కు వచ్చే పారితోషికం వేలల్లో ఉంటుంది. అన్ని వేలు పోగొట్టుకోవడం ఎందుకు? నా మిత్రుడైతే స్నేహితునికోసం అదంతా భరిస్తాడు అందుకే! అన్నాడు చమత్కారంగా.

"అమృతా...! ఒక్క క్షణం కూడా తీరిక లేకుండా ఎప్పుడూ పనేనా" అర్ధరాత్రి దాకా కూర్చుని అక్షయ్ ఇంటి డిజైన్ తయారుచేస్తున్న అమృతని మందలింపుగా అడిగింది యమున.

"ఇది చాలా అర్జంట్ వర్క్... నువ్వు పడుకో అక్కా" అంది అమృత.

"ఏదైనా సరే అలా రాత్రిపగలూ పనిచేయడం నీకే మంచిది కాదు..."

ఈ పని చేయడం చాలా మంచిదిలే. నీకు తెలీదు" నవ్వుతూ చెప్పింది.

"అహా...! అంత గొప్పపనా...? ఇంతకీ ఏం పనదీ" ఆరాగా అడిగిందియమున

"ఇదా...ఇదీ..." ఒక్కక్షణం తడుముకుని మా చైర్మన్ గారింటి పనిలే" అనేసింది అమృత.

"అలాగా... ఇక అడగడానికేముంది... చేసుకో" అంటూ యమున వెళ్ళి పడుకుంది.

చైర్మన్‌గారిల్లంటే చెయ్యమంది కానీ అది అక్షయ్‌ది కూడా అని తెలిస్తే ఏమనేదో అనుకుంటూ అమృత తన పని మళ్ళీ మొదలెట్టింది.

ఈసారి అక్షయ్ వాళ్ల నాన్నమ్మతో పరిచయం ఇంకాస్త పెరిగింది. ఆవిడ కూడా అప్పుడప్పుడూ గదిలోంచి బయటకొచ్చి వీల్ చైర్‌లో కూర్చుని పనులని పర్యవేక్షించడం చిన్నచిన్న సలహాలు, సూచనలివ్వడం మొదలుపెట్టారు. వర్కర్స్‌ందరికీ టీలు, టిఫిన్లూ చేయించి పేరు పేరునా పిలిచి మరీ పెట్టిస్తుండేవారు.

అది చూసి... ఒక రోజు "బామ్మగారూ! ఇల్లంతా ఇలా సందడిగా ఉండడం మీకు సరదా అనుకుంటాను" అంది అమృత.

"ఇదేం సందడమ్మా...! మా ఊళ్ళో ఐతే మా ఇంట్లో ఎప్పుడూ ఏదో ఒక సందడీ,

హడావిడి ఉంటూనే ఉండేది. పండగలూ, పబ్బాలూ, పెళ్ళిళ్ళూ పేరంటాలూ... ఇలా ఎవరింట్లో ఏదైనా ఆ ఊరికి మేమే పెద్దదిక్కుగా ఉండేవాళ్ళం. ఆ రోజులన్నీ ఆయనతోనే పోయినై. నేనే... ఇదుగో ఇలా మూలబడిపోయాను" కళ్ళొత్తుకుం దావిడ.

"అయ్యో! అలా అనుకోకండి బామ్మ గారు" ఆవిడ బాధ చూసి అమృతకేమ నాలో తోచలేదు.

"ఏదో నన్ను నా మానాన అక్కడ ఒది లిపెట్టినా బానే ఉండేది. వద్దన్నా విన కుండా మా అబ్బాయి నన్నిక్కడికి తెచ్చిప డేశాడు. అక్కడైతే నా చుట్టూ కనీసం నలుగురు మనుషులైనా ఉండేవాళ్ళు. ఇక్కడదీ లేదు. మా అబ్బాయి రోజుకో సారి కనిపిస్తే అదే గొప్ప. మా మనవ డికి అసలిక్కడుండడమే పడదు. వాళ్ళ హడావిడి వాళ్ళది... నాపని కూడా నేను చేసుకోలేని ఈ బందిఖానా జీవితమం టేనే విసుగు పుట్టేస్తోందమ్మా" ఆవిడ దీనంగా చెప్తుంటే అమృత హృదయం ద్రవించిపోయింది.

రెండ్రోజుల తర్వాత అమృత ఇంటి డెకరేషన్ కోసం తెప్పించిన సామాగ్రి లోని ఆర్టిఫిషియల్ ఫ్లవర్స్ పట్టుకొచ్చి లివింగ్‌రూమ్‌ని అందంగా అలంకరించ సాగింది.

"ఎంత బాగున్నాయో...! ఏం పూలమ్మా అవీ...?" అని చూసి నాన్నమ్మ సంభ్రమంగా అడిగారు. శేష అవిడని అప్పుడే అక్కడికి తీసుకొచ్చాడు.

"నిజమైనవి కాదండీ ఆర్టిఫిషియల్" అంటూ వాటిని తీసుకొచ్చి చూపించింది అమృత.

"ఓహో...! కాగితం పూలా...?" ఆవిడ నిరాసక్తంగా చూశారు.

"అవును బామ్మగారూ... ఇవయితే నిజం పూలలా వాడిపోవు కదా అని పెడుతున్నాను" అని చెప్పింది.

"ఐనాగానీ నిజం పూలకున్న సున్ని తత్వం, సువాసనా వీటికెక్కడివమ్మా. ఆ అందమే వేరు. నీకు తెలుసా...! మా ఊళ్ళో మా ఇంట్లో మాకు పెద్ద పూల తోటే ఉండేది. నా చేత్తో ఏ మొక్క వేసినా అది తప్పకుండా బతికేది. బోలెడు పూలు పూసేది..." ఆవిడ ప్రవా హంలా చెప్పుకుపోతుంటే అమృత ఆస క్తిగా వింటోంది.

"మల్లెలు, జాజులూ, మందారాలూ, బంతులూ, చామంతులూ ఇవన్నీ బుట్ట లతో పట్టుకెళ్ళి మా గుడిలో దేవుడికిచ్చే దాన్ని... పారిజాతాల మాలలైతే చెప్పక్క ర్లేదు..."

ఆవిడ అంత హుషారుగా ఇప్పుడే మాట్లాడడం చూస్తూ ఏదో ఆలోచిస్తోంది అమృత.

★ ★ ★

"మే ఐ కమిన్ సర్" అమృత, అక్షయ్ కాబిన్‌లోకెళ్ళింది.

"జస్టేమినిట్" అంటూ అక్షయ్ ఆమెని కూర్చోమని చెప్పి ఇంటర్‌నెట్‌లోంచి ఏదో డౌన్‌లోడ్ చేసుకోసాగాడు.

అమృత మౌనంగా కూర్చుని అక్షయ్ దీక్షగా చేస్తున్న పనిని పరిశీలించసా గింది. ఉల్లాసంగా, ఉత్సాహంగా తిరిగే అతని మనస్తత్వాన్ని బట్టి చూస్తే, ఆ ఫ్యాషన్ రంగం అక్షయ్‌ని అంతగా ఆక ర్షించడంలో ఆశ్చర్యమేమీ లేదనిపించింది.

ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కంప్యూటర్ వైపు చూస్తున్న అమృతని చూసి అక్షయ్...

"అమృతా... నీక్కూడా ఇందులో ఇంట్రస్టుందా...?" ఆసక్తిగా అడిగాడు.

"టీవీలో యాడ్సొచ్చినప్పుడు ఏదైనా బావుంటే చూస్తానంతే. అంతకుమించి





పెద్ద ఇంట్రెస్ట్ ఏమీ లేదు" అంది.

"నాకు మాత్రం చాలా చిన్నప్పట్నుంచీ యాడ్స్ అంటే చాలా ఇష్టం. ఎవరైనా టీవీ చూసేది అందులో వచ్చే ప్రోగ్రామ్స్ కోసమే కానీ నేను మాత్రం అందులో వచ్చే యాడ్స్ కోసమే టీవీ చూస్తాను. అలాగే ఏ యాడ్ చూసినా అది నేనయితే ఎలా తీస్తానని ఆలోచించి నాకొచ్చే ఐడియాలన్నీ నోట్ చేస్తుంటాను. ఎలా తీయాలో ప్లాన్ చేస్తుంటాను. ఆ ఇంట్రెస్ట్‌తోనే స్వంతంగా యాడ్ కంపెనీ తెరవాలన్న ఆలోచనలో ఉన్నాను" అంటూ నిట్టూర్చాడు.

"మీ ప్రయాణం గురించేమైనా తెలిసిందా...?" అమృత వెంటనే అడిగింది.

"ఇదివరకే చెప్పాను కదా... మా డాడ్ ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా నేను మాత్రం వెళ్ళిపోతాను. నేనక్కడికెళ్ళి చేసుకోవాల్సిన పనులింకా చాలా ఉన్నాయి. అవన్నీ వదిలి ఇక్కడ కూర్చుని నేను నా టైంవేస్ట్ చేసుకోవడం నాకు నచ్చడం లేదు... అన్నట్లు నువ్వొచ్చిన పనేంటో చెప్పలేదు" అప్పుడు గుర్తొచ్చి అడిగాడు.

"ఏం లేదు. మీ నాన్నమ్మగారి గురించి కొంచెం చెప్పాలని..."

"ఏం చెప్పాలి...?" అక్షయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆవిడకి గార్డెనింగ్ అంటే చాలా ఆసక్తి... రకరకాల పూలు పెంచడమంటే ఇష్టం. వాళ్ళ ఊళ్ళో పెద్దతోట పెంచానని చెప్పారు కూడా."

"అవును అయితే...?" అంత చిన్న విషయం అమృత తనకెందుకు చెప్తోందో అర్థం కాక అడిగాడు.

"ఆవిడకంతకన్న మంచి వ్యాపకం ఇంకేముంటుంది...?" అమృత అనగానే,

"కానీ నాన్నమ్మ ఇప్పుడున్న కండిషన్‌లో అదంతా ఎలా కుదురుతుంది?" అక్షయ్ వెంటనే ప్రశ్నించాడు.

"ఎందుకు కుదరదు... ఆవిడ వీల్‌ఛైర్ తిరగడానికి వీలుగా మీ గార్డెన్‌ని తయారు చేయించి...

ఇప్పుడున్న లాన్‌లో కొంతభాగంలో ఆవిడకి నచ్చిన పూలమొక్కలు నాటించొచ్చు. దానివల్ల ఆవిడ రోజూ కొంతసేపన్నా ఇంట్లోంచి బయటికొచ్చి చల్లగాలి పీల్చుకునే వీలు కూడా కుదురుతుంది. తనేదో బందిఖానాలో ఉన్నానన్న భావన కూడా కొంతవరకూ తగ్గుతుంది" అమృత ఆవిడని తలుచుకుని జాలిగా చెప్పింది.

"అమృతా నీకెలా థాంక్స్ చెప్పాలో నాకు తెలియటం లేదు. నేను చెప్పిన పనులే కాకుండా చెప్పని పనులని కూడా నువ్వు చెయ్యడం మా నాన్నమ్మ గురించి మీరింతగా ఆలోచించడం నాకు చాలా సంతోషంగా ఉంది. అలాగే నేను నీకప్పుడే చెప్పేశాను కదా... మా ఇల్లు మీ చేతిలో పెట్టేశానని... అలాగే మా నాన్నమ్మ విషయంలో కూడా నీకెలా తోస్తే అలా చెయ్యొచ్చు. నా పర్మిషన్ తీసుకోవాల్సిన అవసరం లేదు" ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా అక్షయ్ వెంటనే చెప్పేశాడు.

"ఓకె సర్. ఐతే ఈ వర్క్‌తో పాటు ఆ వర్క్ ఒకేసారి పూర్తి చేయిస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

"సో స్వీట్"... నాన్నమ్మ విషయం తనప్పుడే మర్చిపోయినా అమృత అంత బాగా గుర్తుంచుకుందని అక్షయ్ ఆమెనింకా మనస్సులో మెచ్చుకుంటూనే ఉన్నాడు.

"ఏంటో పాపం... రోజురోజుకీ చాలా బిజీ అయిపోతున్నారు. ఇటు ఆఫీసు పనీ, అటు అక్షయ్ ఇంటి పనీ అన్నింటికీ మీరొక్కరే" అక్షయ్ రూమ్‌లోంచి బయటకి రాగానే దినేష్ తగిలాడు.

"పాపం మీకు వేరే పనేం లేన

ట్టుంది...!" తన జోలికి రావడం తప్ప దినేష్‌కింకో పనేమీ లేదని అమృత కూడా ఇన్‌డైరెక్ట్‌గా చురకేసింది. దాంతో దినేష్ దార్లో కొచ్చేశాడు.

"నా పరిస్థితీ మీలాగే ఉందని అలా అడిగానంతే... జూనియర్లమని అన్ని పనులూ మనకే అంటగట్టేస్తుంటే ఎలా గండీ చేసేది...? అసలీ ఉద్యోగంలో చేరడమే పెద్ద తప్పు. ఏ సాఫ్ట్‌వేర్ ఇంజ నీరింగో చేసుంటే హాయిగా ఏదో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో సుఖంగా ఉద్యోగం చేసుకునేవాణ్ణి" ఇంకా చాలా చెప్పేవాడే గానీ...

అక్షయ్ డోర్ తీసుకుని బయటకి రావడం చూసి ఆగిపోయాడు.

"కొంపదీసి విన్నాడంటారా...?" అతనె ళ్ళాక నెమ్మదిగా అమృత నడిగాడు.

"వింటే మంచిదేగా... మీ బాధ తప్పు తుంది" అతని భయం చూసి కొద్దిగా బెది రించి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది అమృత.

ఆ మందహాసాన్ని చూసి, మతి తప్పిన దినేష్ మాత్రం తన బాధల సంగతి పక్క నపెట్టి గాల్లో తేలిపోయాడు.

★ ★ ★

అక్షయ్ ఇంటి గార్డెన్ లాండ్‌స్కేప్ డిజై న్‌ని వాళ్ళ నాన్నమ్మగారి వీల్‌చైర్లో తిరిగేం దుకు అనువుగా మార్చి ఆవిడకి కావాల్సిన మొక్కలు నర్సరీ నుంచి తెప్పించి, ఆవిడని కూడా సలహాలడుగుతూ అమృత వాటిని క్రమపద్ధతిలో నాటించడం మొదలు పెట్టింది.

శేషు నాన్నమ్మగారిని వీల్ చైర్‌తో సహా బయటకి తీసుకొచ్చి కూర్చోపెట్టడంతో ఆవిడ చాలా ఉల్లాసంగా ఉన్నారు. ఆ చల్లని గాలికి సేద తీరుతూ పచ్చని మొక్కలు చూస్తూ చిన్నపిల్లలా సంబరప డుతున్న ఆవిడని చూస్తే అమృతకే చాలా సంతోషం కలిగింది.

## పోలిష్ జోకు

ఒక పోలిష్‌వాడి ఇల్లు పోలెండు, రష్యాల మధ్య సరిగ్గా సరిహద్దుమీద ఉందట! అది రష్యాలో వుందని రష్యావాళ్ళు, పోలెండులో వుందని పోలెండు వాళ్ళు వాదిం చుకున్నారు. చివరికి ప్రపంచ న్యాయస్థానం వాళ్ళు అది పోలెండులోనిదేనని తీర్పు ఇచ్చారు. గృహ యాజమాని చాలా సంతోష పడ్డాడు. ఎందుకంత సంతోషం?' అని ఒక రడగ్గా, 'రష్యాలో శీతాకాలాలు దుర్భరం, రష్యన్లు తప్ప ఇంకెవరూ ఆ చలికి తట్టుకో లేరు' అని సమాధానం ఇచ్చాడు.



"హాయ్... నాన్నమ్మా...! అమృత అప్పుడే నిన్ను బయటకి తీసుకొచ్చే సిందా...?" ఎప్పుడూ లేనిది అక్షయ్ ఆ టైంలో ఇంటికొచ్చి నాన్నమ్మగారి నక్కడ చూసి పలకరించాడు.

"అవున్నాన్నా...! నాకు కాలక్షేపంగా ఉంటుందని మొక్కలు కూడా తెప్పించింది" చాలా కాలం తర్వాత ఆవిడ బోసినోరంతా తెరిచి సంతోషంగా నవ్వుతూ చెప్పారు.

ఏకంగా మట్టిలో కెళ్ళిపోయి తనను కున్న విధంగా మొక్కలన్నీ మాలిచేత నాటిస్తూ, అమృత హడావిడిగా తిరుగు తోంది.

అమృతలో ఏదో విద్యుత్తుంది. తను వెళ్ళినచోటల్లా ఉత్సాహాన్ని నింపుతుంది...



ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉండే తన ఇంటిని, విచారంగా ఉండే నాన్నమ్మని చూసే అక్షయ్‌కి, ఆరోజు ఇల్లంతా సందడిగా నాన్నమ్మ సంతోషంగా ఉండడం కొత్తగా చూస్తూ అనుకుంటున్నాడు.

"గుడీవినింగ్ అమృతా" అక్షయ్ తనని చూసి విష్ చేయడంతో అతనొచ్చాడని అప్పుడే గమనించిన అమృత తనూ విష్ చేసి మళ్ళీ తనపని తను చూసుకోసాగింది.

అణువణువుగా విద్యుత్తుని నింపుకున్నట్లు మెరుపులు మెరిపిస్తూ, చకచకా అడుగులేస్తూ చురుకుగా తిరుగుతున్న అమృతని అక్షయ్ రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

"అమృతా.... నువ్వెప్పుడైనా మోడలింగ్ చేశావా...?" ఆమె దగ్గరకెళ్ళి అడిగాడు.

"వాడ్డూయూ మీన్...?" అమృతకప్పుడే సర్రుమని కోపమొచ్చేసింది.

"నిన్ను చూస్తుంటే ఎక్కడో చూసినట్లనిపిస్తోంది. ఒకవేళ నువ్వెప్పుడైనా మోడలింగ్ చేసుంటే ఆ ఫొటోలేమైనా చూశానేమోనని" కారణం చెప్పాడు.

"మోడలింగ్ చెయ్యాల్సిన అవసరం నాకేముంది? నా ప్రొఫెషన్ అది కాదు" సీరియస్‌గా చెప్పింది.

"అమృతా నువ్వీ బోరింగ్ ప్రొఫెషన్ వదిలిపెట్టి మోడలింగ్‌లో జాయినైతే చాలా బావుంటుంది. ఒక మంచి మోడల్‌కుండాల్సిన అన్ని లక్షణాలూ నీకున్నాయి" సిన్సియర్‌గా సలహా ఇచ్చాడు.

"నా ప్రొఫెషన్‌ని బోరింగని చెప్పడానికి మీరెవరు...? మీకు మీ ప్రొఫెషన్ గొప్ప యితే నాకు నా ప్రొఫెషన్ గొప్ప" తననేమన్నా సహిస్తుందేమోగానీ తన ప్రొఫెషన్ నంటే మాత్రం అమృతకి చిర్రెత్తుకొచ్చేస్తుంది.

"ఏయ్...! కూల్ కూల్... నేనేదో సరదాగా చెప్పాను. ఆ మాత్రానికే అంత సీరియస్ అయిపోతావెందుకు...?" అమృతకి ప్రతి చిన్న విషయానికీ అంత కోపమెందుకొస్తుందో అర్థంకాక అక్షయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అలాగైతే మిమ్మల్నెవరైనా లండన్ వెళ్ళడం మానేసి ఆకృతిలో ఉండిపోమని సరదాగా చెప్పినా సరే, మీకెలా ఉంటుంది?" చటుక్కువ ఎదురు ప్రశ్న వేసింది.

"ఓ గాడ్...! అమృతా నీతో మాట్లాడం చాలా కష్టం" అక్షయ్ నవ్వేశాడు. తన దాకా వస్తే తప్పు తెలియదని ఇందుకే అంటారు మరి అనుకుంది అమృత మనసులో.

ఇలాంటమ్మాయిని తనెక్కడో చూశాడు... కాదు కాదు ఈ అమ్మాయినే చూశాడు... అదే ఎక్కడా...? అమృత వెళ్ళిపోయినా అక్షయ్ ఆలోచిస్తూనే ఉన్నాడు.




**య**మునకి తొమ్మిదో నెల రాగానే శ్రీమంతం చెయ్యాలని వసంత చాలా హడావిడి పడుతోంది. యమున అత్తగారి వైపు బంధువులంతా వస్తున్నారు. కాబట్టి అందరికీ బట్టలు కొనాలని ఆరోజు షాపింగ్ ప్రోగ్రాం పెట్టుకున్నారు.

ఆదివారం కావడంతో అమృత హాయిగా పడుకుని ఏదో పుస్తకం చదువుతూ రిలా




## పువ్వులు కాదు... ప్రాణులు

ఇవేవో గులాబీపూల్లా ఉన్నాయే అనుకుంటున్నారు కదూ..? కానేకావు. సముద్రగర్భంలో 1800 అడుగుల లోతున సహజవాయువు క్షేత్రాలవద్ద పెరిగే కోల్డ్‌వెంట్ ట్యూబ్‌వర్మ్స్. రెండు మీటర్ల ఎత్తు వరకూ పెరిగే ఈ ప్రాణులు పూర్తిగా ఎదిగేందుకు సుమారు రెండొందల ఏళ్లు పడుతుందట. వీటిలోని హిమోగ్లోబిన్ కారణంగా గొట్టాల పైభాగాన గులాబీ రేకుల్లా ఆకర్షణీయంగా కన్పిస్తుంటాయి. వీటి సాయంతోనే నీటిలోని ఆక్సిజన్‌ను ఇవి గ్రహిస్తూ జీవిస్తాయట.



క్సవుతోంది. యమునకి షాపింగ్ అంటే ఎక్కడలేని హుషారు వస్తుంది. అందు వల్ల వసంత వద్దన్నా సరే వినిపించుకో కుండా వస్తానని తయారైపోయింది.

"నువ్వేంటే ఇంకా పడుకున్నావు...? అవతల చాలా పనుంది వెళ్దాం పద" వసంత వచ్చి అమృతని తయారవ్వమని చెప్పింది.

"అబ్బ...! ఆ చీరల షాపింగ్‌కి రావడం నా వల్ల కాదు. మీరెళ్ళండి" బద్ధకంగా చెప్పింది.

"అలా అంటే ఎలాగే... మా బంగారు తల్లివి కదూ రామ్మా" వసంత బతిమాలడం మొదలెట్టింది.

"నేను రావాలంటే ఒక కండిషన్... నేను డ్రైవ్ చెయ్యడానికి నాన్న నొప్పించు" విశ్వానికి తన కారంటే మహా అపురూపం. ఎవర్నీ ముట్టుకోనివ్వడు. అందుకే అమృత అమ్మ చేత రికమెండ్ చేయించింది.

"నేనివ్వను. అదసలే రాష్ డ్రైవింగ్ చేస్తుంది..." విశ్వం ససేమిరా ఒప్పుకో లేదు.

"మీరు కారుని ఎద్దులబండిని నడిపి నట్లు నెమ్మదిగా నడుపుతారుగానీ అది మీకన్నా బాగానే నడుపుతుంది... ఆ తాళాలిటివ్వండి" వసంత ఆయన్ని దబా యించి మరీ కార్ కీస్ అమృతకిచ్చేసింది.

"నీ కారివాళ మేఘాల్లో తేలిపోతుంది చూడు నాన్నా" వాళ్ళ నాన్నని అమృత చిలిపిగా కవ్వించి కార్ స్టార్ట్ చేసింది.

"అందుకే మరి నీ కివ్వననేది" విశ్వం కంగారుపడుతూ జాగ్రత్తలు మొదలె ట్టాడు. ఆయన్నింకాస్త కవ్విస్తూ, అందర్నీ నవ్విస్తూ బయలుదేరింది అమృత.

కావాల్సినవన్నీ ఒకేచోట దొరికే పెద్ద షాపింగ్‌మాల్‌కి వెళ్లారు.

యమునా, వసంతా చీరల సెలక్షన్ ఎంతకీ తెమలపోవడంతో అమృతకి విసు గొచ్చి ఆ పక్కనే ఉన్న పిల్లల బొమ్మల సెక్షన్‌కి వెళ్ళి వాటిని చూడసాగింది. అక్కడ ఉన్న రకరకాల బొమ్మలని చూస్తుంటే ఆమెకి తెలియకుండానే సమయం కూడా గడిచిపోతోంది.

"హేయ్...! అమృతా నువ్వింకా బొమ్మ లతో ఆడుకుంటావా..." ఉన్నట్టుండి అక్షయ్ గొంతు వినిపించి అమృత తలెత్తి చూసింది. అక్షయ్ నవ్వుతూ పలకరి స్తుంటే అప్పుడు ఈలోకంలో కొచ్చింది.

"నీకు బొమ్మలంటే ఇంతిష్టమా...? ఓకె! ఈసారి నుంచీ నీకు కోపమొచ్చినప్పు డల్లా ఏంచేయాలో ఇప్పుడే తెలిసింది" చాలాసేపట్నుంచీ ఆమెనే గమనిస్తున్న అక్షయ్ సరదాగా చెప్తున్నాడు.

"మీరిక్కడేం చేస్తున్నారు...?" తేరు కుంటూ అడిగింది.

"నా ప్రయాణానికి కావాల్సిన షాపింగ్ కోసం వచ్చాను. మరి నువ్వు...?" అక్షయ్ అడుగుతుంటే

అప్పుడు అక్క గుర్తొచ్చి ఒక్కసారి గుండె దడదడా కొట్టుకోవడం మొదలె ట్టింది.

"అమ్మో ఒకవేళ అక్క అక్షయ్‌నిక్కడ చూసిందంటే ఇంకేమైనా ఉందా...?" టెన్ష న్‌గా తలతిప్పి పక్కకి చూసి ఉలిక్కిప డింది.

"ఇక్కడున్నావా...? నువ్వు కిందకెళ్ళిపో యావనుకుని నాన్న పాకెట్లు పట్టుకుని కారు దగ్గర కెళ్ళిపోయారు కూడా" వసంత అమృతనడుగుతోంది కానీ ఆమె కళ్ళు మాత్రం తన కూతురితో ఇంత చనువుగా మాట్లాడుతున్న అబ్బాయి ఎవరన్నట్లు అక్ష య్‌ని నఖశిఖ పర్యంతం పరిశీలిస్తు న్నాయి.

"మీ మదరా... అమృతా...?" అని అడుగుతూనే, "హలో ఆంటీ" అంటూ అక్షయ్ అప్పుడే ఆవిడని విష్ కూడా చేసే

శాడు. ఆవిడ అక్షయ్‌నెప్పుడూ చూడలేదు కాబట్టి ప్రాబ్లమేమీ లేదనుకుంటూ అమృత తప్పనిసరిగా అక్షయ్‌ని వాళ్ళమ్మకి పరిచయం చేయక తప్పలేదు.

అతను అమృతకి బాస్ అని తెలిసి వసంత చాలా సంతోషించి ఇంకా మర్యాదగా అతన్ని పలకరించింది.

"అమృత చాలా నైస్‌గర్ల్ ఆంటీ... మా నాన్నమ్మకి కూడా తనంటే చాలా ఇష్టం..." అక్షయ్ చాలా ఓపెన్‌గా మాట్లాడేస్తున్నాడు.

"ఆహా...! అయితే అఫీసులో బానే ఉంటుందన్నమాట. ఇంట్లో మాత్రం చాలా పెంకిది. అస్సలు మాట వినదు" అక్షయ్ అంత చక్కగా మాట్లాడడం చూసి వసంత కూడా తన ధోరణిలో తను కూతురి గురించి సరదాగా చెప్తూ, తనకేసి అమృత చురచురా చూస్తుండడం చూసి అక్కడితో ఆగింది.

"ఒకె సర్...! నాన్న వెయిట్ చేస్తుంటారు. ఇక వస్తాం" అంటూ అక్షయ్‌కి బై చెప్పి "పదమ్మా" అని వసంతని తీసుకుని అడుగు ముందుకేసిన అమృత గుండె ఒక్కసారి ఆగినట్లైంది.

యమున... మాటా పలుకూ లేకుండా బొమ్మలా తమకేసి చూస్తోంది. అయితే అక్క నాన్నతో కింద కెళ్ళలేదా...? ఏం చెయ్యాలో తోచని అసహాయపరిస్థితిలో అమృత తడబడింది.

"ఐ కాంట్ బిలీవిట్...! నువ్వు... మీరు యమున కదూ...?" అక్షయ్ యమునని అప్పుడే చూసి ఆమెని గుర్తుపట్టి ఆశ్చర్యంగా అడుగుతున్నాడు.

"మా యమున మీకు ముందే తెలుసా...?" వసంత వెంటనే అడిగింది.

"ఓ మైగాడ్...! యమున కూడా మీ అమ్మాయేనా...?" ఆ విషయం అప్పుడే తెలిసిన అక్షయ్ వసంతనడుగుతూ, అమృతకేసి ఒక్కక్షణం అయోమయంగా చూశాడు.

"అమ్మా...!నువ్వొస్తేరా... వెళ్తున్నా..." అప్పుడే షాక్ నుంచి కొద్దిగా తేరుకున్న యమున వసంతతో కఠినంగా చెప్పి విసురుగా నడుచుకుంటూ వెళ్ళిపోతోంది.

"ఆగమ్మా యమునా వచ్చేస్తున్నాం..." యమునకేమైందో తెలియక వసంత కూడా ఆమె వెనక కంగారుగా పరుగు తీసింది.

"వాట్ హాపెండ్ టు హర్...?" అక్షయ్ ఆశ్చర్యంగా అడగబోయాడు గానీ అప్పటికే అమృత కూడా గాభరా పడుతూ యమున దగ్గర కెళ్ళిపోయింది.

"అంటే...? అమృత?" స్కూల్ యూనిఫాం... రెండు జడలు వేసుకున్న... పదమూడు పద్నాలుగేళ్ళ అమృత అతని కళ్ళముందు మెదిలింది.

ఆ రోజు తమతో అంత గొడవ పడ్డ ఆ అమ్మాయే... ఈ అమృతా...? అక్షయ్ విభ్రాంతిగా చూస్తున్నాడు.

★ ★ ★

"వసూ... హాస్పిటల్ కెళ్ళిపోదామా...?" విశ్వం కంగారుగా వసంత నడిగాడు.

"అమ్మా...! అక్క బాగా అలిసిపోయినట్లుంది. దాన్ని కాసేపు రిలాక్స్‌గా పడుకోనీ..." యమునకేమైందో బాగా తెలిసిన అమృత ధైర్యం చెప్పింది.

"ఇందుకే దాన్ని రావద్దన్నది. అసలే నీరసం పిల్ల... దేన్నీ తట్టుకోలేదు..." వసంత గొణుక్కుంటూ కూర్చుంది.

"అక్కా...! ఈ గ్లూకోజ్ వాటర్ కొంచెం తాగు" అంటూ ఇంటికెళ్ళగానే అమృత గబగబా కలిపి తెచ్చిన గ్లాసుని యమున విసురుగా తోసిపారేసింది.

"ఏమైందమ్మా...? మీరిద్దరూ ఏమైనా





గొడవ పడ్డారా...?" అది చూసి విశ్వం ఆశ్చర్యంగా అడిగాడు.

"యమునా...! అమృత నిన్నేమైనా అంటే నాకు చెప్పమ్మా..." వసంత యమునని లాలిస్తూ అడగగానే...

- అమృత భయపడినట్లే యమున ఒక్కసారి అగ్నిపర్వతంలా బద్దలైపోయింది.

"అసలు దానికేమైనా సిగ్గూ, అభిమానం లాంటి లక్షణాలేమైనా ఉన్నాయా...? పోయిపోయి ఆ అక్షయ్ దగ్గర ఉద్యోగంలో జేరింది...? వాడెలాంటివాడో తెలిసి కూడా మీరెలా ఒప్పుకున్నారు నాన్నా..." అందరి మీదా ఒకేసారి భగ్గుమంది.

"సారీ అక్కా...! నువ్విలా బాధపడతావనే నేనీ విషయం నీకు చెప్పలేదు. అలాగే అమ్మా నాన్నలకీ చెప్పలేదు" అమృత మెల్లగా చెప్పింది.

"అసలేం జరిగిందమ్మా... నాకేమీ అర్థం కావటం లేదు...?" విశ్వం అయోమయంగా అడిగాడు.

"ఇంకేం జరగాలి నాన్నా...? ఇది ఆ అక్షయ్ దగ్గర ఉద్యోగంలో జేరి, ఆ విషయం మనకి చెప్పకుండా దాచిపెట్టి మనల్ని మోసం చేస్తోంది" గట్టిగా అరిచింది యమున

"అక్కా... ప్లీజ్ ఈ టైంలో ఇలా నువ్వు ఎగ్జైట్ అవుతావని భయపడే నేను చెప్పలేదు. అయాం వెరీ సారీ" అమృతకీ పరిస్థితి చాలా గిల్టీగా ఉంది.

"అంటే ఇందాక కనపడ్డ అబ్బాయి ఆ రౌడీ వెధవల్లో ఒకడా...?" వసంత ఖంగుతింది.

"అమృతా అసలిదంతా ఏమిటి...? నీకేం తక్కువని అలాంటివాడి దగ్గర ఉద్యోగంలో జేరాలి...? మాకు చెప్తే వద్దంటామని దాచిపెట్టి మరీ ఆ బోడి ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం నీకేముంది...?" విశ్వం తల పట్టుకున్నాడు.

"అది అక్షయ్ ఆఫీసని తెలియకముందే నేనక్కడ జాయినయ్యాను. ఆ తరువాత అక్షయ్‌నక్కడ చూసి నేనూ షాక్ తిన్నాను. నేను రాసిన బాండ్‌వల్ల గత్యంతరం లేక అక్కడ ఉద్యోగంలో కొనసాగవలసి వచ్చింది" అమృత నెమ్మదిగా అసలు విషయం చెప్పింది.

"ఐతే మాత్రం మాటవరసకైనా చెప్పచ్చు కదా...?" అవేశంగా అడిగింది వసంత.

"అవునమ్మా...! ఏదైనా సమస్యలొచ్చినప్పుడు నువ్వు మాకు చెప్పాలి కానీ ఇలా దాయడం వల్ల ఉపయోగమేమిటి చెప్పు...?" విశ్వం కూడా అమృతను మందలించాడు.

"చెప్పడం వల్ల మాత్రం ఉపయోగమేముంది నాన్నా...?" అప్పుడు అక్షయ్‌వల్ల మీరెంత టెన్షన్ పడ్డారో, అమ్మ ఎంత బెంగ పెట్టుకుందో ఇక అక్క...? అదెంత భయపడిందో నాకు బాగా గుర్తుంది కాబట్టే ఊరుకున్నాను... అంతే తప్ప మీ దగ్గరేదో దాచాలని కాదు" మృదువుగా చెప్పి...

"సారీ... అక్కా...! ఇంకా నీకు నా మీద కోపం పోలేదా...?" మౌనంగా కూర్చుని ఏదో ఆలోచిస్తున్న యమునని చూసి వేడికోలుగా అమృత అడిగింది.

"యమునా...! అమృత స్థానంలో ఎవరున్నా అంతకన్నా ఏమీ చెయ్యలేరమ్మా" విశ్వం కూడా అనునయంగా చెప్పాడు.

"అమృతా...! జరిగిందేదో జరిగిపోయింది కానీ నువ్వు మాత్రం రేపట్నుంచీ ఆ ఛాయలకి కూడా వెళ్ళనని నాకు ప్రామిస్ చెయ్యి"... యమున కళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

"ఇంకెంతక్కా...! ఇంకో నెలరోజుల్లో నా బాండ్ గడువు పూర్తికాగానే నేను రిజైన్ చేసేస్తాను సరేనా"

యమున కోపం అంత తొందరగా తగ్గి పోవడంతో అమృత తేలిగ్గా ఊపిరి పీల్చు కుంది.

"నెల రోజులు కాదు. నువ్వొక్కరోజు కూడా అక్కడికెళ్ళడానికి నేనొప్పుకోను... ఇన్నాళ్లూ వాడికి నువ్వెవరివో తెలియదు కానీ ఇప్పుడు తెలిసిపోయింది కదా... వాడు నీ మీద ఖచ్చితంగా పగ తీర్చుకుం టాడు. వాళ్ళ సంగతి నాకు బాగా తెలుసు" యమునకి మళ్లీ భయం పట్టుకుంది.

"ఏంటక్కా నువ్వు...? మరీ అంత ఫూలిష్‌గా మాట్లాడుతు న్నావు. పగలూ, ప్రతీకారాలూ తీర్చుకోవడానికి ఇదేమైనా సిని మానా...? అక్షయ్ గురించి నువ్వేమీ కంగారుపడకు... కొద్ది రోజుల్లో అతను ఇంగ్లాండ్ వెళ్లి పోతున్నాడు కూడా" అమృతకి యమున అర్థంలేని భయాలని చూస్తుంటే ఏమనాలో తెలియ లేదు.

"అమృతా...! నేనెందుకు చెప్తున్నానో నీకు తెలీదు. అప్పుడు మనం వాళ్ల మీద కేసు పెట్టినందుకు ఆ కక్ష మన సులో పెట్టుకుని నిన్నేదైనా చేసేస్తాడు" యమునకప్పుడే అరికాళ్ళలోంచి వణుకొచ్చే స్తోంది.

"అక్కా...! నా సంగతి నీకు తెలుసు కదా... నా జోలికెవరైనా వస్తే నేనూరు కుంటాననుకున్నావా...? అలాంటి భయా లేమీ పెట్టుకోకు" అని అమృత ధైర్యం చెప్తున్నా...

"అమ్మా...! దానికేం తెలీదు. రేప్పొద్దున దానికేదైనా జరిగితే దాంతోపాటు మన మంతా ఏడుస్తూ కూర్చోవాలి. నువ్వైనా దానికొక్కాస్త చెప్పమ్మా" అంటూ యమున అసహాయంగా ఏడవడం మొదలెట్టింది.



**"నెల రోజులు కాదు. నువ్వొక్కరోజు కూడా వెళ్ళడానికి నేనొప్పుకోను... ఇన్నాళ్లూ వాడికి నువ్వెవరివో తెలి యదు కానీ ఇప్పుడు తెలిసిపోయింది కదా... వాడు నీ మీద ఖచ్చితంగా పగ తీర్చుకుంటాడు. వాళ్ళ సంగతి నాకు బాగా తెలుసు"**



"చూశావా...! అది నీ కోసం బెంగప డుతూ దాని ఆరోగ్యం పాడు చేసుకుం టోంది. దాని మాట విని రేపట్నుంచీ ఆ వెధవాఫీసు మానేయ్. ఇప్పుడు నీకు ద్యోగం లేనంత మాత్రాన కొంపలేం ముని గిపోవు" వసంత ఖచ్చితంగా చెప్పేసింది.

"ఏంటమ్మా... మీరు...? ఇంత చిన్న విషయానికి అంత రాద్ధాంతం చేస్తు న్నారు? " అమృతకీ బాగా విసుగొచ్చింది.

"అది రాద్ధాంతం కాదమ్మా... నీకెంత ధైర్య మున్నా సరే మా భయం మాది. అమ్మ చెప్పింది నిజమే... ఇప్పుడు నువ్వు ఉద్యోగం చెయ్యకపోయినా పర్లేదు. మా కన్నింటికన్నా ముందు నీ భద్రత ముఖ్యం" విశ్వం కూడా ముందు అక్క ణ్ణుంచి ఎలాగోలా బయటకి రమ్మని, కావాలంటే తను కూడా ఆఫీసుకొచ్చి మాట్లాడతా నని చాలా సేపు చెప్పాడు.

"సరే అక్కా నీ ఇష్టం... ఇంకనైనా ఆ ఏడుపు మానేయ్" చివరికి అమృత ఒప్పుకుని ప్రామిస్ చేసేదాకా యమున ఏడుస్తూనే ఉంది.

★ ★ ★

"హాయ్ అమృతా...! గుడ్ మార్నింగ్" అంటూ అక్షయ్ తన పక్కనే కారాప డంతో...

"మీతో కొంచెం మాట్లాడాలి" అంది అమృత. ఆమె అంత డల్‌గా ఉండడం అక్షయ్ ఆరోజే మొదటిసారి చూస్తు న్నాడు.

"కమాన్... అలా వెళ్తూ మాట్లాడు కుందాం" ఆమెను చూస్తుంటే ఏదో పెద్ద





విషయమే అని అతనికి అర్థమైపోయింది.

"అమృతా! నువ్వేదో మాట్లాడాల న్నావు? " నెక్లెస్ రోడ్‌లో అక్షయ్ కారాపే దాకా అమృత ఏదో దీర్ఘాలోచనలో ఉంది.

"నాకొక హెల్ప్ కావాలి" మొహమాటప డుతూ అడిగిన అమృతని చూసి అక్షయ్ చిన్నగా నవ్వాడు.

"అమృతా, హెల్ప్ అడగడానికి ఇంత మొహమాటపడాలా...? నన్ను నువ్వు డిమాండ్ చేసి మరీ అడగచ్చు.. నేను నీకేం సహాయం చెయ్యగలనో నువ్వే చెప్పు" అన్నాడు.

"నేను... వెంటనే రిజైన్ చెయ్యాలి. దానికి మీ సహాయం కావాలి" అమృత మెల్లగా చెప్పింది.

"వాట్..." అక్షయ్‌కి పెద్ద షాకే తగి లింది.

"ఉన్నట్టుండి నీకీ ఆలోచనెందుకొ చ్చింది? అసలు నిన్నట్నుంచి నాకంతా కన్ఫ్యూజింగ్‌గానే ఉంది అమృతా..." అక్షయ్ అయోమయంగా అడిగాడు.

అమృత ఇక ఒక్క క్షణం కూడా సంకో చించలేదు.

"నేనీ డెసిషన్ చాలా రోజుల క్రితమే తీసుకున్నాను. అయితే నా బాండ్ పిరి యడ్ పూర్తి కాకుండా రిజైనివ్వలేను కనుక ఇన్నాళ్ళూ కంటిన్యూ అయ్యాను కానీ..." అక్షయ్ కళ్లలోకి సూటిగా చూసింది.

"కానీ..." అప్పటికే అక్షయ్‌కేదో అను మానం వచ్చేసింది.

"నేనిక్కడ చేస్తున్నట్లు అక్కకిన్నాళ్ళూ తెలీదు. ఇప్పుడు తెలిసిపోయింది కదా అందుకు..."

"అంటే... యమునకింకా నామీద కోపం పోలేదా...? " అక్షయ్ ఆమె మాటల కడ్డొచ్చాడు.

"ఎందుకు పోవాలి...? " తీవ్రంగా అడి గింది అమృత.

"అమృతా...! నేనొప్పుకుంటాను. మేం యమునని కాస్త ఎక్కువగానే రాగింగ్ చేశాం. దానికి పనిష్మెంట్ కూడా అనుభ వించాం... ఆ మేటర్ అక్కడితో ముగిం చాలి కానీ ఇదంతా ఏమిటి...? " అక్షయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"మీరు మర్చిపోయినంత ఈజీగా మా అక్క ఆ మేటర్ని మర్చిపోలేదు. అంత మానసిక వేదన, భయం అది అనుభవిం చింది. ఆ భయంతోనే ఆఖరికి చదువు కూడా మానేసింది... ఒక రకంగా చెప్పా లంటే అసలు పనిష్మెంట్ మా అక్కకే లభించింది" అమృత బాధగా జరిగిం దంతా చెప్పింది.

"ఐ కాంట్ బిలీవిట్...! జస్ట్... రాగిం గ్‌కి భయపడి యమున అంత సిల్లీగా చదువు మానేయడమేంటి...? " అక్షయ్ నమ్మలేకపోతున్నాడు.

"మీకది జస్ట్ రాగింగే కావచ్చు కానీ అక్కలాంటి అమాయకులూ, సున్నిత మన స్కులూ రాగింగ్‌ని తట్టుకోలేక, ఆఖరికి ఆత్మహత్యలకి కూడా పాల్పడుతున్నారు. ఇక మా అక్క చదువు మానడంలో పెద్ద విశేషమేముంది? " అమృత ఆవేశంగా అంది.

"అయాం సారీ... అమృతా...! యమున నెలాగైనా పార్టీకి రప్పించాలనే పంతంతో మేం తనని బాగానే రాగింగ్ చేశాం. కానీ ఇంతకన్నా దారుణాతి దారు ణంగా ఫస్టియర్‌లో నేను కూడా రాగింగ్‌ని ఎదుర్కొన్నాను. ఒక్క నేనేనా...? నువ్వ యినా రాగింగ్‌ని ఫేస్ చెయ్యకుండానే నీ చదువు పూర్తి చేశావా...? " అక్షయ్ కూడా తీవ్రంగా అడిగాడు.

"అదేకదా అసలు ప్రాబ్లం...? మనం రాగింగ్‌ని ఎదుర్కున్నామని, దానివల్ల ఎన్నో బాధలు పడ్డామని, దానికి మళ్లీ బదులు తీర్చుకోవాలని కక్ష సాధింపుతో

అప్పుడే కొత్తగా కాలేజ్‌లో అడుగు పెట్టిన జూనియర్లని వేధింపులకి గురి చేస్తున్నారు తప్పితే... అప్పుడు మనం పడ్డ బాధ, వేదన వాళ్ళు కూడా పడతారనీ, మనలాగే వాళ్ళ మనస్సులు కూడా గాయపడతాయనీ ఒక్కసారి కూడా ఆలోచించరు. అందుకే రోజు రోజుకీ ఈ సమస్య తీవ్రత రమౌతోంది తప్ప పరిష్కరించబడడం లేదు" అమృత ఆవేదనగా చెప్పింది.

"అమృతా! వయస్సు, అనుభవం వల్ల ఇప్పుడు నాకొచ్చిన పరిణితితో ఆలోచిస్తుంటే నువ్వు చెప్పింది కరెక్టేననిపిస్తోంది. కానీ అప్పుడు నాకింత మెచ్యూరిటీ లేదు. జస్ట్ ఫర్ ఫన్ అనుకుంటూ అల్లరి చెయ్యడం, కాలేజ్ లైఫ్‌ని ఎంజాయ్ చెయ్యడం తప్ప, ఎదుటి వాళ్ళ ఫీలింగ్స్ గురించి ఆలోచించలేదు. అందుకే ఒకసారి యమునని కలిసి సారీ చెప్పేస్తాను. మీ ఇంటికెళ్దాం పద..." అక్షయ్ మనస్ఫూర్తిగా చెప్పి కార్ స్టార్ట్ చేస్తున్నాడు.

"వద్దు సర్...! ఇప్పుడు మీరొచ్చి సారీ చెప్పడం వల్ల అక్క మిమ్మల్ని చూసి మళ్ళీ డిస్టర్బ్ అవడం తప్ప ఉపయోగమేముంది? దానివల్ల తను కోల్పోయిన చదువు, తన కెరీర్ ఇవేవీ మీరు తిరిగివ్వలేరు కదా...?" నిర్లిప్తంగా చెప్పింది అమృత.

"అమృతా! నేనెప్పుడూ నా జీవితాన్ని హాయిగా, తేలిగ్గా గడిపేస్తాను. నా వల్ల తప్పు జరిగితే సారీ చెప్పి భారం తీర్చేసుకుంటాను. అంతే తప్ప ఆ గిల్ట్ ఫీలింగ్‌ని భరిస్తూ బతకలేను. పోనీ... నేనేం చేస్తే యమునకి సంతోషం కలుగుతుందో చెప్పు. అదే చేస్తాను"

అక్షయ్‌ది చాలా ఈజీ గోయింగ్ మనస్తత్వమని అమృతకి బాగా తెలుసు. అందుకే-

"అది మొదటే చెప్పాను కదా. రిజైన్ చేస్తానని అక్కకి ప్రామిస్ కూడా చేసేశాను" అమృత నెమ్మదిగా చెప్పింది.

"అమృతా...! నువ్వు చాలా తొందర పడుతున్నావని నాకనిపిస్తోంది. ఆఫ్టరాల్... ఇది నీ కెరీర్...! ఆకృతిలో నీకు మంచి భవిష్యత్తుంది. రామరాజు అంకుల్‌కి నువ్వంటే చాలా అభిమానం కూడా ఉంది. ఇంకోసారి బాగా ఆలోచించు..." అక్షయ్‌కిది సుతరామూ ఇష్టం లేదని తెలిసిపోతూనే ఉంది.

"లేదు సర్! ఇప్పటికే నా తొందరపాటు వల్ల అక్క చదువు పాడైందేమోనన్న గిల్టీ ఫీలింగ్ నాకుంది. అందుకే తనని బాధ పెట్టడం నాకిష్టం లేదు. రిజైన్ చేసేస్తాను. దానికే మీ హెల్పు కావాలి" ఇక డైరక్ట్‌గా అడిగేసింది.

"ఇలాంటి విషయాల్లో డాడ్ చాలా స్ట్రిక్ట్‌గా రూల్స్ ఫాలో అవుతారు అమృతా. పోనీ ఓ పని చేద్దాం. ఏదో ఒక కారణంతో ముందు ఒక పదిహేను రోజులు సెలవు పెట్టు. తర్వాత దాన్ని ఎక్స్‌టెండ్ చేసి ఈ నెలరోజులు గడిచాక... తర్వాత విషయం చూసుకోవచ్చు" ఈ నెలరోజుల్లో అమృత మనస్సు మారుతుందన్న ఆశతో అక్షయ్ ఆ సలహా ఇచ్చాడు.

"అన్నాళ్ళు లీవ్ అంటే రామరాజుగారొప్పుకుంటారా...?" అంతకన్నా ఇంకో దారి లేక అమృత కూడా ముందు సెలవు పెట్టడమే బెటరనుకుంది.

"డోంట్‌వర్రీ...!ఆయన్ని నేనొప్పిస్తాను" అక్షయ్ ఆమెకి అభయం ఇచ్చేశాడు.

★ ★ ★

అమృత ఇచ్చిన లీవ్ లెటర్ చూసీ చూడగానే రామరాజుగారు ఇంతెత్తున ఎగిరిపడ్డారు.

"ఏంటమ్మా ఇది...? ఒక్కరోజు రెండ్రోజులు కాదు ఏకంగా పదిహేనురోజులు





లీవా...? ఇవ్వడానికి కుదరదంటే కుదరదు" అని ఖరాఖండిగా చేప్పేశారు.

ఆయన రియాక్షన్ ముందే ఊహించిన అమృత మౌనంగా బయటకొచ్చేసింది. ఆ తరువాత అక్షయ్ ఏం చెప్పి ఒప్పించాడో కాని అమృత లీవ్ శాంక్షన్ చేసి ఆమె వర్కంతా దినేష్‌కి హేండోవర్ చేసెళ్లమని చెప్పారు.

"థాంక్యూ సర్" ఆరోజే మొదటిసారి అక్షయ్‌కి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పింది అమృత. ఈ పరిస్థితిలో అతను తప్ప ఇంకెవరూ తనకి సహాయం చెయ్యలేరని ఆమెకి ముందే తెలుసు.

"వెల్‌కం అమృతా! నీ కోసం ఆకృతి తలుపులెప్పుడూ తెరుచుకొనే ఉంటాయని మాత్రం మర్చిపోవద్దు. అలాగే నా వల్ల ఎప్పుడు ఏ హెల్ప్ అవసరమైనా నిర్మొహమాటంగా అడగచ్చు" అక్షయ్ మరీ మరీ చెప్పాడు.

అమృత బై చెప్పి వెళ్లిపోతుంటే అక్షయ్‌కి చాలా అసహనంగా అనిపించింది. ఇన్నాళ్లు అమృత చాలా తెలివితేటలతో పాటు, దూసుకుపోయే మనస్తత్వం, మంచితనం అన్నీ ఉన్న అందమైన అమ్మాయని ఆమెమీద ఒక గొప్ప అభిప్రాయం ఏర్పడింది కానీ ఇప్పుడు...

అమృత చాలా తెలివి తక్కువగా అక్కర్లేని సెంటిమెంట్లకి, ఎమోషన్లకి లొంగిపోయే బలహీనమైన మనస్తత్వం కలిగిన అతి సాధారణమైన అమ్మాయిలా కనిపిస్తోంది. ఆమె మీద తనకున్న అంచనాలన్నీ తప్పినందుకు మనసంతా ఏదో అలజడి, చెప్పలేని చిరాకు కలుగుతుంటే ఇక అక్కడుండలేక ఇంటికెళ్లిపోయాడు.

దినేష్‌కి తన వర్క్ హేండోవర్ చేస్తుంటే అంతసేపూ లేని బాధ అమృతకప్పుడు మొదలైంది. తన కాబిన్‌నంతా దిగులుగా చూసుకుంది. ఎన్ని ఆశలతో తనిక్కడ ఉద్యోగంలో జేరిందో గుర్తొచ్చి మనసంతా భారమైంది.

"అమృతా...! ఎన్నాళ్లు లీవ్ పెట్టారు? మళ్ళీ ఎప్పుడొస్తారు...?" దినేష్ అడుగుతున్న ప్రశ్నలకి ఏదో సమాధానమిచ్చి బయటకొచ్చింది.

బయటకొచ్చి మెట్లు దిగుతూ వెనక్కి తిరిగి మళ్ళీ మళ్ళీ చూసుకుంటూ చెప్పలేక చెప్పలేక ఆకృతికి వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయింది.




"అమ్మయ్య...! వచ్చేశావా...?" అమృత ఇంట్లో కడుగు పెట్టగానే యమున నిశ్చింతగా ఊపిరి తీసుకుంది. అమృత తిరిగొచ్చేదాకా ఆమె మనస్సు మనస్సులో లేదు.

"మళ్ళీ ఇక పొరపాటున కూడా అటెళ్లకు... తెలిసిందా!" అమ్మ, అక్క తనకి చెప్తున్న బుద్ధులకి విసుగొచ్చి గదిలోకెళ్ళి పడుకుంది అమృత.

"ఏమైందమ్మా...? ఆఫీసులో ప్రాబ్లమేమీ రాలేదుకదా...?" రాత్రి విశ్వం భోజనాల దగ్గర అడిగాడు.

"ఏంలేదు నాన్నా" ముక్తసరిగా చెప్పింది.

"వచ్చిన దగ్గర్నుంచీ ఇంతే... ఒక్క ముక్క మాట్లాడితే ఒట్టు... మూతి బిగించుకుని కూర్చుంది" వసంత నిష్ఠూరంగా చెప్పింది.

# టేక్ యువర్ సీట్



హాస్యనటుడు రేలంగి వెంకట్రామయ్య ఆదిలో ఏదో పౌరాణిక చిత్రానికి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా కూడా పనిచేశారు. ఒకసారి ఆయన తన అసిస్టెంటును సెట్‌లోకి కావాల్సిన సరంజామా సప్లయ్ చేసే కంపెనీకి పంపిస్తే, ఆ అసిస్టెంట్ ఓ పాతకుర్చీని జీప్‌లో వేసుకుని తీసుకొచ్చాడు.




రేలంగి నిర్ఘాంతపోతూ 'ఇదేంట్రా? నిన్న ఆ కంపెనీలో ఒక పెద్ద సింహాసనం చూశాను. నువ్వేంటి ఈ పాతకుర్చీతో వచ్చావ్! వేరే కంపెనీకిగానీ వెళ్లావా?' ప్రశ్నించారు.

దానికతను, 'లేదండీ ఆ కంపెనీకే వెళ్లానండీ. అక్కడ ఎదురుగా ఓ పెద్దమనిషి కన్పించగానే మీరు పంపించారని చెప్పానండీ. ఆయన టేక్ యువర్ సీట్ అంటూ అక్కడ ఓ కుర్చీ చూపించి లోపలికి వెళ్లారండీ..ఇకనేం.. టేక్ యువర్ సీట్ అన్నాడు కదా అని దీన్ని తీసుకొచ్చేశానండీ' అనేసరికి రేలంగికి నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు.

"అసలక్కడ ఏమైందో ఏమిటో ఏమీ చెప్పకపోతే మనకెలా తెలుస్తుంది?" యమున కూడా చిరాగ్గా అంది.

"ఇందులో తెలియడానికేముంది...? రేపట్నుంచీ నేనాఫీసు కెళ్లక్కర్లేదని చెప్పానుగా" అంతకుమించి ఏమైనా చెప్తే యమున మళ్ళీ ఎలా రియాక్టవుతుందోనని అమృత భయం. అన్నింటికన్నా ముందు అసలు మాట్లాడాలనే మూడ్ కూడా లేదు. మనసు చాలా ఉదాసీనంగా ఉంది. బాల్కనీలో కెళ్ళి ఒంటరిగా కూర్చుంది.

ఆకృతిలో తను పని చేసిన రోజులన్నీ గుర్తుకొస్తున్నాయి.

హుందాగా పనిచేసే ప్రభు, తను చేసిన పనికి వంకలు పెట్టే వినోద్, ఏదో విషయాన్ని పట్టుకుని డొంకతిరుగుడుగా మాట్లాడుతూ తన వెనక తిరిగే దినేష్... ఎప్పుడూ మెచ్చుకోలుగా మాట్లాడి ప్రోత్సహించే రామరాజుగారు, సరదాగా పలకరించే కొలీగ్స్...

కొత్త కొత్త ప్రాజెక్టులు చెయ్యాలని, పెద్ద ఆర్కిటెక్ట్ అవ్వాలని కలలుకంటూ, పోటీలు పడి మరీ పనిచేస్తూ... స్పృజనాత్మకంగా, ఉత్తేజాన్ని కలిగించే ఆకృతి వాతావరణం తలుచుకుంటుంటే చెప్పరాని బాధ కలుగుతోంది.

ఈసారి తను చేరబోయే సంస్థలో ఇటువంటి వాతావరణం ఉంటుందా...? ఉన్నా కూడా అక్కడ సుధీర్ కానీ, ప్రమోద్ గానీ ఉంటే తను మళ్ళీ ఇలాగే రిజైన్ చెయ్యాల్సొస్తుందా...? ఆమెకెందుకో ఆ క్షణంలో తను చేసిన పని చాలా ఫూలిష్‌గా కనిపిస్తోంది.

ఆకాశాన్ని, నక్షత్రాలని చూస్తూ మళ్ళీ తనకి తనే సర్దిచెప్పుకోవడం మొదలుపెట్టింది.





జరిగిందేదో జరిగింది. తను ఆకృతి నుంచి బయటకొచ్చేసింది. అంతే కదా...! మళ్లీ కొత్త జాబ్ చూసుకుంటుంది. అక్కడ కూడా కష్టపడి పనిచేసి తన టాలెంట్ నిరూపించుకుంటుంది. ఉన్నత శిఖరాలు అధిరోహిస్తుంది. ఈ లోకంలో కష్టానికి తగ్గ గుర్తింపు ఎప్పుడూ దొరుకుతుంది.. ఆశావాదంతో ఆలోచిస్తూ అమృత మళ్లీ తనని తనే తేలిక పరుచుకోవడం మొదలెట్టింది.

"దాని మనసేం బాగాలేదు. అదీ ఇదీ అడిగి దాన్నింకా విసిగించకండి..." అమృతని చూసి విశ్వం వసంతకీ, యమునకీ నెమ్మదిగా చెప్పాడు.

"పోన్లెండి..! అసలే జగమొండిది. మన మాట ఖాతరు చేసి ఆ ఉద్యోగం కాస్తా మానేసింది. అది చాలు"

వసంత బాగానే సంతోషించింది.

"వాడెలాంటివాడో అమృతకీ బాగానే అనుభవమై ఉంటుంది. అందుకే అలా ఉంది" తనలో తనే అనుకుంది యమున.



**తను ఆకృతి నుంచి బయటకొచ్చేసింది. అంతే కదా...! మళ్లీ కొత్త జాబ్ చూసుకుంటుంది. అక్కడ కష్టపడి పనిచేసి తన టాలెంట్ నిరూపించుకుంటుంది. ఉన్నత శిఖరాలు అధిరోహిస్తుంది. కష్టానికి తగ్గ గుర్తింపు ఎప్పుడూ దొరుకుతుంది..**



యమున శ్రీమంతానికొచ్చిన బంధువులతో ఇల్లంతా కళకళలాడుతోంది. లేత నీలిరంగు చుడీదార్‌లో నీలి మేఘంలా తిరుగుతున్న అమృతని యమున తరపు చుట్టాల్లో ఒకావిడ పరిశీలనగా చూస్తోంది.

"అమ్మాయేం చదివింది...?" అంటూ వసంతని వివరాలడగడం మొదలెట్టింది. వసంత చెప్పగానే...

"మా చెల్లెలి కొడుకు అమెరికాలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. వాడికి అమ్మాయి అందంతో పాటు చదువు మీద కూడా పట్టింపెక్కువ. మంచి కుటుంబంలో ఈ లక్షణాలున్న అమ్మాయి కావాలని చూస్తున్నాం. ఇప్పటికే చాలా సంబంధాలు చూశాం కానీ చదువుంటే అందం లేదు. అందంవుంటే చదువులేదు. రెండూ ఉంటే కుటుంబం బాలేక అన్నీ తప్పిపోయాయి" ఆవిడ అనర్గళంగా చెప్పుకుపోతోంది.

"అలాగా...!" వసంత సంబరంగా వింటోంది.

"కట్నకానుకల మీద వాళ్ళకి పెద్దగా ఆశ కూడా లేదు. కానీ మీ అమ్మాయి తప్పకుండా ఉద్యోగం చేయాలి. అదొక్కటే పెళ్ళికొడుకు కండిషన్. అక్కడ ఖర్చులకి ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటే గానీ తట్టుకోలేరు కదా" అందావిడ.

"అసలు మా అమ్మాయి క్కూడా ఉద్యోగం లేకుండా ఖాళీగా కూర్చోడం ఇష్టం లేదండీ" అంటూ వసంత పరమానందపడిపోతూ అమృత గురించి చెప్పడమే కాకుండా అబ్బాయి వివరాలన్నీ సేకరించ సాగింది.

"మరింకేం... నేను అబ్బాయికి ఎప్పుడు ఖాళీ దొరుకుతుందో అడిగి పెళ్ళిచూపులెప్పుడో చెప్తాను" అంటూ ఆవిడ కూడా ఒక అడుగు ముందుకేసింది.

"అబ్బాయిప్పుడు ఇక్కడే ఉన్నాడా...? అయితే మరీ మంచిది..." అంది వసంత సంతోషంగా.

"అబ్బే! వాడిక్కడ లేడండీ. పెళ్ళిచూపులకేముంది? ఇంటర్‌నెట్‌లో చూసేస్తాడు. అమ్మాయి నచ్చితే అప్పుడు సెలవు పెట్టుకొచ్చి ఏకంగా పెళ్లిచేసుకుని తీసుకెళ్ళిపోతాడు" ఆవిడ చేతులు తిప్పుకుంటూ మరీ చెప్పి వెళ్ళింది.

ఆ రాత్రి హడావిడంతా తగ్గాక వసంత ఉబ్బితబ్బిబ్బైపోతూ ఈ సంబంధం గురించి చెప్పింది.

"అమృత ఎంత అదృష్టవంతురాలు కాక పోతే ఇంత మంచి మ్యాచ్ వస్తుంది" యమునకీ విషయం ముందే తెలుసు కాబట్టి వసంతకి వంతపాడింది.

"ఏమ్మా...! అమృతా నువ్వేమం టావ్...?" విశ్వం అమృత అభిప్రాయం అడిగాడు.

"నాన్నా...! మీకిదివరకే చెప్పాను కదా. నాకిప్పుడు కావాల్సింది పెళ్లి కాదు. మంచి జాబ్! అదొస్తే అదృష్టమనుకో వాలి" అంది అమృత.

"తంతే బూరెల బుట్టలో పడ్డట్టు అమెరికా సంబంధం వచ్చింది. అక్కడే హాయిగా ఏదో ఒక ఉద్యోగం చూసుకో. ఆ అబ్బాయి కూడా ఎలాగూ ఉద్యోగం చేసే అమ్మాయే కావాలంటున్నాడు కదా" అంది యమున.

"ఏంటక్కా నీ ఉద్దేశం? అమెరికా అయితే మాత్రం అంత గొప్పేంటి? వాళ్ల వాంటింగ్స్ చూస్తేనే తెలుస్తోంది వాళ్లెంత కమర్షియల్‌గా ఆలోచిస్తున్నారో... లేక పోతే ఇంటర్‌నెట్‌లో పెళ్ళిచూపు లేంటి...? వినడానికే అసహ్యంగా ఉంది. నాకిష్టం లేదు నాన్నా" ఖచ్చితంగా చెప్పే సింది అమృత.

"ఇది మరీ బావుంది. రోజుల్ని బట్టి మనమూ మారాలని నువ్వే చెప్తావు కదా? ఆ అబ్బాయి మాటిమాటికి రాలేడు కనుక ఇలా చూస్తానన్నాడు. ఆ మాత్రా నికే అంతలేసి మాటలెందుకు?" వాళ్ళు తన తరపు బంధువులు కాబట్టి అప్పటికే యమున మొహం ముడుచుకుంది



**"తంతే బూరెల బుట్టలో పడ్డట్టు అమెరికా సంబంధం వచ్చింది. అక్కడే హాయిగా ఏదో ఒక ఉద్యోగం చూసుకో. ఆ అబ్బాయి కూడా ఎలాగూ ఉద్యోగం చేసే అమ్మాయే కావాలంటున్నాడు కదా" అంది యమున.**



"అక్కా...! రోజుల్ని బట్టి మనమూ మారాలి. అది నిజమే. కానీ చూస్తుంటే ఇదొక బిజినెస్ డీల్‌లా ఉందంతే. ఓసారి నెట్‌లో చూసి అన్నీ నచ్చితే వచ్చి పెళ్లి చేసుకుంటాడా? పెళ్ళంటే ఇదా? ఒకరి గురించి మరొకరికేమీ తెలియకుండా, కనీసం ఒక్కసారి కూడా ఎదురుపడకుండా జీవితాంతం కలిసిఉండే ఒప్పందానికెలా వచ్చేస్తారు?

పెళ్లిచూపులక్కూడా వచ్చే టైం లేనివాడికి నా గురించి, నా మనసు గురించి ఆలోచించే టైం మాత్రం ఎక్కడుంటుంది? కేవలం నా క్వాలిఫికేషన్స్ చూసి, నేను సంపాదించాలనే కండిషన్‌తో మాత్రమే పెళ్లి చేసుకోవాలనుకున్న వాడికి నామీద ప్రేమ ఉంటుందని నేనెలా నమ్మను...? అయినా నేనిప్పుడప్పుడే పెళ్లి గురించి ఆలోచించనని మీకు చాలా సార్లు చెప్పాను. అందుకే వాళ్లకి సారీ చెప్పి నన్నొదిలే యండి" తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా చెప్పేసింది అమృత.

"అమృతా... నీతో మాట్లాడ్డం చాలా కష్టమైపోతోంది. ఇలాగే ఏదో ఒకటి చెప్పి పెళ్ళొద్దని కూర్చుంటే మేమేమ నుకోవాలి...?" వసంత నిరాశగా అడి గింది.

"అమ్మా..! నాకు జీవితంలో కొన్నిలక్ష్యా లున్నాయి. ఇప్పుడు నాకు పెళ్లి కన్నా నా ప్రొఫెషనే ముఖ్యం. ఈ టైంలో పెళ్లి చేసుకుంటే కొత్తగా వచ్చిపడే బాధ్యతలతో నేను అనుకున్నవన్నీ సాధించడం కష్టం. నా జీవితం గురించి నేను కన్న కలలూ, వేసుకున్న ప్రణాళికలూ అన్నీ అస్తవ్యస్తమై





పోతాయి. అందుకే నాకింకా టైంకావాలి" నిర్మొహమాటంగా చెప్పిన అమృతని చూసి వసంతకి టెన్షనొచ్చేసింది.

"నీకేమైనా పిచ్చా...? పెళ్ళి కన్నా ప్రొఫెషనే ముఖ్యమని టైం పెట్టుకుని కూర్చుంటే నీకు పెళ్లి వయసు కాస్తా దాటి పోతుంది. ఇక అప్పుడు నువ్వు చేసుకుం టానన్నా నిన్ను చేసుకోవడానికి ఎవరూ ముందుకు రారు. అందుకే ఇలాంటి వెర్రి మొర్రి ఆలోచనలు మాని ముందు బుద్ధిగా పెళ్లి చేసుకో"

వసంత స్వరంలో ఆవేశంతో పాటు ఆవేదన కూడా విన్పించింది.

"అమృతా...! అమ్మ చెప్పేది పూర్తిగా నిజం. ఆడపిల్లకి జీవితంలో పెళ్ళి, సంసా రమే ముఖ్యం. పెళ్ళి వల్ల వచ్చే బాధ్యతలు కూడా ఆనందంగానే ఉంటాయి. నన్ను చూడు నేనెంత సంతోషంగా ఉన్నానో" యమున కూడా మెల్లగా నచ్చజెప్పబో యింది.

"నేనదేం కాదనలేదే" అంటూ తమ వాదనలన్నీ మౌనంగా వింటూ కూర్చున్న వాళ్ళ నాన్నవైపు తిరిగి "నాన్నా...! నా గురించి మీకే బాగా తెలుసు. నాకింకా కొన్నాళ్ళు టైం కావాలి ప్లీజ్" అంటూ వేడి కోలుగా అడిగింది అమృత.

"వసూ...! అమృతకింకా ఇరవైరెండేళ్ళు కూడా లేవు. ఇప్పుడేదో కొంపమునిగినట్లు దానికంత అర్జంటుగా పెళ్ళిచేసి పంపించా ల్సిన అవసరమేమీ లేదు" అంటూ అమృ తకి కావాల్సినంత టైమిస్తానని భరోసా ఇచ్చేశాడు విశ్వం.

వసంతకీ, యమునకీ మాత్రం అమృత మీద చాలా కోపమొచ్చేసింది. ఆడపిల్లల కింత పొగరు పనికిరాదని రెండ్రోజుల పాటు అమృతతో మాటలు మానేశారు.




అర్ధరాత్రి పన్నెండు గంటలకి ఆఫీసుప న్లన్నీ పూర్తిచేసుకుని అలసటగా ఇల్లు చేరిన చంద్రశేఖర్ తన కోసం అంతవరకూ ఎదురుచూస్తూ కూర్చున్న అక్షయ్‌ని చూసి..

"ఏరా...! ఇంకా పడుకోలేదా...?" అంటూ అప్యాయంగా అడిగారు.

"మీ సంతకమొకటి కావాలి డాడ్" అంటూ ఆయన చేతిలో ఏవో పేపర్లు పెట్టాడు.

"దేనికి...?" అంటూనే వాటిని చూసి ఖంగుతిని "అక్షయ్..! వాటీజ్ దిస్" కోపంగా అడిగారు.

"మీరెలాగూ నేనడిగిన చెక్ మీద సంతకం పెట్టరని నేనే బాంక్ లోన్ తీసు కుంటున్నాను. ఆ ష్యూరిటీ పేపర్లమీద ఒక్క సంతకం చేస్తే మళ్ళీ మీ జోలికి రాకుండా నా పాట్లేవో నేను పడతాను"

అక్షయ్ చాలా నిర్లక్ష్యంగా సమాధానమి చ్చాడు.

"అక్షయ్...! నాకిప్పుడు నీతో వాదించే ఓపిక లేదు" అంటూ ఆయన తన గదిలో కెళ్ళబోయారు.

"కానీ నాకింక ఒక్క క్షణం కూడా వెయి ట్‌చేసే ఓపిక లేదు డాడ్... చూద్దాం, చేద్దాం అంటూ ఇలాగే ఆర్నెల్లు నా టైం వేస్ట్ చేశారు. మీ కిప్పుడే చెప్పేస్తున్నాను. మీరా ష్యూరిటీ పేపర్ల మీద సంతకం చేసినా చెయ్యకపోయినా నేను మాత్రం రేపు వెళ్ళితీరతాను" అక్షయ్ చాలా గట్టిగా

చెప్పేశాడు.

"అక్షయ్..! నాకిక్కడ నీ అవసరమెం తుందో నీకు తెలీదురా... ఎదిగిన కొడుకు బాధ్యతలు తెలుసుకుని తన భారాన్ని కాస్త తగ్గించాలని ఏ తండ్రైనా కోరుకుంటాడు. రామరాజు రిటైరయ్యే లోపల కనీసం ఆకృతి బాధ్యతలన్నా నువ్వు తీసుకుంటా వని ఆశ పడ్డాను. అందుకే ఏదో వంక పెట్టి నిన్నిక్కడే ఉంచాలని ప్రయత్నిం చాను. సరే కానీ... నీకేది ఇష్టమైతే అదే చెయ్యి. నిన్నాపగలిగే శక్తి నాకింకలేదు" అంటూ అప్పటికప్పుడే చెక్‌బుక్ తీసి సంతకం పెట్టి బ్లాంక్‌చెక్ అక్షయ్ చేతికిచ్చి గదిలో కెళ్ళిపోయారు.

"థాంక్స్ డాడ్..!" అంటూ అక్షయ్ ఆనందంగా చెబుతున్నా ఆయన వినిపిం చుకోలేదు.

పగలనక రాత్రనక శ్రమించి తను నిల బెట్టిన తన బిజినెస్‌లకి వారసుడు లేక తన కష్టమంతా పూర్తిగా వృథా అయిపో యిందనే అవేదన, అణచిపెట్టలేని దుఃఖం, తట్టుకోలేని నిరాశ. ఇవన్నీ ఆయన శరీర మంతా అణువణువునా పాకిపోతూ శక్తి హీనుణ్ణి చేస్తుంటే, ఏదో విరక్తి, భరించలేని బాధల్తో ఆయన గుండెంతా నిండిపో యింది. నీరసంగా, నిస్సత్తువగా అలాగే మంచం మీద వాలిపోయారు.

★ ★ ★

"అమృతా...! ఈ విషయం తెలుసా! రాత్రి మన ఛైర్మన్‌గారికి హార్ట్‌ఎటాక్ వచ్చింది. హాస్పటల్‌లో ఉన్నారు" అంటూ దినేష్ దగ్గర్నుంచి మర్నాడు పొద్దున్నే ఫోనొచ్చింది.

"ఓ మైగాడ్! ఇప్పుడెలా ఉన్నారు? ఏ హాస్పిటల్లో ఉన్నారు? " అమృత కంగా రుగా అడిగింది.

"కండిషన్ సీరియస్సే. అపోలోలో ఆయనకిప్పుడు ఆపరేషన్ జరగబోతుంది. మీకు వీలైతే ఒకసారి వచ్చి గ్రూపులు మాచైతే బ్లడ్ డొనేట్ చేయగలరా? ఇప్ప టికే మనవాళ్ళు చాలామంది ఇచ్చారు. కానీ ఇంకా చాలా బాటిల్స్ అవసరమౌతా యట. అందుకే తెలిసినవాళ్ళందరికీ ఫోన్లు చేస్తున్నాం" అంటూ దినేష్ రిక్వెస్ట్ చేశాడు.

"వైనాట్...! నా బ్లడ్ గ్రూప్ ఓ పాజి టివ్ కూడా. నేనెవరికైనా బ్లడ్ ఇవ్వచ్చు. నేనిప్పుడే వచ్చేస్తున్నాను" అంటూ హడావి డిగా బయలుదేరుతున్న అమృతని-

"ఏమయిందే? ఎవరికి హార్టెటాకొ చ్చింది? " ఫోన్లో అమృత మాట్లాడిన మాటలు పూర్తిగా అర్థం కాని యమున ఆరాతీసింది.

"మా ఫ్రెండ్ వాళ్ళ ఫాదర్‌కి" నిజం చెప్తే ఇప్పుడు యమునకి హార్టెటాక్ వచ్చే స్తుందని అబద్ధం చెప్పి అమృత గబగబా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళేసరికి ఇంచుమించు ఆకృతి స్టాఫ్ అంతా అక్కడే ఉన్నారు. చంద్రశేఖ ర్‌గారిని అంతకుముందే ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్ళారట. రామరాజుగారే స్వయంగా పూనుకొని అందరికీ పనులు పురమాయిస్తూ కనిపించారు.

ఆపరేషన్ థియేటర్ పక్కనే సోఫాలో సర్వం కోల్పోయినట్లు వాడిపోయిన మొహంతో దీనంగా, దిగులుగా కూర్చున్న అక్షయ్‌ని పలకరించింది.

"ఈ రోజుల్లో హార్ట్ ప్రాబ్లెమ్స్‌కి మంచి ట్రీట్‌మెంట్ దొరుకుతుంది. చంద్రశేఖర్ గారి ఆపరేషన్ తప్పకుండా సక్సెస్ అవు తుంది. టెన్షన్ పడకండి" అంటూ పరామ ర్శించిన అమృతని చూసి, అక్షయ్ నిట్టూ ర్చాడు.

"టెన్షన్ అంటే ఏమిటో... బెంగలూ, భయాలంటే ఎలా ఉంటాయో... ఈరోజే







"మొదటిసారి నేననుభవిస్తున్నాను అమృతా" అక్షయ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మా మదర్ పోయినప్పుడు డాడ్ నాతో ఉన్నారు కాబట్టి నాకు బాధ తప్ప ఇంకో ఫీలింగ్ కలగలేదు. అమ్మ పోయాక మా యిద్దరికీ మధ్యనున్న అనుబంధం మానసికంగా మరింత బలపడింది. నేనెక్కడున్నా, ఏం చేస్తున్నా నా వెనక కనపడని గోడలా మా డాడ్ ఉన్నారని లోలోపల నాకేదో తెలియని ధైర్యం కలిగేది. కానీ ఈ రోజు డాడ్‌కేదైనా జరిగితే ఈ ప్రపంచంలో నేనొక్కణ్ణే మిగిలిపోతానని చెప్పలేనంత భయంగా ఉంది. అసలు నాకిప్పుడు లోకమంతా శూన్యంగా ఉంది. డాడ్ బతికి బయటపడితే చాలు నాకింక ఏమీ అక్కర్లేదు. ఆయన కోరుకున్నట్లు ఆయన బాధ్యతలన్నీ నేనే తీసుకుంటాను" చంద్రశేఖర్ గారి బిజినెస్‌ల పేరెత్తితేనే చిరాకు పడే అక్షయ్ తను కలలు కనే యాడ్ బిజినెస్‌నీ, లండన్‌నీ శాశ్వతంగా మర్చిపోవడానికి సిద్ధమవడం చూసి ఆశ్చర్యపోయినా అతనున్న కండిషన్‌లో అది సరైన నిర్ణయమేననుకుంది అమృత.

ఆ రోజు అమృత సెంటిమెంటలనీ, ఎమోషనలనీ ఏదేదో అనుకున్నాడు కానీ ఈ రోజు తనదాకా వస్తే తనూ అలాగే ప్రవర్తిస్తున్నానని అక్షయ్‌కి అప్పుడే తెలిసింది. అందుకే అమృత తనకి చాలా సన్నిహితురాల్లా కనిపించి, తన మనసులోని భారమంతా ఆమెతోనే పంచుకుంటున్నాడు.



**ఆపరేషన్ సక్సెస్ అయిుందన్న విషయం తెలిసేదాకా అక్కణ్ణుంచి ఎవ్వరూ కదలలేదు. అంతా పరుగుపరుగున వచ్చి, నోరు తెరచి అడగకుండానే సహాయం చేయడం చూశాక అక్షయ్‌కి లండన్ వెళ్ళిపోవాలన్న కోరిక చచ్చిపోయింది.**



"నాన్నమ్మగారు ఎలా ఉన్నారు? ఆవిడకీ విషయం తెలుసా?" అడిగింది అమృత.

"నీ వల్ల ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా నార్మల్ అవుతోంది. మళ్ళీ ఇప్పుడు నావల్ల తనేమౌతుందో అని అదొక టెన్షన్"

"మీరేం చేశారు...?" అమృత విచిత్రంగా చూసింది.

"ఇంకేం చేయాలి? ఈ రోజు నేను ఎలాగైనా లండన్ వెళ్ళితీరాలని పంతం పట్టి రాత్రి డాడ్‌తో పెద్ద గొడవ పడ్డాను. దాని ఫలితమే ఇది.." అక్షయ్ గిల్టీగా చెప్పాడు.

అమృతతో మాట్లాడుతూ అక్షయ్ నెమ్మదిగా తన బాధ నుంచి తేరుకోవడం అక్కడక్కడే తిరుగుతున్న రామరాజుగారు స్పష్టంగా గమనించి ఒకసారి వాళ్ళిద్దర్నీ పరిశీలనగా చూసి వెళ్ళిపోయారు.

చంద్రశేఖర్‌గారి ఆపరేషన్ సక్సెస్ అయిందన్న విషయం తెలిసేదాకా అక్కణ్ణుంచి ఎవ్వరూ కదలలేదు. ఆయన్ని హాస్పిటల్‌లో జేర్చినప్పట్నుంచీ తనేం పట్టించుకునే పరిస్థితిలో లేకపోయినా అంతా పరుగుపరుగున వచ్చి, నోరు తెరిచి అడగకుండానే తనకింత సహాయం చేయడం చూశాక అక్షయ్‌కి లండన్ వెళ్ళిపోవాలన్న కోరిక పూర్తిగా చచ్చిపోయింది.

ఇదే పరిస్థితి లండన్‌లో ఎదురైతే తనేమయ్యేవాడు? సహాయం కోసం అర్థించినా మహా అయితే ఒకరిద్దరు తప్ప ఎవరూ ముందుకు రారు... రాలేరు కూడా! ఉన్న బాధని దిగమింగుకుని, కష్టమంతా కడుపులో దాచుకొని తనొక్కడూ ఏం చెయ్యగలిగేవాడు?

తండ్రినెలా కాపాడుకోగలిగేవాడు?

# ప్రొడ్యూసర్లకు ఆ అవసరం లేదు



బి.ఎన్. రెడ్డి గారంటే మంచి దర్శకులేగాక, అంతకు మించిన క్రమశిక్షణతో అందరికీ అన్ని విషయాల్లో ఆదర్శంగా నిలిచిన మహా మనిషి.

ఆరోజుల్లో కూడా కొందరు వెండితెర నాయికానాయకులు సెట్‌కు ఆలస్యంగా రావడం జరుగుతుండేది.

బీఎన్‌గారి చిత్రంలో కూడా ఒక హీరోయిన్ రోజూ లేటుగా వస్తుండే దట. బీఎన్ లోలోపల ఎంత బాధ పడ్డా ఆ హీరోయిన్ 'సారీ సర్, కొంచెం లేటయింది' అనగానే ఏం మాట్లాడలేకపోయేవారు.

ఆరోజు షూటింగ్‌లో ఆమెగారు కన్నీటితో చెప్పాల్సిన బరువైన డైలాగుంది. రెడ్డిగారు చెప్పగానే మేకప్ అసిస్టెంట్ ఆమె దగ్గరకు వెళ్లి గ్లిజరిన్ సీసా ఇవ్వబోయాడు.

ఆమె దాన్ని తీసుకోకుండా 'గ్లిజరిన్ ఎందుకు సార్! దాని అవసరం లేకుండానే కన్నీళ్లు తెప్పించగలను' అన్నదట కించిత్ గర్వంగా.

స్మితం

'గ్లిజరిన్ లేకుండా కన్నీళ్లు నిర్మాతలకు వస్తాయిగానీ ఆర్టిస్టులకు ఎందుకు వస్తా యమ్మా? ఎందుకైనా మంచిది తీసుకో' అన్నారు బీఎన్.

అంతే హీరోయిన్ తలొంచుకోక తప్పలేదు.

నవ్వుతూనే చురకేయడంలో బీఎన్ మహా ఘటికుడు.

ఉన్న డబ్బుతో మంచి హాస్పిటల్‌లో ఉంచి, మంచి ట్రీట్‌మెంట్ ఇప్పించడం ఎక్కడైనా సాధ్యమే. కానీ... ఇంతమంది మనుష్యుల అండదండలూ, ఆదరాభిమా నాలూ కొనడం అసాధ్యం. ఇందుకే కాబోలు డాడ్‌కి తను లండన్‌లో సెటిల వ్వడం ఇష్టంలేనిది.

అక్షయ్ తన హృదయపూర్వకంగా, ఒక్కొక్కరికీ పేరు పేరునా కృతజ్ఞతలు చెప్తూ వాళ్ళ అభినందనలని స్వీకరిస్తూ ఆరోజు తన జీవితంలో సరికొత్త ప్రయా ణానికి శ్రీకారం చుట్టాడు.

★ ★ ★

వారం రోజుల తర్వాత యమున పండంటి పాపను ప్రసవించింది. ఆ మధురక్షణం కోసం అన్నాళ్ళూ వేచి చూస్తున్న ప్రశాంత్ కూడా పరుగుపరు గున వచ్చి వాలిపోయాడు. ఆ పసిపాప తెచ్చిన ఆనందోత్సాహాలతో ఇల్లంతా కొత్త ఉల్లాసం, కోలాహలంగా ఉంది.

"అక్కా! ఇది చూడు... అప్పుడే నన్ను గుర్తుపట్టేస్తోంది" అమృతకి రోజంతా పాపాయి చుట్టూ తిరగడం, అదేం చేసినా పెద్ద విశేషంలా అందరికీ మురిసిపోతూ చెప్పడం తప్ప ఇంకో పనిలేకుండాపో యింది.

"అది నీ కూతురేగా. అందుకే ముందు నిన్ను గుర్తుపట్టుంటుంది" యమున నవ్వింది.

తన కూతురు ముమ్మూర్తులా అమృత నోట్లోంచి ఊడిపడినట్లుందని, ఆమె పోలి కేనని చూసిన ప్రతిఒక్కరూ చెప్పడంతో యమున కూడా సరదాగా అలాగే అంటుండేది.

చంద్రశేఖర్ ఆరోగ్య పరిస్థితి కొద్దికొద్దిగా మెరుగు పడసాగింది. అక్షయ్ తన





## టెక్సాస్ జోకు

అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రం మీద జోకు లన్నీ సైజుకి సంబంధించినవి. టెక్సాస్‌లో ఏది చూసినా పెద్ద సైజులో వుంటాయని మిగతా రాష్ట్రాలవారు జోక్ చేస్తూ వుంటారు. ఇళ్ళు పెద్దవి, పచ్చిక బీళ్లు, నూనెగనులు పెద్దవి, డబ్బు మిలియన్ల మీద సంపాయిస్తుంటారు. వీటిమీదే టెక్సాస్ జోకులన్నీ బయలుదేరాయి.

అలబామాలో ఒకడు పళ్ళ అంగడికి వెళ్లి డజన్ ద్రాక్షపళ్లు ఇమ్మని అడిగాడు. అంగడి వాడు తొమ్మిది పళ్లు సంచీలో వేశాడు. 'నేను అడిగింది. డజను పళ్లు' అన్నాడు ఆసామీ.

'నేను సరిగ్గానే వేశాను. మాకు ఫ్లోరిడా నుంచి, కాలిఫోర్నియా నుంచి రావలసిన పళ్లు ఈసారింకా రాలేదు. ఇవి టెక్సాస్ పళ్లు. టెక్సాస్‌లో డజనుకు తొమ్మిదిపళ్లే సరిపోతాయి' అని అంగడివాడు జవాబిచ్చాడు.



బాధ్యత తెలుసుకున్నాడన్న ఆనందం కన్నా, ఒకసారి మృత్యు ముఖందాకా వెళ్లి తిరిగొచ్చిన ఆయనకి తన తరువాత తన కొడుకు ఒంటరివాడైపోతాడనీ, ఒక్కడూ ఇన్ని బాధ్యతలు మొయ్యాల్సివస్తుందనీ రకరకాల బెంగలూ, చింతలూ పట్టుకు పీడించసాగాయి.

హాస్పిటల్ నుంచి డిశ్చార్జయి ఇంటికి తిరిగొచ్చాక తన మనస్సులోని అందోళనం తటీనీ రామరాజుగారిని పిలిచి చెప్పుకు న్నారు.

"అక్షయ్‌కి వెంటనే పెళ్ళిచేస్తే నీకు కొంతవరకూ బెంగ తగ్గుతుంది శేఖర్" అంటూ రామరాజుగారు వెంటనే సలహా ఇచ్చారు.

"అమ్మ కూడా అదే అంటోంది రాజూ! అయితే... ఆ వచ్చే అమ్మాయికి అక్షయ్ బిజినెస్‌లలో కూడా బాధ్యత పంచుకునే సమర్థతా, తెలివితేటలూ ఉంటే మంచి దని నా అభిప్రాయం. అక్షయ్ ఒక్కడూ ఇన్ని బాధ్యతలు నెగ్గుకురావడం చాలా కష్టం. ప్రస్తుతం ఏదో మనస్సు మార్చుకు న్నట్లు కనిపిస్తున్నా వాడికీ కుదురు ఎన్నా ళ్లుంటుందో మనకి తెలియదు" ఆయనకి ప్రస్తుత పరిస్థితంతా ఇంకా అగమ్యగోచ రంగా ఉంది.

"అదీ నిజమే. అలాంటి సమర్థురాలు దొరికితే ఇక అక్షయ్ గురించి ఆందోళన పడక్కర్లేదు. ఆ అమ్మాయే అన్నీ చూసు కుంటుంది. నీ దృష్టిలో ఎవరైనా ఉన్నారా...?" రామరాజుగారు అడిగారు.

"ఇప్పటివరకూ అయితే ఎవరూ లేరు. రాజూ... అసలు అక్షయ్‌కి నేను సెలక్ట్ చేసిన అమ్మాయి నచ్చుతుందో లేదో కూడా నాకు తెలీదు. అసలు వాడి ఇష్టాలూ, అయిష్టాలూ తెలుసుకునే తీరిక నాకేది...? వాళ్ళమ్మ ఉండుంటే ఇవన్నీ చూసుకునేది" అంటూ చంద్రశేఖర్ గాఢంగా నిట్టూర్పు విడిచారు.

"మనకి తెలిసిన ఒక అమ్మాయి నా దృష్టిలో ఉంది శేఖర్. ఆ అమ్మాయికి నువ్వు కోరుకున్న అన్ని లక్షణాలూ ఉన్నాయి. అలాగే అక్షయ్ కూడా ఆ అమ్మాయిని కాదనకపోవచ్చు కానీ ఆ అమ్మాయి నీకు అంగీకారం అవుతుందో లేదో" రామరాజుగారు కొద్దిగా నసిగారు.

"ఆగిపోయావేం రాజూ... నువ్వు చెప్తే కదా నాకు తెలిసేది?"

"మన ఆకృతిలో అమృత అని ఆర్కిటెక్ట్ ఉందికదా... ఆ అమ్మాయి భలే చురుకైన పిల్ల. మంచి తెలివైనది కూడా"

"ఆ అమ్మాయేగా మా ఇల్లు రెన్నోవేషన్

వర్క్ చేసింది..?" చంద్రశేఖర్ మధ్యలో అడిగారు.

"అదే చెప్పబోతున్నాను. అక్షయ్ పట్టు బట్టి మరీ ఆ అమ్మాయిచేతే ఈ పనంతా చేయించాడు. ఆఫీసులో కూడా . రెండు మూడుసార్లు ఆ అమ్మాయిని సపోర్ట్ చేసి మాట్లాడాడు. మొన్నటికి మొన్న అమృత వాళ్ళ సిస్టర్ డెలివరీ అని పదిహేనురోజులు లీవ్ కావాలంటే నేను కుదరదని మొత్తుకున్నా వినకుండా శాంక్షన్ చేసే దాకా నన్నొదిలిపెట్టలేదు"

అలాగే మొన్న నీకు ఆపరేషన్ అవుతున్నప్పుడు కూడా ఆ అమ్మాయితోనే చాలా సేపు మాట్లాడాడు.

ఇదంతా చూస్తుంటే అక్షయ్‌కి ఆ అమ్మాయంటే స్పెషల్ ఇంట్రెస్ట్ ఉందని నాకనిపించింది కానీ నీకు మనాఫీసులో పనిచేస్తున్న అమ్మాయిని చేసుకోవడం నచ్చుతుందో లేదో అని నా అనుమానం" రామరాజుగారు తనకి తెలిసిందంతా పూస గుచ్చినట్లు చెప్పేశారు.

"అంటే... ఏదైనా ప్రేమా దోమా ఉందంటావా...?" చంద్రశేఖర్ ఠక్కున అడిగారు.

"ఛఛ...! అలాంటిదేదో ఉందని నేననుకోను. అమృత సంగతి నీకు తెలీదు. చాలా పద్ధతైన పిల్ల" రామరాజుగారు కూడా ఠకీమని చేప్పేశారు.

"రాజూ! రేపు ఆదివారం మీ ఫ్యామిలీ, అలాగే మనకి క్లోజయిన ఒక పది ఫ్యామిలీలని నేను మళ్లీ ఇంటికి తిరిగొచ్చిన సందర్భంగా ఇక్కడికి డిన్నర్‌కి పిలుస్తున్నాను కదా. నువ్వో పనిచెయ్యి. అమృతని కూడా రమ్మని పిలువు. నేను ముందు ఆ అమ్మాయిని సరిగ్గా చూడాలి" అన్నారు. చంద్రశేఖర్‌లోని పక్కా బిజినెస్‌మాన్ బాగా ఆలోచించి, ప్రతి విషయము పరిశీలించి గాని ఏ నిర్ణయం తీసుకోడని రామరాజుకి బాగా తెలుసు.




ఛైర్మన్‌గారు క్షేమంగా తిరిగొచ్చినందుకు ఆయన తన వెల్ విషర్స్ అందరికీ చిన్న పార్టీ ఇస్తున్నారని, తప్పకుండా రమ్మని రామరాజుగారు స్వయంగా తనకి ఫోను చేసి చెప్పడం అమృతకి చాలా ఆశ్చర్యాన్ని కలిగించినా, అఫీషియల్‌గా తనింకా ఆకృతి ఉద్యోగే కనుక పిలిచి ఉంటారనుకుంది.

"అమ్మా...! ఒక పార్టీకి వెళ్తున్నాను. డిన్నర్ కూడా అక్కడే. నాకోసం ఎదురుచూడకుండా మీరు భోజనం చేసేయండి" అని చెప్పి బయలుదేరి వెళ్లిపోయింది.

అమృతా వాళ్ల సిస్టర్‌కి పుట్టిన పాపని చూడటానికి వెళ్లినట్లు వాళ్లింటికోసారి వెళ్తే ఆమె కుటుంబ సభ్యులందర్నీ కూడా పరిచయం చేసుకోవచ్చు. అమృత చాలా రోజులకి ఆఫీసుకి రాకపోవడంతో దినేష్‌కి ఆమెనొకసారి చూడాలని మనసు లాగుతోంది. అందుకే పాప కోసం ఏవో బొమ్మలు, బట్టలు కొనుక్కుని ఆదివారం సాయంత్రం అమృత ఇంటికొచ్చాడు.

"నా పేరు దినేష్... అమృత కొలీగ్‌ని" అంటూ అందరికీ పరిచయం చేసుకున్నాడు. అతని పేరు వాళ్లు కూడా విని ఉండటం వల్ల మర్యాదగా ఇంట్లోకి ఆహ్వానించి కూర్చోపెట్టారు.

తమ ఇంట్లో పాప పుడితే అతను పని



గట్టుకుని చూడ్డానికి రావడం, వస్తూ వస్తూ అన్ని గిఫ్టులు పట్టుకురావడంతో ఇంట్లో అందరూ ఆశ్చర్యపోయారు.

"అమృతా లేరా...?" వచ్చి పావుగంట యినా ఆమె కనిపించకపోవడంతో దినేష్ కళ్లు ఆమె కోసం వెతుకుతున్నాయి.

"లేదు బాబూ... ఏదో పార్టీ ఉందని వెళ్లింది" అంటూ వసంత వెంటనే చెప్పేసింది.

"అలాగా...! రావడానికింకా టైం పడుతుందా?" దినేష్ కొద్దిగా నిరాశ పడ్డాడు.

"డిన్నర్‌కి వెళ్లింది కదా! కాస్త లేటవచ్చుని చెప్పే వెళ్లింది" విశ్వం చెప్పింది వినగానే... అయితే ఖచ్చితంగా ఛైర్మన్‌గారు ఇస్తున్న పార్టీకే వెళ్లి ఉంటుంది. ఆ పార్టీ కేవలం క్లోజ్ సర్కిల్‌కి మాత్రమే అని దినేష్‌కి అంతకుముందే తెలుసు. కానీ అమృత కూడా ఆ సర్కిల్లో కలిసిపోయిందని ఇప్పుడే తెలిసింది. దాంతో ఎంత అణుచుకొన్నా ఉక్రోషం వచ్చేసింది.

"అవున్లెండి... అక్షయ్ ఇంట్లో పార్టీ అంటే అమృతని పిలవకుండా ఉండరుగా. నేనా విషయం మర్చేపోయాను" దినేష్ ఏ ఉద్దేశంతో అన్నా ఆ మాట ఆ ఇంట్లో ఆటంబాంబులా పేలింది.

యమున వసంత మొహమొహాలు చూసుకున్నారు. విశ్వం దినేష్‌కేసి అయోమయంగా చూశాడు.

"అక్షయ్ ఇంట్లో పార్టీ దేనికి...?" యమునకా సమయంలో అక్షయ్ గురించి ఆరాతీయాలనే కుతూహలం తప్పితే అమృత అక్కడికి వెళ్తుందన్న అనుమానం అంతగా రాలేదు.

"అదేనండి మా ఛైర్మన్‌గారు.. అంటే అక్షయ్ వాళ్ల ఫాదర్‌కి ఈ మధ్య హార్టెటాక్ వచ్చి ఆపరేషన్ జరిగి పెద్ద గండం నుంచి బయటపడ్డారు. ఆరోజు అమృత కూడా వచ్చి బ్లడ్ ఇచ్చింది కదా. అందుకే తనని కూడా స్పెషల్‌గా పార్టీకి పిలిచివుంటారు." స్పెషల్ అన్న మాటని వత్తి వత్తి పలికిన దినేష్ ఆ ఇంట్లో అందరూ తన మాటలకెంత అవాక్కయ్యారో గమనించలేకపోయాడు.



**"అవున్లెండి... అక్షయ్ ఇంట్లో పార్టీ అంటే అమృతని పిలవకుండా ఉండరుగా. నేనా విషయం మర్చేపోయాను" దినేష్ ఏ ఉద్దేశంతో అన్నా ఆ మాట ఆ ఇంట్లో ఆటంబాంబులా పేలింది.**



"పర్వాలేదులెండి...! రేపో ఎల్లుండో లీవైపోయి అమృత ఆఫీసుకొచ్చేస్తుంది కదా... అప్పుడు కలుస్తాను. నేనొచ్చెళ్లానని చెప్పండి" అంటూ దినేష్ పైకిలేచాడు.

"లీవా? లీవేంటి...?" యమున నిర్ఘాంతపోయింది.

"అదేంటండీ... అమృత పదిహేనురోజులు లీవ్ పెట్టింది కదా...! మీకు తెలీదా?"

తనేం మాట్లాడినా వాళ్లెందుకంత షాక్ తింటున్నారో దినేష్‌కు అర్థం కావటంలేదు.

"అమృత లీవ్ పెట్టిందా?" విశ్వం తడబడుతూ అడిగాడు.

"అవునండీ... సిస్టర్‌కి బాగాలేదని లీవ్ పెట్టింది. తన వర్కంతా నేనే హేండోవర్ చేసుకున్నాను" చావు కబురు చల్లగా చెప్పి దినేష్ జారుకున్నాడు కానీ ఆ ఇంటి వాతావరణం ఒక్కసారిగా వేడెక్కిపోయింది.



అమృత వెళ్లేసరికి అతిథులందరూ వచ్చేశారు. పార్టీ అంటే చాలామంది ఆకృతి స్టాఫ్ వస్తారనుకున్న అమృత మహా అయితే ఇరవైమంది కూడా లేని ఆ పార్టీని చూసి లోలోపలే ఆశ్చర్యపోయింది.

అక్షయ్ కూడా ఆమెనక్కడ చూసి సంభ్రమంగా వచ్చి పలకరించాడు. అమృత ఆ పార్టీకెలా వచ్చిందో అతనూ హించలేకపోయాడు.

అక్కడికి పదడుగుల దూరంలో కూర్చున్న చంద్రశేఖర్ అమృతనప్పుడే పరీక్షగా చూస్తున్నారు. తెల్లని చుడీదార్‌లో చాలా మామూలుగా కనిపిస్తున్న అమృతలోని ఒక తేజస్సు ఆయన నిశితమైన చూపులకి స్పష్టంగా తెలిసింది.

సాధారణంగా అమ్మాయిల వదనాలని చంద్రబింబంతో పోలుస్తారు. కానీ అమృత వదనం మాత్రం అప్పుడే ఉదయిస్తున్న సూర్యబింబంలా కాంతివంతంగా, శక్తివంతంగా ఉందని చంద్రశేఖర్‌గారికి అనిపించింది.

"హౌ ఆర్ యూ సర్..." అంటూ అమృత వచ్చి తనని పలకరించడంతో...

"మచ్ బెటర్...కూర్చోమ్మా" అంటూ ఆయన తనని కూర్చోమని ఆప్యాయంగా మాట్లాడుతుంటే అమృతకిదంతా చాలా వింతగా ఉంది. ఈ మధ్యలో రామరాజుగారు కూడా వచ్చి కూర్చుని, తనని చంద్రశేఖర్‌గారి ముందు ఆకాశానికెత్తేయడం చూస్తుంటే ఏమనుకోవాలో తెలియడం లేదు.

"చూస్తుంటే అమృత నీకు బాగా నచ్చిందనే నాకనిపిస్తోంది" అమృత వెళ్ళిపోయాక రామరాజుగారు ఏదో ఆలోచిస్తున్న చంద్రశేఖర్ నడిగారు.

"చూడడానికైతే అమృత నాకు బాగా నచ్చింది రాజూ... అక్షయ్‌కి మంచి ఈడూ జోడూ కూడా... అయితే వీటన్నింటికన్నా ముందు నాకు అమృతకి బిజినెస్‌కి కావాల్సిన సమర్థత, చాకచక్యం ఏమాత్రం ఉన్నాయో కూడా తెలియాలి. ఒక ఉద్యోగిగా ఆమె మంచి ప్రతిభావంతురాలే కానీ ఉద్యోగం వేరు, బిజినెస్ వేరు... అందులోనూ ఆమె భవిష్యత్తులో అక్షయ్ కుడిభుజం కావాలని నా కోరిక. అందుకే ఆమెనింకా స్టడీ చెయ్యాలనుకుంటున్నాను" తనున్నా లేకపోయినా అక్షయ్‌కి అన్ని విధాలుగా సపోర్ట్ ఇవ్వగల అమ్మాయి కావాలన్న ఆయన ఆరాటం రామరాజుగారికి బాగా అర్థమైంది.

"అయితే ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నావు...? " కుతూహలంగా అడిగారు రామరాజు.

"నేనిప్పుడప్పుడే ఇల్లు కదలలేను కనుక నాకు పర్సనల్ సెక్రటరీగా అమృత సాయం కావాలని కొన్నిరోజులు ఆమెనిక్కడకి రప్పిద్దాం. అన్నీ నచ్చితే అప్పుడు అక్షయ్‌కిచెప్పి ముహూర్తాలు పెట్టిద్దాం" చంద్రశేఖర్‌గారు తన ఆలోచన బయటపెట్టారు.




"మనమేం చెప్పినా ఎడ్డెమంటే తెడ్డెమనే జంగమొండిది... ఇంత తేలిగ్గా మన మాటెలా విందని ఆరోజు నాక్కాస్త వింతగానే అనిపించింది" అంది వసంత కోపంగా.

"దానికి మనమన్నా మన మాటన్నా లెఖ్ఖలేదు. మనమంటే పూచికపుల్లెత్తు గౌరవం లేదు. దాని గురించి మనం భయపడి బెంగపడి ఏడ్వడమే కానీ మన గురించి అది ఒక్కక్షణం కూడా ఆలోచించదు. అయినా అదెప్పుడూ చెప్తూనే ఉంటుంది కదా. అన్నింటికన్నా తనకి





కెరీరే ముఖ్యమని, అది తప్ప వేరే ఆలో చనే లేదని... అందుకే మనల్నింత దారుణంగా మోసం చేసి ఆ అక్షయ్‌గాడి చుట్టూ తిరుగుతోంది. వాళ్లకోసం తన రక్తం కూడా ధారపోస్తోంది" యమునకి ఆవేశం ఆగటం లేదు.

"చూశారుగా...! దానికి మీరిచ్చిన అలుసే ఇదంతా. అదేం చెప్పినా తందాన తానా అంటూ మీరు వెనకేసుకు రాబట్టే ఈ రోజు అదిలా తయారైంది" వసంత కోపమిక విశ్వం మీదికి తిరిగింది.

"ఇదంతా నిజమని నేనింకా నమ్మలేకపో తున్నాను వసూ...! ముందు అమృతని ఇంటికి రానీ.. నెమ్మదిగా మాట్లాడదాం" ప్రశాంత్ కూడా ఇంట్లోనే ఉండటంతో విశ్వం ఇంకా నెమ్మదిగా చెప్పాడు.

"మీరెప్పుడూ ఇంతే నాన్నా...! అదేం చేసినా మీకు తప్పుగా తోచదు. పైపెచ్చు చిన్నపిల్లని ఎప్పుడూ వెనకేసుకొస్తారు" ఆ కోపంలో యమున వాళ్ల నాన్నని కూడా వదల్లేదు.

"నువ్వుండమ్మా యమునా...! అదింటికి రానీ.. ఈ రోజు అటో ఇటో తేల్చేస్తాను" వసంతకి అమృత తన చెయ్యి దాటిపో తుందేమోనని టెన్షన్ మొదలయ్యింది.

"హాయ్... నా చిట్టితల్లి ఇంకా పడుకో లేదా...?" గుమ్మంలోనే అమృతకి పాప ఏడుపు వినిపించి డైరెక్ట్‌గా ఉయ్యాల దగ్గ రకెళ్లి పాపనెత్తుకోబోయింది.

"అది నా కూతురు. దాన్ని చూసుకోవ డానికి నేనున్నాను" అంటూ యమున విసురుగా వచ్చి తన చేతిలోని పాపను లాక్కోవడంతో అక్కకేమైందో అర్థం కాక అమృత అయోమయంగా చూసింది. కోపంతో జేపురించిన యమున ముఖాన్ని, గంభీరంగా ఉన్న అమ్మానాన్నల వదనా లని చూస్తుంటే ఏదో జరిగిందని అప్పుడే అర్థమైంది.

దినేష్ ఇంటికొచ్చెళ్ళాడని, అతను చెప్పిన విషయాలన్నీ పట్టుకుని తనేదో నేరం చేసి నట్లు, ఘోరం చేసినట్లు, అందరూ తననొక నేరస్తురాల్లా చూస్తూ ప్రశాంత్ ముందు పెద్ద పంచాయితీ పెట్టడం, తనని సంజా యిషీ అడగడం అమృత తట్టుకోలేకపో తోంది.

"నేను తప్పు చేయనప్పుడు ప్రతి చిన్న విషయానికి సంజాయిషీలివ్వడం నావల్ల కాదు. అయినా మీరిప్పుడు నేనేం చెప్పినా నమ్మరని నాకు తెలుసు" అని తన గదిలో కెళ్లి పడుకుండిపోయింది.

"చూశారా! అది మనకిచ్చే విలు వేంటో...? ఎంత పొగరుగా పోయిందో చూశారుగా... ఇక లాభం లేదండీ... దానికి వెంటనే పెళ్లిచేసి పంపేయండి... దానితో వేగే ఓపిక నాకింక లేదు" హాల్లో అమ్మ అరుపులు... దానికి అక్క విరుపులూ... తోడవడంతో ఇంకా విసుగొచ్చి అమృత తలుపు గట్టిగా వేసుకుని మరీ పడుకుంది.

అది చూసి వాళ్లకింకా అరికాలి మంట నెత్తికెక్కిపోయింది.

★ ★ ★

"గుడ్ మార్నింగ్ అమృతా" మర్నాడు ఉదయం అక్షయ్ నుంచి కాల్ వచ్చింది.

"మీ అపార్ట్‌మెంట్ కిందే ఉన్నాను. నేనొ క్కసారి మీ ఇంటికి రావచ్చా." అన్నాడు.

ఇప్పుడు ఉన్న పరిస్థితికి తోడు అక్షయ్ ఇంటిక్కూడా వచ్చాడంటే ఇంకేమైనా ఉందా అనుకుంటూ-

"అక్కడే ఉండండి నేనొస్తున్నాను" అని వెంటనే కిందికెళ్లింది. అక్షయ్ కారు రోడ్డు మీదాపి లోపల్నుంచి ఏవో పాకెట్లు బయ టికి తీస్తుంటే...

"ఇవన్నీ ఏంటి సర్...!" ఆశ్చర్యంగా అడిగింది.

"యమునకి సారీ చెప్పి వాళ్ళ పాపకి

వన్నీ ఇచ్చి, నిన్ను పట్టుకెళ్ళిపోదామని..." సరదాగా చెప్పాడు.

"పార్డెన్ మీ..." అక్షయ్ అన్నదానికి అర్థాలు వెతుకుతూ సీరియస్‌గా అడిగింది.

"అమృతా.. యమున డెలివరీ అయిపోయి తనిప్పుడు సేఫ్‌గానే ఉంది కదా... అందుకే నిన్నొక చిన్న ఫేవర్ అడుగుదామని వచ్చాను..." అంటూ నెమ్మదిగా చంద్రశేఖర్‌గారి ప్రపోజల్ చెప్పాడు.

"సారీ సర్...!" ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా అమృత నో చెప్పేసింది.

"ఇంకొకసారి ఆలోచించు అమృతా... డాడ్‌కి కూడా నీమీద చాలా మంచి ఇంప్రెషనుంది. నీకిది చాలా మంచి అవకాశం" అక్షయ్ ఆమెనెలాగైనా ఒప్పించాలని చూస్తున్నాడు.

తల అడ్డంగా ఊపి "మీకు లేటవుతున్నట్లుంది సర్!" తననింక వెళ్ళమని అమృత ఇన్‌డైరెక్ట్‌గా చెప్పడంతో అక్షయ్ కూడా బాగానే హర్ట్ అయి వెంటనే వెళ్లిపోయాడు.

'ఛ...! ఈ అమ్మాయి జోలికి మళ్ళీ వెళ్ళకూడదు...' చాలా గట్టిగా నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

అమృత మెల్లగా మెట్లెక్కి పైకి నడుస్తోంది కానీ ఉన్నట్టుండి చంద్రశేఖర్‌గారు తనమీద ఇంత ఇంట్రెస్ట్ చూపించడం వెనక ఉన్న ఆంతర్యమేమిటా అని ఆలోచిస్తూ ఇంట్లోకి నడిచింది.

"ఛీ...! కొంచెం కూడా చీమూ, నెత్తురూ లేదు..." యమున ఈసడింపు విని తలెత్తింది.

అమ్మా, నాన్నా, అక్కా, బావా... అంతా ఎదురుగానే ఉన్నారు.

"అమ్మ నిన్ను ఇంట్లోంచి కాలు బయట పెట్టొద్దందని ఏకంగా వాణ్ణి ఇంటికే రప్పించావన్న మాట..." యమున వ్యంగ్యంగా దెప్పిపొడిచింది.

"దానికెంత పొగరో చూడండి. మనమెన్నన్నా ఒక్క మాటకైనా సమాధానం చెప్పాలన్న జ్ఞానం కూడా లేదు. ఆ చూపు చూడండి... ఇంత జరిగినా మనకేసి ఎంత ధైర్యంగా చూస్తోందో" వసంత కూడా రైజవడం మొదలెట్టింది.

"అమృతా...! అసలిదంతా ఏంటి? వాడిక్కడికెందుకొచ్చాడు? సమాధానం చెప్పు" విశ్వానికొక్కడా అమృత ప్రవర్తన నచ్చలేదు. అమృత నోరిప్పేలోపలే...

"మీరలా అడిగితే అది మళ్లీ మనకి చెవిలో పూలు పెడుతుంది. ఫూల్స్‌ని చేస్తుంది తప్ప నిజం చెప్పదు నాన్నా... చెంప పగలగొడితే కానీ దానికి బుద్ధి రాదు" యమున ఆవేశం అంతకంతకూ పెరిగిపోతోంది.

"యమునా...! అసలే పచ్చి బాలింతరాలివి... అలా ఆవేశపడకమ్మా..." అంటూ వసంత వారించబోయినా ఆమె వినిపించుకోలేదు.

"అది ముందునుంచీ పెద్ద ప్లాన్‌లోనే ఉందమ్మా... అందుకే ముందు ఆ అక్షయ్ ఇంట్లో పాగా వేసింది. అదయ్యాక ఎలాగోలా వాణ్ణి బుట్టలో వేసేసుకుంది. ఆ తర్వాత వాళ్ళ నాన్ననీ కాకా పట్టడం మొదలెట్టింది. ఆఖరికి రక్తదానం కూడా చేసి మరీ ఆయన్నీ తనవైపుకి తిప్పుకుంది. అందుకే అంత మంచి అమెరికా సంబంధాన్ని ఏవేవో వంకలన్నీ పెట్టి తిరగ్గొట్టింది. దానికి డబ్బుతో తప్ప ఇంక దేనితోనూ పనిలేదు. నీతి, నియమం, మంచీ, చెడూ ఏమీలేవు కాబట్టే నన్నంత దారుణంగా రాగింగ్ చేసి, నా చదువూ కెరీర్ అన్నీ నాశనం చేసిన వాడి చుట్టూ తిరుగుతోంది... వాణ్ణి తన చుట్టూ తిప్పుకుంటోంది..."





యమున ఆగ్రహం కట్టలు తెంచుకుంది.

"అక్కా...! నువ్వొకసారి సరిగ్గా కళ్లు తెరిచి నీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూడు. అక్షయ్ వాళ్లవల్ల నీ చదువు, కెరీర్ నాశనమయ్యాయన్న భ్రమలోంచి ముందు నువ్వు బయటికి వస్తే కానీ నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలియదు" అమృతకిక సహనం చచ్చిపోయింది.

"అంటే...?" యమున కళ్లు అగ్నిగోళాల్లా మండసాగాయి.

"చూశారా నాన్నా? దాని అసలు రంగు...? దాని ఉద్దేశంలో ఇప్పుడు వాడి తప్పేం లేదట. వాణ్ణెలా వెనకేసుకొస్తోందో వింటున్నారా?" అంటూ గట్టిగా అరిచింది.

అప్పటికే వాళ్ళంతా ప్రమాన్పడిపోయి, చేష్టలుడిగి అలా చూస్తున్నారు.

"అక్షయ్ నిన్నలా రాగింగ్ చెయ్యడం చాలా పెద్ద తప్పు. అది నేనొప్పుకుంటాను. కానీ నీ చదువు నాశనమైంది అర్థం లేని నీ భయం వల్ల, నీ కెరీర్ పాడైంది నీ పిరికితనం వల్ల. దానికి మాత్రం పూర్తి బాధ్యురాలివి నువ్వే... ఇంకెవ్వరూ కాదు" అమృత చాలా దృఢంగా చెప్పడంతో యమునకెక్కడో తన అహం దెబ్బతింది.

"అవునవును... ఆఖరికి అసలు తప్పు నాది. అందరికీ ఇప్పుడు నేనే చెడ్డదాన్ని, వాడు చాలా మంచివాడైపోయాడు. అమ్మా నాన్నా మీరు కూడా వాణ్నే నెత్తికెక్కించుకోండి. నేనింక నిమిషం కూడా ఇక్కడుండను. మనం ఊరెళ్ళిపోదాం పదండీ" అంటూ బిగ్గరగా ఏడవడం మొదలెట్టింది.

"యమున పచ్చి బాలింతరాలని కూడా చూడకుండా, అదెలా క్షోభ పెడుతోందో కళ్ళారా చూసి కూడా ఏమీ మాట్లాడరేంటండీ" ఆ క్షణంలో వసంతకి మాటలు రాక విశ్వంకేసి తిరిగింది.

"అసలు తప్పంతా నాది. ఆడపిల్లని ఆడపిల్లలా పెంచకుండా అనవసరమైన స్వేచ్ఛ ఇచ్చినందుకు నేను లెంపలేసుకోవాలి. ఈ రోజుతో నాకు దానిమీద నమ్మకం పోయింది. నువ్వు చెప్పింది నిజమే వసంతా... దానికెంత తొందరగా వీలైతే అంత తొందరగా పెళ్లిచేసి ఈ ఇంట్లోంచి పంపించే వరకూ మనకి మనశ్శాంతి లేదు" కఠినంగా చెప్పి విసురుగా బయటికెళ్లిపోయాడు విశ్వం.

"మెళ్లో ఆ మూడు ముళ్లూ పడితే తప్ప దాని తిక్కకుదరదు" వెళ్లిపోతానని భీష్మించుకుని కూర్చున్న యమునని కాళ్లా వేళ్లా పడి బతిమాలుకుంటూ వసంత అమృతని కసిరికొడుతోంది.

అమృత మౌనంగా తన గదిలో కెళ్ళికూర్చుంది. తన గుండెకి తగిలిన ఇంత పెద్ద గాయాన్ని తట్టుకొని నిలబడాలని విశ్వప్రయత్నం చేస్తున్నా అది ఆమెకి సాధ్యం కావడం లేదు.

పుట్టి పెరిగాక తనేంటో ఇన్నేళ్లూ తెలిసిన వాళ్ళకి కూడా, ప్రతి నిమిషం రుజువులూ, ఆధారాలూ చూపిస్తే తప్ప తన మీద నమ్మకం కలగదని అప్పుడే తెలిసింది.

సరైన సాక్ష్యాలు చూపకపోతే ముద్దాయి నేరస్థుడని ముద్రవేసి బోనులో నిలబెట్టి తీర్పు చెప్పినట్లు తనకి పెళ్లిని శిక్షగా వేయటం.. చేతులూ కాళ్లూ కట్టేసి చెరసాలలో పడేసినట్లు తన మెడకోతాడు కట్టి తనని బంధించాలని అమ్మా నాన్నలే అమానుషంగా ఆలోచించడం... అమృత తట్టుకోలేకపోతోంది. హృదయమంతా పట్టుకుపోయినట్లు విపరీతమైన బాధ. అందరూ అన్న మాటలకన్నా నాన్న అన్న మాటలు

శూలాల్లా మనసులో గుచ్చుకుని విప రీతమైన నొప్పితో విలవిలలాడిపోతోంది.

కనీసం ఏడిస్తేనన్నా కొంత మనశ్శాంతి లభిస్తుందనుకుంటే హృదయంలోని రోదన, వేదన అంతకంతకూ గాఢంగా మారి చిక్కబడిపోతోంది తప్ప కళ్ళలోంచి ఒక్క చుక్కనీరు కూడా బయటికి రాక అమృత నరకయాతన అనుభవిస్తోంది.

★ ★ ★

"వచ్చే వారం నీకు పెళ్ళిచూపులు..." పదిహేనురోజుల తర్వాత వసంత అమృత గదిలో కొచ్చి చెప్పింది. ఆమెతో అందరూ మాటలు మానేశారు. మరీ తప్పనప్పుడు వసంత గోడకి చెప్పినట్లు చెప్పి వెళ్ళిపోతుంది. ఏం చెప్పి యమునని ఆపారో గానీ ప్రశాంత్ ఒక్కడే తిరిగె ళ్లాడు.

"నన్ను పంపించడానికి మీరంత శ్రమ పడక్కర్లేదు. వచ్చే వారం నేను ఆస్ట్రేలియా వెళ్లిపోతున్నాను" నిదానంగా చెప్పింది అమృత.

"ఏమిటీ..?" ఆవిడ నెత్తి మీద పెద్ద పిడుగు పడినట్లు మాన్పడిపోయింది.

"నాకు బ్రిస్‌బేన్‌లో ఉద్యోగం వచ్చింది. నిన్ననే వీసా కూడా వచ్చేసింది. వచ్చే వారమే నా ప్రయాణం" అని చెప్పి ఆకృ తిలో తనకింకా కొన్ని ఫార్మాలిటీస్ ఉండ డంతో అక్కడికి బయల్దేరింది. తను వెళ్లాక ఇంట్లో భూకంపం వస్తుందని ఆమెకి బాగా తెలుసు.

ఆకృతి నుంచి బయటకురావాలని నిర్ణ యించుకున్నప్పుడే అమృత తన రెజ్యూ మ్‌ని ఇంటర్‌నెట్‌లో పెట్టి ఉంచింది. ఆమె క్వాలిఫికేషన్స్ నచ్చి ఆస్ట్రేలియా లోని ఒక కంపెనీ ఆమెకి పదేపదే ఆఫరి వ్వచూపినా అమ్మానాన్నలని వదిలి అంత దూరం వెళ్లడం ఆమెకప్పుడు ఇష్టం లేకపో యింది. ఇప్పుడు తనంతట తనే వెళ్లిపోవా లని నిర్ణయం తీసేసుకుంది.

"అమ్మయ్య...! నెలరోజులకైనా తిరిగివ చ్చారు" ఆమెని చూడగానే దినేష్ సంతో షంగా ఎదురొచ్చాడు. అతనికేం సమా ధానం చెప్పకుండా డైరెక్ట్‌గా అక్షయ్ కాబి న్‌లోకెళ్ళిపోయింది

"అమృతా...?" ఆమెని చూడగానే అక్షయ్ మొహం చిట్లించాడు. అమృత రానందుకు చంద్రశే ఖర్, ఎందుకో తెలియకపో యినా చాలా అప్‌సెట్ అవ్వ డంతో అమృతంటే అతనికి ఒళ్లు మండిపోతోంది.



**"నేను బ్రిస్‌బేన్ వెళ్తు న్నాను" అమృత మాములుగా చెప్పినా ఆమె గొంతులోని ఉదా శీనత, అసహాయత అక్షయ్‌కి చాలా స్పష్టంగా తెలుస్తు న్నాయి. "...సడన్‌గా ఇదేమిటి?" కోపాన్ని పక్కన పెట్టి కంగా రుగా అడిగాడు.**



"నేను బ్రిస్‌బేన్ వెళ్తున్నాను" అమృత ఎంత మాములుగా చెప్పినా ఆమె గొంతులోని ఉదాశీనత, ఆమె కళ్ళల్లోని అస హాయత అక్షయ్‌కి చాలా స్పష్టంగా తెలుస్తున్నాయి.

"...సడన్‌గా ఇదేమిటి?" తన కోపాన్ని పక్కన పెట్టి కంగారుగా అడిగాడు.

"ఏమీ లేదు. అక్కడ జాబొ చ్చింది" ఆ క్షణం ఆమెలో ఏం భావాలు కనిపించాయో గానీ...

"నీతో మాట్లాడాలి...? పద" ఆఫీసులో గోడలకి చెవులుంటాయని ఆమెని బయ టకి లాక్కెళ్ళాడు.

"ఇప్పుడు చెప్పు?" ఏదో రెస్టారెంట్ ఖాళీగా ఉండడంతో కూర్చున్నారిద్దరూ.

"చెప్పడానికేముంటుంది?" అమృత బలవంతాన నవ్వబోయింది గానీ అదీ రాలేదు.

"అమృతా! నీ గురించి నాకు బాగా





## రష్యా జోకు

ఒకసారి ఒక విలేఖరి బ్రెజ్నెవ్‌ని 'మీ సరదాలు ఏమిటి?' అని అడిగాడు.

'నా గురించి ప్రజలు వేసుకొనే జోక్స్ పోగెయ్యడం నా సరదా' అన్నాడు బ్రెజ్నెవ్.

'సుమారు ఇప్పటికి ఎన్ని జోక్స్‌ని పోగే శారు?'

'ఆ జోక్స్ వేసినవాళ్లు నాలుగైదు జైళ్ళకి సరిపడా వుంటారు.'



తెలుసు. దేనికో నువ్వు బాగా హర్టయ్యా వని నాకనిపిస్తోంది. అందుకే నువ్వి లాంటి నిర్ణయం తీసుకున్నావు. యామై కరెక్ట్?" ఆమె కళ్ళలోని చెప్పరాని బాధ అక్షయ్‌కి కనిపిస్తూనే ఉంది.

"అదేం లేదు. నేనే కొన్నాళ్ళు ఇక్కడికి దూరంగా వెళ్లిపోవాలని డిసైడ్ చేసుకు న్నాను..." నెమ్మదిగా చెప్పింది.

"ఇదంతా నావల్లే కదూ...?" ఆమెని చూస్తుంటే అక్షయ్‌కెందుకో అనుమానం వస్తోంది.

ఆమె కాదన్నా వినిపించుకోలేదు. ఎలా గైతేనేం చివరికి ఎలాగోలా ఆమెచేత జరి గిందంతా చెప్పించాడు.

"ఓ మైగాడ్...! నేనిక్కడికొచ్చి నీ లైఫ్‌లో ప్రాబ్లమ్స్ క్రియేట్ చేశాను..." అంతా విన్నాక అక్షయ్ తల పట్టుకు న్నాడు.

"మీరని కాదు, మీ ప్లేస్‌లో ఎవరున్నా సరే నామీద నమ్మకం లేనివాళ్ళు నా మీద ఇవే నిందలేసేవాళ్ళు... అమ్మాయిలు ధైర్యంగా ఉండాలి. వాళ్ళ కాళ్ళమీద వాళ్లు నిలబడాలని అందరూ ఉపన్యాసాలయితే ఇస్తారు కానీ నిజ జీవితంలో ఏ అమ్మా యైనా తన సమస్యలు తనే ఎదుర్కోగల ధైర్యాన్నీ, కష్టాలకు ఎదురీదే సాహసాన్నీ కలిగి ఉంటే మళ్ళీ భరించలేరు. అదే అమ్మాయి చిన్న చిన్న ప్రాబ్లమ్స్‌కే కుమిలి పోతూ, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, భయప డుతూ ఉంటే ఆమెనే అసలైన అమ్మా యిగా గుర్తిస్తారు. ఏం జరిగినా వాళ్ళనే సమర్థిస్తారు. నా విషయంలోనూ జరిగిం దిదే.. నన్ను దూరంగా పంపిస్తేనే వాళ్ళకి మనశ్శాంతి దక్కుతుందంటే వెళ్ళిపోవడా నికి నాకేం అభ్యంతరం లేదు. కానీ దానికి సాధనం నా పెళ్ళేనంటే నేనొప్పుకోలేను. అందుకే ఉద్యోగం సంపాదించుకుని మరీ వెళ్ళిపోతున్నాను..."

అక్షయ్‌కి అమృత అంటే ఏమిటో ఆ రోజే పూర్తిగా అర్థమైంది. ఆమె బలమైన వ్యక్తిత్వం, స్పష్టమైన భావాలూ, ప్రశ్నించే స్వభావం, పోరాడే మనస్తత్వం ఇవన్నీ కళ్ళకి కట్టినట్లు కనిపిస్తుంటే అమృత అతని కళ్ళకి మరింత ఉన్నతంగా కనిపి స్తోంది.

ఆ తర్వాత వారంరోజులూ ఇంట్లో పెను తుపానులూ, కన్నీటి సంద్రాలూ, సుడిగా లులూ... కాని అమృత మాత్రం చలించ లేదు. తన నిర్ణయం మార్చుకోలేదు.

"రేపు పాప బారసాలకి వచ్చిన చుట్టా లంతా మీ అమ్మాయేదని అడిగితే ఏం చెప్పమంటావే..."

వసంత ఏడుస్తూ ఎమోషనల్ బ్లాక్‌మె



యిలింగ్ మొదలెట్టింది.

"ఇదే నేను మీ కొడుకునై ఇలాగే ఉద్యోగం వచ్చి ఫారిన్ వెళ్తే వచ్చినవాళ్ళం దరికీ ఎంత గర్వంగా చెప్పుకునేదానివో అలాగే నా గురించి కూడా చెప్పుకో... తేడా ఏముంది" అమృత సూట్‌కేస్ సర్దు కుంటూ చెప్పింది. ఆ సమాధానానికి యమునకి మళ్ళీ కోపం కట్టలు దాటిపో యింది.

"పోతానని ఎగురుకుంటూ పోతోంది కదా. దాన్ని పోనీ అమ్మా. వెళ్ళిన వారం రోజులకల్లా అది వెనక్కి రాకపోతే నన్న డుగు. ఒక ఆడపిల్ల ఒంటరిగా వేరే దేశంలో బతకడం ఎంత కష్టమో తెలిస్తే గానీ దానికి మన విలువ తెలిసిరాదు..." గయ్యిమని లేచింది.

ఎవరేం చెప్పినా అమృత తన మొండి పట్టు వదలకపోవడంతో వసంతా, విశ్వం విధిలేక ఆమె పెళ్ళి గురించి మళ్ళీ మాట్లా డబోమని ఒక మెట్టు దిగినా అమృత తొణకలేదు, బెణకలేదు.

వెళ్లేటప్పుడు మాత్రం ఆమెకీ దుఃఖం పెల్లుబికి వస్తున్నా, మనసు బిగపట్టుకుని బింకంగా ఉండిపోయింది. ఒంటరిగా బ్యాగ్‌లు మోసుకుంటూ ఏర్‌పోర్ట్‌కి వెళ్ళి పోతున్న అమృతని ఎలా ఆపాలో తెలి యక నిస్సహాయంగా చూస్తుండిపోయాడు విశ్వం.

అమృత వెళ్ళేసరికే అక్షయ్ ఆమెకోసం ఏర్‌పోర్ట్‌లో ఎదురుచూస్తున్నాడు. ఆమె కోసం ఆస్ట్రేలియాలో ఉన్న తన స్నేహి తుల అడ్రస్‌లూ, ఫోన్ నంబర్లూ పట్టు కొచ్చి, ఏ అవసరమైనా తనున్నానని మర్చి పోవద్దని మరీ మరీ చెప్పాడు.

"థాంక్యూ వెరీమచ్ అక్షయ్... వస్తాను" చెకింగ్ టైం అవుతుండడంతో అమృత లేచి అక్షయ్‌కి బై చెప్పింది.

"ఆల్ ది బెస్ట్ అమృతా..." అంటూ షేక్‌హేండిచ్చాడు.

ఆ క్షణం... అక్షయ్ ఈ ప్రపంచాన్ని మొత్తం మర్చిపోయినట్లు అమృతనలాగే చూస్తుండిపోయాడు.

నులివెచ్చగా, మృదువుగా ఉన్న అమృత హస్తాన్ని వదల్లేక వదులుతున్నప్పుడు గానీ, ఆమె తన మనస్సుకెంత దగ్గరగా వచ్చిందో అక్షయ్‌కి తెలియలేదు. అమృత బై చెప్పి వెళ్ళిపోతుంటే తన ప్రాణం కూడా ఆమెతోనే వెళ్ళిపోతున్నట్లు అతని గుండె దిగులుగా, బరువుగా మారిపోయింది.

అమృతా! ఎంత దూరం వెళ్ళిపోయినా నువ్వుండేది మాత్రం నా హృదయం లోనే...

ఆమె ఫ్లైట్ టేకాఫై ఎగిరిపోతుంటే అక్షయ్ కళ్ళు చెమరుస్తున్నాయి.




"అబ్బ! ఈరోజు చలి చంపేస్తోంది" అనుకుంటూ అమృత తన ఫ్లాట్ కీ తీసి లోపలికొచ్చి రాగానే గబగబా రూం హీటర్స్ ఆన్ చేస్తోంది.

ఇంతలో మొబైల్ రింగైంది. ఎవరో కూడా చూడలేదు. ఆమెకలవాటే... రోజూ ఆ టైంకి కాల్ చేసేది అక్షయ్ కాబట్టి వెంటనే రిసీవ్ చేసుకుంది.

"ఇంటికొచ్చేశావా...?" అక్షయ్ అడి గాడు.

"ఇప్పుడే వచ్చాను" నవ్వుతూ చెప్పింది.

"బాగా చలిగా ఉన్నట్లుంది...? కొద్దిగా

వణుకుతున్నట్లున్నావు హీటర్స్ ఆన్ చెయ్యలేదా? అమృతా జాగ్రత్తగా ఉండు... అక్కడి వెదర్ కండిషన్స్ నీకింకా కొత్త" అక్షయ్ కంగారుపడుతూ చెప్తున్నాడు.

అక్షయ్ ఫోనయ్యాక నెమ్మదిగా రిలాక్స్ అవుతూ వంట చేసుకోవడం మొదలెట్టింది. అప్పుడే నాలుగు నెలలైపోయింది తనిక్కడికొచ్చి...

మొదట్లో ఫ్లాట్‌కి రాగానే తన కోసం ఆతృతగా ఎదురు చూసే అమ్మా, నాన్నా గుర్తొచ్చి దుఃఖం ముంచుకొచ్చేది.

అమ్మ చేతి వంట గుర్తొస్తే తను వండుకునే వంట ఏ రుచీ పచీ లేని గడ్డిలా అనిపించి, అస్సలు సయించేది కాదు.

వారానికోసారి క్రమం తప్పకుండా ఇంటికి ఫోన్ చేస్తుంది. మొదట్లో వసంత అమృత గొంతు వినగానే ఏడ్చేసింది. ఎంత కాదనుకున్నా కన్న కడుపు తీపితో తల్లీ తండ్రీ తనతో పొడిపొడిగా మాట్లాడినా, యమున మాత్రం అమృతతో అస్సలు మాట్లాడదు. అమృత పేరెత్తినా ఆమెకి నచ్చదు. అమృత పోలికలు తన కూతురుకొచ్చాయని ఎవరన్నా ఆమెకి మండుకొస్తుంది. తన కూతురివన్నీ తన పోలికలేనని బల్లగుద్ది మరీ చెప్తుంది.

"మన పెంపకంలో ఏం లోపముందండీ... అదెందుకింత మొండిగా తయారైంది? ఏదో జన్మలో పెద్ద పాపం చేశాం. అందుకే ఇది మనల్నిలా సాధిస్తోంది" అనుకుని వసంత బాధ పడుతుండేది. మొదట్లో అమృత ఏ నిమిషంలోనైనా తిరిగొచ్చేస్తుందనే ఆశ ఉండేది. కానీ రోజురోజుకీ అది సన్నగిల్లుతోంది.

ఆకృతి స్టాఫ్ అంతా అమృత ఆస్ట్రేలియా వెళ్ళిందని సంతోషించినా దినేష్ మాత్రం కొన్నాళ్ళు దేవదాసులా డల్‌గా తిరిగాడు. ఆ తర్వాత వాళ్ళమ్మా నాన్నా చూసిన అమ్మాయిని పెళ్ళి చేసుకుని డాడీ కూడా అయిపోయాడు.

అమృత వెళ్ళిపోయిందని తెలిసి రామరాజుగారు మాత్రం చాలా బాధపడ్డారు. అదృష్టం తలుపు తడితే వదులుకుని వెళ్ళిపోయిందని అమృత మీద జాలిపడ్డారు.

★ ★ ★

"వీకెండ్స్ ఇలా వేస్ట్ చేసే బదులు ఏదన్నా కాలేజ్‌లో ఎమ్.ఆర్క్‌లో జాయినైతే, నా క్వాలిఫికేషన్ కూడా పెరుగుతుందని ఆలోచిస్తున్నాను" ఆ రోజు అక్షయ్ కాల్ చేసినప్పుడు చెప్పింది అమృత.

"నువ్వు తలుచుకుంటే ఏదైనా చెయ్యగలవు" వెంటనే వెన్నుతట్టి ప్రోత్సహించాడు.

"కానీ కొంచెం స్ట్రెయినవుతావేమో చూసుకో..." అని సలహా కూడా ఇచ్చి నిర్ణయం ఆమెకే వదిలేశాడు.

అమ్మా నాన్న సరిగ్గా మాట్లాడరు, అక్క అస్సలు మాట్లాడదు. ఆప్తులందరూ అపరిచితుల్లా మారిపోయిన సమయంలో... అపరిచితుడైన అక్షయ్ తనకి ఆప్తబంధువుగా మారడం అప్పుడప్పుడూ అమృతకి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటుంది.

మొదట్లో అక్షయ్‌కున్న గిల్టీఫీలింగ్ వల్ల అతను తనమీద ఇంత అభిమానం చూపిస్తున్నాడనుకుంది. తర్వాత తనొక్కర్తీ ఇంత దూరంలో ఒంటరిగా ఉందని జాలితో తనకిన్ని జాగ్రత్తలు చెప్తున్నాడనుకునేది...

ఆ తర్వాత... తర్వాత... అసలా విషయాలన్నీ ఆలోచించడం మానేసింది. అటు ఆఫీసు, ఇటు చదువు తప్ప ఇంకో విషయం ఆలోచించే సమయం ఆమెకి దొరికేది కాదు.

★ ★ ★

"శేషూ... వంటావిడతో చెప్పి రెండు మూడు రకాల పచ్చళ్ళు చేయించు...!"





అక్షయ్ భోజనం మధ్యలో ఏదో గుర్తొచ్చినట్లు చెప్పాడు.

"మళ్లీ ఎవరైనా ఆస్ట్రేలియా వెళ్తున్నారా...?" చంద్రశేఖర్ వెంటనే అడిగారు.

ఆస్ట్రేలియా ఎవరైనా వెళ్తున్నారని తెలిస్తే అమృతకక్కడ దొరకనివీ, ఆమెకిష్టమైనవీ పంపడం అక్షయ్‌కలవాటు.

"ఎస్ డాడ్... నా ఫ్రెండ్



వాళ్ల చుట్టాలెవరో వెళ్తున్నారని తెలిసింది" అని చెప్తున్న అక్షయ్‌ని చూసి నిట్టూర్చారు.

"అక్షయ్ ఎన్నాళ్లిలా....? అమృత వెళ్లి దాదాపుగా రెండేళ్లు గడిచిపోయాయి. ఆమె తిరిగొస్తుందని నాకు నమ్మకం లేదు. నీ పెళ్లి చూడాలని నాన్నమ్మా, నేనూ ఎంత తాపత్రయం పడుతున్నామో నీకు బాగా తెలుసు..." బెంగగా చెప్పారు.

"డాడ్... నాకన్నా ముందే అమృత మీ ఛాయిస్. అది మర్చిపోకండి" అక్షయ్ నవ్వేసి లేచిపోయాడు.

"కానీ.... ఆ అమ్మాయి యమున చెల్లెలని నాకప్పుడు తెలీదు కదరా..." నిస్సహాయంగా అన్నారాయన. అక్షయ్ మీద వాళ్ళకున్న ద్వేషం అంతతేలిగ్గా పోయేది కాదని చంద్రశేఖర్‌గారికి బాగా తెలుసు.

"శేషూ...! ఆ చేత్తోనే కాస్త



గోంగూరపచ్చడి కూడా చేయించు అమృతకి అదంటే బాగా ఇష్టం... అలాగే ఏమైనా రెండురకాల స్వీట్లు కూడా చేయించాలి" నాన్నమ్మగారు మాత్రం అమృతకి పంపాల్సిన సరంజామా కోసం అప్పుడే హడావిడి మొదలెట్టారు.

"అమ్మాయిగారికిష్టమని బాబు ఎలాగూ రెండుకేజీల పుల్లారెడ్డి స్వీట్లు కొనుక్కొస్తారు కదమ్మా..." శేషు నవ్వుకుంటూ చెప్పాడు.

"అదీ నిజమేలే" అంటూ ఆవిడ అమృతకింకా ఏం పంపితే బావుంటుందో ఆలోచిస్తూనే ఉన్నారు. అమృత గురించి పూర్తి వివరాలు తెలిసిన తర్వాత, ఒక వ్యక్తిగా అమృత ఆవిడకింకా బాగా నచ్చింది. అక్షయ్‌కి నచ్చిన అమ్మాయనే కాదు, ఆవిడకి అమృత అంటే ఒక ప్రత్యేకమైన అభిమానం ఏర్పడిపోయింది. ఏదైనా స్వార్థం ఉంటేనే తప్ప ఒకరికోసం మరొకరు ఏమీ చేయని ఈ రోజుల్లో అమృత తన సంతోషం కోసం ఆలోచించి తన కోసం తోట తయారుచేయడం ఆవిడ మనసుదోచింది.




"హేపీ బర్త్ డే ప్రణూ..." యమున కూతురి పుట్టినరోజని అమృత ఫోన్ చేసి పాపతో మాట్లాడసాగింది.

"ప్రణూ...! అమృత పిన్నికి థాంక్స్ చెప్పమ్మా" అంటూ ప్రశాంత్ పాపచేత మాట్లాడించి,

"బావున్నావా... అమృతా" అంటూ ఆమె వివరాలడుగుతూ..

"వావ్... అమృతా! వెల్ డన్...! కంగ్రాచ్యులేషన్స్" అంటూ.. "అత్తయ్యగారూ, మామయ్యగారూ ఇలా రండీ" అంటూ పాప బర్త్‌డే కోసం వచ్చిన వసంతనీ, విశ్వాన్నీ బిగ్గరగా పిలుస్తున్నాడు.

"ఏమయింది" అంటూ అంతా కంగారుగా పరిగెత్తుకొచ్చారు.

"అమృత ఎమ్. ఆర్క్ పూర్తయిపోయిందని తెలియగానే వాళ్ళ కంపెనీ ప్రమోషన్ ఇచ్చి మెల్‌బోర్న్‌లో పోస్టింగిచ్చిందట. ఎగ్జిక్యూటివ్ రాంక్ కదా... కంపెనీ ఫ్లాట్, కార్ అన్ని సదుపాయాలు ఇస్తుందట" ప్రశాంత్ ఎగ్జైటింగ్‌గా చెప్తున్నాడు.

"అదెళ్లి అప్పుడే రెండేళ్ళయిపోయింది... ఇప్పుడింత పెద్ద ఉద్యోగంలో జేరితే అసలొస్తుందా...? " వినగానే వసంత కళ్ళొత్తుకుంది.

"మీ అమ్మాయి అక్కడికెళ్లిన రెండేళ్ళలో ఇన్ని సాధించిందని మీరిప్పుడు గర్వపడాలండీ..." అన్నాడు ప్రశాంత్ నవ్వుతూ.

"బావుంది సంబరం... ఆవిడగారికేమన్నా పెళ్ళా? పిల్లలా? బంధాలా...? బాధ్యతనా...? అవేవీ లేకపోతే ఎవరైనా ఏమైనా సాధించగలరు" యమునకి వెంటనే ఉక్రోషమొచ్చేసింది.



విశాలమైన ఫ్లాట్... లగ్జరియస్ ఫర్నిచర్, న్యూమోడల్ మోడ్రన్ కారు... ఆ రోజే అమృత మెల్‌బోర్న్‌కి షిఫ్టయింది.

ఇల్లంతా ఒకసారి తిరిగి చూసి ఓ మూల ఒంటరిగా కూర్చుంది. ఖాళీగా, శూన్యంగా కనిపిస్తున్న ఇల్లూ, కొత్తకారూ అన్నీ ఉన్నా మనసులో ఏదో తెలియని

అసంతృప్తి, ఈ ఇంట్లో ఇప్పుడు అమ్మా వాళ్లంతా ఉండుంటే ఎంత సంద డిగా ఉండేది...? ఏదో వంకతో నాన్న కారు డ్రైవ్ చెయ్యాలని సరదాపడే తనకి ప్పుడు ఎదురుగా సొంతకారున్నా అంత సరదా లేదు... స్వయంకృషితో తనీరోజు సంపాదించుకున్న పొజిషన్‌తో వచ్చిన సౌకర్యాలు తనే అనుభవించాలి తప్పిస్తే, తన వాళ్ళెవరూ అనుభవించడం సాధ్యం కాదు. తను ఎన్నిసాధించినా తన వాళ్ళెవ రికీ ఏమీ చేయలేదు... అలాగే కూర్చుని ఆలోచిస్తోంది.

మొబైల్ రింగవడంతో ఈ లోకంలో కొచ్చింది.

"హలో అక్షయ్" అంది.

"అమృతా...! అంత డల్‌గా ఉన్నా వేంటి?" అక్షయ్ వెంటనే అడిగాడు.

"అదేం లేదే...!"

"నువ్వు లేదన్నా నాకు తెలుసు. కొత్త ఊరు కదా? లోన్లీగా ఫీలవుతున్నావు కదూ" మృదువుగా అడిగాడు.

"అక్షయ్...! అక్కడెక్కడో ఉండి కూడా నన్నెలా చదవగలవు...?" అమృత ఆశ్చ ర్యంగా అడిగింది.

"నేనెక్కడున్నా...నా మనసు మాత్రం నీ దగ్గరే ఉంటుందిలే" అక్షయ్ సరదాగా చెప్పి ఫోన్ పెట్టేసినా అమృత అతని గురించి మళ్ళీ ఆలోచించడం మొదలె ట్టింది.

అక్షయ్ అంటే ఇదివరకు ఉన్న అభి ప్రాయం వేరు. కానీ ఇప్పుడు...?

అక్షయ్ అంటే ప్రతి నిమిషం తనని ప్రోత్సహించే నాన్న గుర్తొస్తాడు.

ప్రతిక్షణం తన కోసం తాపత్రయపడే అమ్మ గుర్తొస్తుంది. అంతెందుకు...?

ఎక్కడో సుదూరంగా ఉన్నా అనుక్షణం తన వెన్నంటి ఉండే తోడులా, నీడలా అని పించే అక్షయ్ తనకేమౌతాడు...?

ఏమౌతాడో...? అప్పుడెప్పుడో ప్రేమ గురించి అక్కకిచ్చిన నిర్వచనం గుర్తొం చ్చింది.

దానితో పాటే... అక్క కూడా వెంటనే గుర్తొచ్చేసింది.




మెల్‌బోర్న్‌లో ఉద్యోగబాధ్యతలు రెండింతలైపోయాయి. దేశవిదేశాలు తిర గడం...కొత్త కొత్త ప్రాజెక్టులు కట్టడం... ఆ ఏడాది ఎలా గడిచిపోయిందో తెలియ కుండానే గడిచిపోయింది.

ఆలోచనల్లోంచి తేరుకునేసరికి అర్ధరాత్రి గడిచిపోయింది. అమిత్‌సింగ్‌గారిని చూశాక ఒక్కసారెళ్లి అమ్మా నాన్నలని చూసిరావాలని మనస్సు ఉవ్విళ్ళూరసా గింది. అయితే ప్రస్తుతం యమున తన సెకండ్ డెలివరీకి అమ్మ దగ్గర కొచ్చిందని గుర్తొచ్చి కొంచెం సంకోచించింది.

ఆ మీమాంసతోనే తెల్లవారబోతుండగా, ఏదిఏమైనా సరే తను వెళ్లకతప్పని బాధ్యత ఒకటి తనమీద ఉందని అప్పుడే గుర్తొచ్చి హుషారుగా లేచింది.

ఇండియా వెళ్లడానికింకా పదిరోజులే సమయం ఉండడంతో అందరికోసం షాపింగ్ చెయ్యడం, అవన్నీ ప్యాకింగ్ చేసుకోవడం చాలా చాలా ఏర్పాట్లతో ఒకటే హడావిడి పడుతోంది.

ఏర్‌పోర్ట్‌కెళ్ళేముందు అక్షయ్‌కి ఫోన్





## దక్షిణ అమెరికన్ జోకు

ఒక ఇంగ్లీషు జర్నలిస్టు దక్షిణ అమెరికాలో పర్యటిస్తూ ఒక చిన్న దేశానికి వెళ్ళాడు. అతడు వెళ్ళిన రోజునే అక్కడ తిరుగుబాటు జరిగింది. జర్నలిస్టు ఒకణ్ణి పిలిచి 'మీ దేశంలో చీటికిమాటికి తిరుగుబాట్లు జరుగుతాయేం?' అని అడిగాడు.

'ఏంలేదు, మాలో ప్రెసిడెంట్లు కావలసిన వాళ్లు ఇంకా చాలా మందున్నారు' అని సమాధానం వచ్చింది.



చేసింది.

"అక్షయ్...! నాకు తెలిసినవాళ్ళచేత ఒక ఐటమ్ పంపిస్తున్నాను. నువ్వెళ్ళి పికప్ చేసుకో" అని చెప్పి నవ్వుకుంటూ ఫ్లైటెక్కేసింది.

★ ★ ★

ఛ్ఛ..! ఈ ఫ్లైట్ అరగంట లేటు... ఇప్పటికే రాత్రి పదకొండు గంటలు దాటిపోయింది. అమృత మరీ మరీ చెప్పిందని రాక తప్పలేదు. కానీ... ఇంకా ఆఫీసులో చూసుకోవాల్సిన పనులని తలుచుకుంటూ అక్షయ్ పరధ్యానంగా నుంచున్నాడు.

"హాయ్ అక్షయ్" అమృత పిలుపు విని తలెత్తి చూసిన అక్షయ్‌కి అది కలో, నిజమో తెలియక బ్లాంక్‌గా చూస్తుండిపోయాడు.

"నిలబడే నిద్రపోతున్నావా...?" అంటూ అమృత తన ఎదురుగా వచ్చి నిలబడి నవ్వుతుంటే... ఎన్నో రోజులు తపస్సు చేస్తే దేవత కరుణించి తన ముందు ప్రత్యక్షమైనట్లు హఠాత్తుగా తన ముందు ప్రత్యక్షమైన అమృతని కళ్ళనిండా చూసుకుంటూ ఆమె అవునో కాదో అన్న సందేహంతో మళ్ళీ మళ్ళీ పరికించి చూస్తున్నాడు.

అవును...! వచ్చింది అమృతే కానీ ఆమెలో ఎంత మార్పు...

ఆత్మవిశ్వాసం కొట్టొచ్చినట్లు కనిపించే అమృతలో, ఇప్పుడు కొత్తగా తను సాధించిన విజయాలతో వచ్చిన ఆత్మస్థైర్యం, హుందాతనంతో వచ్చిన సరికొత్త గ్రేస్ ఆమె కళ్ళలో వింత కాంతిని తెచ్చింది.

అక్కడి చల్లని వాతావరణానికి కొద్దిగా ఒళ్ళుచేసి, లేత గులాబీరంగులో మెరుస్తున్న ఆ అమ్మాయి అమృత అని తెలిస్తే తప్ప గుర్తుపట్టడం కొద్దిగా కష్టమే...

"నువ్వేనా? ఇంకా నన్ను పిలుస్తున్న ఈ బ్యూటీ ఎవరో తెలియక తికమకపడ్డాను" ఆ సంభ్రమం నుంచి తేరుకున్నాక సరదాగా చెప్పి నవ్వాడు.

"ఓ... వెయిట్ పుటప్ చేశానని కనిపెట్టేశావా...? ఇది నువ్వు రెగ్యులర్‌గా పంపే పుల్లారెడ్డి స్వీట్స్ మహిమ" చిరుకోపంగా చెప్పింది అమృత.

"నో ప్రాబ్లం. ఇప్పుడే నువ్వు చాలా బావున్నావు" అక్షయ్ నిజాయితీగా చెప్పేశాడు.

"నీ కాంప్లిమెంట్‌కి చాలా థాంక్స్ కానీ ఇక వెళ్దామా...? అసలు నేనైతే చెప్పకుండా ఇంటికొచ్చి పెద్ద సర్‌ప్రైజ్ ఇద్దామని ప్లానేశాను... కానీ" అంటూ ఆగిపోయింది.

"ఐనో...! ఆస్ట్రేలియానంతా ప్యాక్ చేసుకొచ్చినట్లు ఇంత లగేజ్ తెచ్చావుకదా...!

ఏ టాక్సీవాడూ రాడని నన్ను పిలిచావు. అంతేనా...?" అక్షయ్ నవ్వుకుంటూ అడిగాడు.

"ఏగ్జాక్ట్లీ...! ఛైర్మన్ అయ్యాక బాగానే ఇంప్రూవ్ చేశావ్" అమృత ఇక ఆటపట్టించడం మొదలెట్టింది.

"ఆ మాట మా డాడ్‌చేతే అనిపించాను. ఏమనుకున్నావో..." అక్షయ్ కాలరెగరేశాడు.

"కొయ్ కొయ్! నేనొచ్చి మీ డాడ్‌నే అడిగి కనుక్కుంటాలే" అమృత ఫన్నీగా చెప్పి నవ్వడం మొదలెట్టింది. ఆ నవ్వు అక్షయ్ గుండెలో అమృతపుజల్లులు కురిపించసాగింది.

ట్రింగ్... ట్రింగ్...

అర్ధరాత్రిపూట ఆపకుండా బెల్ కొడుతున్నదెవరా అని విసుక్కుంటూ తలుపు తీసిన విశ్వం నోటమాట రాకుండా నిలబడిపోయాడు.

"ఎవరండీ...?" అంటూ వసంత కూడా వెనకాల వచ్చి ఎదురుగా కనిపించిన అమృతను చూసి కెవ్వుమంది.

"అమృతేనా వచ్చింది...?" ఉద్వేగంతో తడబడుతూ విశ్వం, ఇంకా నమ్మలేనట్లు చూస్తున్న వసంతనే తిరిగి అడిగాడు.

"నేనే నాన్నా...!" అంటూ నవ్వుతూ లోపలికొస్తున్న అమృతని చూసి అప్పుడే తేరుకుంటూ ఇద్దరూ ఒకేసారి గట్టిగా ఆమెని చుట్టేశారు.

"ఎవరమ్మా... వచ్చిందీ" ప్రణూ ఇంకా నిద్రపోలేదని యమున కూడా లేచే ఉంది.

"మన అమృత వచ్చేసిందమ్మా" అంటూ సంబరంగా చెప్తున్న అమ్మానాన్నలిద్దరి మధ్యలో ఉన్న అమృతనప్పుడే చూసింది యమున.

"అక్కా... బావున్నావా?" అమృత ఆప్యాయంగా పలకరించినా ముభావంగా తలూపి ఊరుకుందంతే.

"వావ్..? ప్రణూ... ఎంత పెద్దదైపోయింది" యమున వెనకాలనుంచి తొంగి చూస్తున్న ప్రణూని చూసి ఆశ్చర్యపోతున్న అమృతని, అప్పుడే షాక్‌నుంచి కోలుకున్న వాళ్ళంతా ఆమెని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

'అమ్మో! నా దిష్టే తగిలేట్టుంది' అనుకుని వసంత మనసులోనే మురిసిపోయింది.

★ ★ ★

"అదొచ్చింది మనల్ని చూడ్డానికేం కాదు... వాడితో తిరగడానికని తెలుస్తూనే ఉంది" యమున కోపం మళ్ళీ మొదలైపోయింది.

అమృత శాశ్వతంగా వెనక్కిరాలేదని, కేవలం వారం రోజులు సెలవు పెట్టుకొచ్చిందనీ తెలిశాక వసంతా, విశ్వం ఇద్దరి మొహాలూ వాడిపోయాయి. అది చాలక అమృత వచ్చిందగ్గర్నుంచీ ఒక్క నిమిషం కూడా ఇంటిపట్టున ఉండడంలేదు. అక్షయ్‌తో కలిసి షికార్లు కొడుతోందని అందరికి తెలిసిపోతూనే ఉంది. కానీ ఇదివరకులా ఎవరూ ఆమెనిప్పుడు నిలదీయలేకపోతున్నారు.

"ఏం చెయ్యమంటావే...? మూడేళ్ళ తర్వాత మొహం చూపించింది. ఇప్పుడే మన్నా అంటే అసలు మళ్ళీ మా మొహాలు చూస్తుందో లేదో అని భయమేస్తోంది" వసంత హీనస్వరంతో అంది.

వాళ్ళకిప్పుడు అమృత మీద అధికారం పోయినట్లుంది.

"ఆవిడగారిప్పుడు దొరసాని కదా! అడిగేవాళ్ళెవరు...? అంతా ఇష్టారాజ్యం" సణిగింది యమున.

"యమునా... ఇప్పుడు మన అమృత అచ్చంగా దొరసానిలా తయారైంది కదూ?" వసంతకి అమృతనిప్పుడు చూస్తుంటే తను తొమ్మిదినెలలూ మోసి కన్న ఆ పాప ఈ







పాపేనా అని ఆమె అమ్మ మనసు అచ్చె రువొందుతోంది.

విశ్వానిదీ అదే పరిస్థితి... తన చేతులతో ఎత్తుకు పెంచిన పాపాయి తన కన్నా ఎంతో ఎత్తెదిగిపోయిందని సంతోషించాలో లేక ఆమె తమకు అందనంత ఎత్తుకెళ్ళిపోయిందని బాధ పడాలో తెలియటం లేదు.



"నాన్నా...! నేను రేపు వెళ్ళిపోతున్నాను కదా... మనమంతా కలిసి సరదాగా... అలా బయటకెళ్ళొద్దాం. పదమ్మా" అంటూ అమ్మానీ నాన్ననీ బయల్దేరదీసింది అమృత.

"పద యమునా... మనం కూడా వెళ్దాం" ఆ రోజు ఉదయాన్నే ప్రశాంత్ కూడా ఊర్నుండి వచ్చాడు.

"నాకొంట్లో బాగాలేదు" అంటూ యమున రానంటే రానంది. చివరికి ప్రశాంత్ ఎలాగోలా నచ్చజెప్పి ఒప్పించాడు.

'ఇంతకీ మనం వెళ్ళేదెక్కడికీ...?' ఎప్పుడూ లేనిది అమృత మొదటిసారిగా చీర కట్టుకుని జ్యూయెలరీ వేసుకుని చాలా స్పెషల్‌గా తయారవడంతో యమునకేదో అనుమానంగా ఉంది.

"అమ్మా! నువ్వీ పట్టుచీర కట్టుకుని, ఈ నగలేసుకో..." అంటూ తను కొత్తగా కొని పట్టుకొచ్చిన నెక్లెస్, చీరా అమ్మ చేతిలో పెట్టి, నాన్న చేతిలో కొత్త సూట్ పెట్టి వాళ్లను బలవంతాన రెడీ చేసింది అమృత.

"ఇవన్నీ ఏమిటీ...?" వసంతా, విశ్వం ఇద్దరూ నివ్వెరబోయారు.

"బావుందండీ... ఆ మాత్రం గ్రాండ్‌గా కనిపించకపోతే ఎలా..." ప్రశాంత్ ఎందుకో సన్నసన్నగా నవ్వుతున్నాడు. అమృత కంగారుగా ప్రశాంత్‌కేసి తిరిగి, ఇప్పుడే చెప్పద్దని సైగ చేసింది. అది చూసిన యమున అనుమానమింకా బలపడింది.

హోటల్ తాజ్‌లో పూలతో అద్భుతంగా అలంకరించిన కల్యాణ మంటపాన్నిచూడగానే యమునకంతా అర్థమైపోయింది. కోపంతో ఆమె మొహం ఎర్రబడిపోయింది.

చెప్పాపెట్టకుండా ఇండియా వచ్చింది పెళ్లి చేసుకోవడానికా? పళ్లు కొరుక్కుంటూ అమృతని కాల్చేసేటట్టు చూస్తోంది.

అక్షయ్... తమని రిసీవ్ చేసుకోడానికి నవ్వుతూ ఎదురొస్తుంటే మొహం తిప్పుకుంది యమున.

తామందరికన్నా ముందే అక్షయ్ వచ్చి తమను పలకరిస్తుంటే ఎవరికీ ఏమనుకోవాలో తెలియడంలేదు. "అమృతా... నువ్వు చెప్తావా? నన్ను చెప్పమంటావా?" ప్రశాంత్ నవ్వుతూ అడిగాడు అప్పుడు...

"నాన్నా! తెలుగు తిథుల ప్రకారం ఈరోజు మీ షష్టిపూర్తి. హాపీ బర్త్‌డే నాన్నా" అమృత నవ్వుతూ చెప్తుంటే అనుకోని ఈ ఘటన వసంతా విశ్వాలని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

"షష్టి పూర్తంటే మళ్లీ పెళ్లి చేసుకోవాలి తప్పదు మామయ్యా! అత్తయ్యా మీరసలే పెళ్లికూతురు జాగ్రత్తగా నడవండి..." ప్రశాంత్ జోకులు మొదలెట్టాడు.

తమ చుట్టాలు, బంధువులు, స్నేహితులు ఒక్కొక్కరుగా వచ్చి శుభాకాంక్షలు

చెప్తుంటే వసంతా విశ్వాలింకా కలలో ఉన్నట్లే అయోమయంగా చూస్తున్నారు.

తను అనుకున్నది పూర్తిగా తారుమార య్యేసరికి యమున బాగానే ఖంగుతింది.

లేత గులాబీరంగు చీరలో గులాబీలా తిరుగుతున్న అమృతని, ఆరాధనగా చూసుకుంటూ ఆమెతో తిరుగుతూ, ఏర్పా ట్లన్నీ చూస్తున్న అక్షయ్‌నీ అమృతనీ చూస్తుంటేనే తెలిసిపోతోంది. ఆ కార్యక్ర మమంతా వాళ్లిద్దరూ కలిసి చేసిందేనని...

చుట్టాలు, బంధువులు, స్నేహితుల సమ క్షంలో వైభవంగా ఆ రోజు ఫంక్షన్ జరిగి పోయింది.

ఆఖరుగా అక్షయ్ కూడా బయల్దేరు తుంటే అతనికి వీడ్కోలు చెప్పడానికి అమృత కూడా కారుదాకా వెళ్లింది.

"అమృతా! ఈరోజు చాలా సంతోషంగా ఉన్నావు కదూ" అడిగాడు అక్షయ్.

"నాన్న మా పుట్టిన రోజులు చాలా గ్రాండ్‌గా సెలెబ్రేట్ చేసేవారు కానీ, వాళ్లె ప్పుడూ సెలెబ్రేట్ చేసుకోవడం నేను చూడలేదు. అందుకే ఈ రోజు చాలా సంతోషంగా ఉంది. నేనొచ్చిన పని పూర్త యింది" ఆమె కూడా నవ్వుతూ చెప్పింది.

"రేపేగా నీ ప్రయాణం" అక్షయ్ నెమ్మ దిగా అడిగాడు.

అవునన్నట్లు మెల్లగా తలూపింది అమృత.

"ఐ మిస్ యూ అమృతా!" అక్షయ్ బాధగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"అమృతా...! నీ కోసం ఇలాగే ఎన్నాళ్ల యినా, ఎన్నేళ్లయినా ఎదురుచూస్తూనే ఉంటాను. నువ్వు నా జీవితంలో కొచ్చే రోజుకోసం నిరీక్షిస్తూనే ఉంటాను"... అక్షయ్ కళ్ళల్లోంచి జాలువారుతున్న ప్రేమ వర్షంలో అమృత తడిసిముద్దయిపో తోంది.

"అక్షయ్... నా కోసం నువ్వూ... నీ కోసం నేనూ... జీవితాంతం వేచి చూడక తప్పదు"

ఈ రోజు అక్షయ్ మనస్సు విప్పి చెప్పినా చెప్పకపోయినా అతని మనసు తనకి తెలుసు... కానీ...

యమున గుర్తొచ్చి గాఢమైన నిట్టూర్పు అమృత మనసు లోతుల్లోంచి ఉబికివ చ్చింది.

★ ★ ★

"బావా! ప్రణూతో నాకో స్నాప్ తియ్యవా...!" అంటూ అమృత ప్రణవిని తన ఒళ్లో కూర్చోపెట్టుకొని కూర్చుంది. ఫంక్షన్ తరువాత అంతా కలిసి ఫ్యామిలీ ఫొటోస్ తీసుకుంటున్నారు.

"అమృతా...! ప్రణూకన్నీ నీ పోలికలే. ఆ ఉంగరాల జుట్టూ, చక్రాల్లాంటి కళ్లూ... నీ కూతురంటే నమ్మేయచ్చు" వచ్చిన చుట్టాలంతా వాళ్లిద్దర్నీ చూసి చెప్తున్నారు.

"కదండీ" యమున నోట్లోంచి అప్రయ త్నంగా వచ్చిన మాట విని ప్రశాంత్ ఆమె కేసి తిరిగి చూశాడు.

"అమృత పోలికలేవీ నీకు నచ్చవుగా" అదోలా నవ్వి మళ్లీ ఫొటోస్ తీసుకోసా గాడు.

ఆ మాట యమునకెక్కడో ఛెళ్లున తగి లినట్లైంది.

అవును... అమృత పోలికలేవీ తనకు నచ్చవు. తన కూతురు తన పోలికల్లోనే ఉండాలని తన కోరిక...! కానీ ఈ రోజు ప్రణూలో అమృత పోలికలు కనిపిస్తుంటే తనకెక్కడో నచ్చింది ఎందుకూ...? అసలు ప్రణూ ఎవరిలా ఉండాలని తను కోరుకుంటోంది...?

అణువణువునా ఆత్మవిశ్వాసం కలిగి ఉండే అమృతలానా...? లేక అర్థం లేని భయాలతో అణువణువునా పిరికితనం నింపుకున్న తనలానా...?

ఆశావాదంతో తను సాధించాలనుకున్న



లక్ష్యాలనందుకోవడానికి ధైర్యంగా ముందు కెళ్లిన అమృత అంతులేని సాహసంతో శిఖ రాల నధిరోహిస్తే...

అనుకున్నవి సాధించకపోవడానికి ఎవ రినో బాధ్యులని చేసి తనని తనే ఆత్మవం చన చేసుకుంటూ, నిరాశావాదాన్ని అడ్డం పెట్టుకొని తను అడుగు ముందుకేయ కుండా అక్కడే నిలిచిపోయింది.

మరిప్పుడూ తన కూతురు...? అలా ఆలోచిస్తూ ఎంతసేపుందో...?

## 17

ప్చ...! ఈ రాత్రి అసలు నిద్రపట్టే టట్టులేదు. అమృత విసుగ్గా లేచి బాల్కనీ లోకెళ్లి కూర్చుంది.

రేపీ సమయానికి సగం దూరం వెళ్లి పోతుంది. ఏడు రోజులు ఏడు క్షణాల్లా గడిచిపోయాయి... ఇక్కడికి రావాలని



కలలు కన్నంతసేపు కూడా పట్టలేదు. అప్పుడే తిరిగి వెళ్ళిపోయే టైమొచ్చేసింది... ఏదో ఆలోచిస్తూ కూర్చుంది.

"ఇక్కడ కూర్చున్నావామ్మా?" అంటూ విశ్వం కూడా ఇంకా మెలకువగానే ఉన్నట్లున్నాడు.

వచ్చి నెమ్మదిగా పక్కన కూర్చున్నాడు.

"మీరింకా నిద్రపోలేదా నాన్నా?" విశ్వానికి చాలా తొందరగా నిద్రపోవడం అలవాటు. అందుకే అడిగింది.

"నిజం చెప్పమంటావామ్మా...! ఈ మూడేళ్ళలో నేను ఏ ఒక్కరోజూ కంటి నిండా నిద్రపోలేదు. ఎందుకంటే నేనేం తప్పు చేశానో నాకు బాగా తెలుసు" అయన గొంతు గద్గదమైంది.

"అమృతా... నేను నీ మనసు గాయపరిచాననే విషయం నువ్వు మా అందరికీ దూరంగా వెళ్తున్నప్పుడుగానీ నాకు తెలియలేదమ్మా" విశ్వం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"అమృతా...! నేను నీకు నడక నేర్పాను. నువ్వు నాతో కలిసి నడుస్తుంటే ప్రోత్సహించాను. కానీ ఆ తర్వాత నువ్వు నన్నొదిలి పరుగులు పెడుతున్నావని నిన్ను నిందించాను తప్పితే, నా నడకలో వేగం మందగించిందని తెలుసుకోలేకపోయానమ్మా...

తెలిసీ తెలియని వయసులో తప్పటడుగు వేస్తావేమోనని, తప్పుడు నిర్ణయాలు తీసుకుంటావేమోనని అనుమానించాను. కానీ... నా అనుమానాలన్నీ అర్థరహితమైనవనీ నీ అడుగులెప్పుడూ సరైన దారిలోనే



పడతాయనీ, మా ఆలోచనలే పక్కదారి పట్టాయని ఆలోచించ లేకపోయాను.

ఈరోజు నువ్విదంతా చేశావనో, ఇంకేదో కారణం కోసమనో కాదు నేనీ మాట చెప్పడం...

ఈసారి నువ్వెళ్తే తిరిగి మళ్ళీ రావడానికి ఇప్పట్లో నీకు కారణమేమీ లేదు. ఆ కారణం వచ్చినప్పుడు బాహుశా నేనుండ నేమో..." తన కూతురితో మనసు విప్పి మాట్లాడడానికి మళ్ళీ అవకాశం వస్తుందో రాదో అని బెంగపడుతున్న నాన్నని చూసి అమృత కదిలిపోయింది.

"ప్లీజ్ నాన్నా...! ఇంకేం మాట్లాడొద్దు" ఇక తట్టుకోలేక ఆయన భుజంమీద వాలి పోయింది.

ఎన్నాళ్ళుగానో ఆమె గుండెల్లో గడ్డకట్టు కుపోయిన ఆనాటి బాధ కరిగి కన్నీరుగా మారి ఆమె కళ్ళలోంచి ఉబికివస్తుంటే నెమ్మదిగా మనసు తేలికపడుతోంది.

"అమృతా...!" వసంత కూడా మెల్లగా వచ్చి కూర్చుని ఆమెని దగ్గరకి తీసుకుంది.

"ఎక్కడో ఏదో దేశంలో నువ్వెలా ఉన్నావో, తిన్నావో లేదో తెలీక ఇక్కడ నేను పడే బాధ నీకు తెలియదమ్మా. చిలి పితనం, అల్లరి, వాదనలు ప్రతినిమిషం గుర్తొస్తుంటే నిన్ను చూడాలని నా మనస్సు తపించిపోయేది. నీ కోసం నా ప్రాణం కొట్టుకుపోయేది. నువ్వెళ్ళాక నాక సలు మనశ్శాంతి లేనేలేదు" అమృతని తిరి గొచ్చేయమని వసంత దీనంగా అడిగింది.

"అమ్మా... మీ కెప్పుడు నన్ను చూడాల నిపించినా నాకు చెప్పండి... వెంటనే టికెట్లు పంపిస్తాను. సరదాగా కొన్నాళ్ళు అక్కడ కూడ ఉండచ్చు" అమృత అనున యంగా చెప్పింది.

"నిన్ను చూడాలనుకునేవాళ్ళు చాలా మందున్నారు కదా...? అందరికీ టికెట్లు పంపించే బదులు నువ్వే తిరిగిరావడం మంచిది" యమున ఇన్నేళ్ళ తర్వాత మొదటిసారిగా అమృతతో మాట్లాడడం అంతా సంభ్రమంగా చూస్తున్నారు. అమృ తయితే ఇంకా విభ్రాంతిగానే చూస్తోంది.

"అమృతా...! ఈరోజు అమ్మా నాన్నల పెళ్ళి బదులు నువ్వే పెళ్ళి చేసుకున్నా నేనేం చెయ్యలేను. నేనే కాదు. ఎవరూ ఏమీ చెయ్యలేరు... ఆ చిన్న సత్యం బోధ పడ్డాక నా అపార్థాలన్నీ అర్థరహితమనిపిం చాయి.

ఇన్నాళ్ళూ నీమీద నాకున్న కోపం దానం తటదే కరిగిపోయింది. ఇప్పుడు నాకెవరి తోనూ ఏ ప్రాబ్లమూ లేదు..." యమున చాలా ఫ్రాంక్‌గా చెప్పేసింది.

"అమృతా...! మీ అక్క చెప్పింది విన్నావా...? తనకిప్పుడు ఎవరితోనూ ప్రాబ్లం లేదట..." ఎవరితోనూ అన్న మాటని నొక్కినొక్కి పలుకుతూ నవ్వుతు న్నాడు ప్రశాంత్.

"అయాం వెరీ హ్యాపీ అక్కా... నువ్వు నాతో మాట్లాడావు అంతే చాలు..." అమృత ఉద్వేగంగా యమునని హత్తుకు పోయింది.

"అమ్మా... అమ్మా..." లోపల్నుంచి ప్రణూ నిద్రలో లేచి పక్కనెవరూ కనిపిం చక పిలుస్తోంది.

"అదిగో నీ కూతురు పిలుస్తోంది వెళ్లు" యమున మళ్ళీ ఇన్నాళ్ళకి తన పాప బాధ్య తని అమృత కప్పగించింది.

"థాంక్యూ వెరీ మచ్ అక్కా..." అంటూ అమృత ప్రణూ దగ్గరకెళ్తోంది.

ఏ శిల్పీ చెక్కకుండానే తన ఆకృతిని తనే మలుచుకున్న అపురూపమైన శిల్పంలా కనిపిస్తూ, హుందాగా లోపలికి నడుస్తున్న అమృతలో... యమునకి భవి ష్యత్తులో తన ముద్దుల పాప ప్రణవి కనిపిస్తోంది.

©

# చితినుంచి జీవితంలోకి...







అమెరికాలో టెక్సాస్‌లోని ఆర్లింగ్‌టన్‌కి చెందిన 47 ఏళ్ళ బాబ్ బ్లాక్ బర్న్ ఆయుష్షు 47 ఏళ్ళకీ ముగియాల్సి వుంది. మధుమేహవ్యాధితో ఇబ్బంది పడి అతని రెండు కిడ్నీలు ఫెయిలయ్యాయి. పేంక్రియాస్ కూడా చాలా భాగం నాశనం అయింది. డయాలసిస్ వల్ల నాలుగు సార్లు హార్ట్‌అటాక్ కూడా వచ్చింది.

హాస్పటల్‌లోని ఇంటెన్సివ్ కేర్‌లో వున్న అతనితో ఓ సారి ఓ డాక్టర్ చెప్పాడు.

"మీరు ఇంటికెళ్ళి మరణించడం మంచిది. ఇక్కడ మేం మీకు చేసే చికిత్స అంటూ ఏం లేదు"

తన భార్య లిండాతో అతను తన మరణానంతర కర్మకాండ గురించి చర్చించాడు. అందుకు తగిన ఏర్పాట్లుకూడా చేసుకున్నాడు. తన శరీరాన్ని కాల్చాక వచ్చే భస్మాన్ని ఉంచడానికి ఓ పాత్రని కూడా, భార్యతో వెళ్ళి ఎంపిక చేసుకొన్నాడు.

"నేను పోయాక నాకోసం ఏడుస్తూ, నీ జీవితాన్ని వృధా చేసుకోవద్దు. నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకో" అని తన భార్యకి తరచు చెప్పేవాడు.

డాక్టర్ ఓ రోజు చెప్పాడు.

"మీకు ఓ కిడ్నీ, పేంక్రియాస్, గుండె ట్రాన్స్‌ప్లాంట్ అయితేకాని మీరు బతకడం కష్టం."

ఈ మూడింటి ట్రాన్స్‌ప్లాంట్ అప్పటికి ప్రపంచంలో కేవలం ముగ్గురికే జరిగింది. ఒకటి 1992లో అమెరికాలోని యూనివర్శిటీ ఆఫ్ విస్కాన్సిన్‌లో, ఒకటి ఫ్రాన్స్‌లో 1993లో జరిగాయి. వారిద్దరూ మరణించారు.

మూడోది 1992లో డల్లాస్‌లోని మెథడిస్ట్ మెడికల్ సెంటర్‌లో జరిగింది. ఆమె జీవించే వుంది.

నవంబర్ 1994లో బాబ్‌ని డల్లాస్‌లోని ఆ హాస్పటల్‌లో చేర్చుకున్నారు. ఆ అవయవాల డోనర్స్ కోసం అతను వేచివున్నాడు. మూడు నెలలు వేచివున్నాక 1995 ఫిబ్రవరిలో 19 ఏళ్ళ కుర్రాడు తనని తాను తుపాకీతో కాల్చుకుని ఆత్మహత్య చేసుకోవడంతో బాబ్ ఎదురుచూపులు పూర్తయ్యాయి.

అతని కిడ్నీలు, పేంక్రియాస్, గుండెలని బాబ్‌కి అమర్చే ఆపరేషన్ అదేరోజు మొదలైంది. లిండా, ఇతర కుటుంబ సభ్యులు ఆత్రంగా ఆపరేషన్ థియేటర్ బయట వేచి వున్నారు. డాక్టర్ లోన్నీ విడోన్, మరో ఆరుగురు సర్జన్స్‌తో కలసి ఏడుగంటలపాటు మేజర్ ఆపరేషన్స్ చేస్తుంటే లిండా బయట భగవంతుడ్ని ప్రార్థిస్తూ గడిపింది.

చివరికి ఓ డాక్టర్ వచ్చి చెప్పాడు.

"ఆపరేషన్ అంతా సక్రమంగా జరిగింది. మీవారి ఆరోగ్యం నిలకడగా ఉంది"

బయట వేచివున్న వారంతా ఆనందంగా ఏడుస్తూ ఒకర్నొకరు కౌగిలించుకున్నారు.

రెండు వారాలపాటు హాస్పటల్‌లో ఉన్నాక ఓ రోజు బాబ్‌కి స్పృహ వచ్చింది.

'అరే, నేను బతికే వున్నాను' అన్న ఆలోచన కలిగిందతనికి. కొత్త అవయవాలు అతనిలో బాగా పనిచేస్తున్నాయని తెలిసి అతనికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

బాబ్‌ని త్వరలోనే డిశ్చార్జ్ చేశారు. ఆ అవయవాలు దొరక్కపోతే బాబ్ కొన్ని వారాల్లో మరణించేవాడు. కొత్త పేంక్రియాస్ వల్ల అతని మధుమేహవ్యాధి కూడా తగ్గిపోయింది.

ట్యాంక్ బండ్ కథలు

# నిమజ్జనం

జనం... ఎటుచూసినా జనం! వందలు... వేలు... లక్షలు! గణపతి నిమజ్జనం సందర్భంగా జంట నగరాల ప్రజలేకాక సమీప గ్రామాల నుంచి, పట్నాల నుంచీ హుస్సేన్‌సాగర్ తీరానికి ప్రవాహంలా తరలివస్తున్నారు జనం.

జనసముద్రం మీద నుంచి 'గణేష్ మహరాజ్‌కీ జై' అన్న నినాదాలు అలలు అలలుగా తేలుతూ గాలిలో కల్సిపోతు న్నాయి. కేకలు.. అరుపులు.. కేరింతలు.. నవ్వులు.. ఎటుచూసినా కోలాహలం! పరవళ్లుతొక్కుతున్న ఉత్సాహం!!

నిర్విరామంగా పనిచేస్తూ వేలాది గణపతి విగ్రహాల్ని సాగరగర్భంలోకి చేర్చు తున్నాయి క్రేన్‌లు. అయినా ఇంకెన్నో విగ్రహాలు... రకరకాల భంగిమలలో... అలంకారాలలో... లారీల్లోనూ, ట్రక్కుల్లోనూ బారులుతీరి తమవంతుకోసం నిరీక్షిస్తున్నాయి. ఉత్సవసమితి నిర్వాహకులు ఎత్తయిన వేదికల మీద నిలబడి గణపతులకు స్వాగతం పలుకుతున్నారు. కాషాయ రంగు టోపీలు ధరించిన కార్యకర్తలు ఆ జనసముద్రంలో వేగంగా కదులుతూ, తటాక తీరానికే వింతశోభను కలిగిస్తు న్నారు. సాయంత్రం అయ్యే కొద్దీ జనస ముద్రం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపో తోంది. వచ్చేవాళ్లు వస్తున్నారు, పోయే వాళ్లు పోతున్నారు. చిరుతిండ్లు అమ్మే బండ్లు, దుకాణాలు జోరుగా వ్యాపారాలు సాగిస్తున్నాయి.

ఆ జనాన్ని చూస్తూ ఆశ్చర్యంతో నోరు తెరిచింది రాములమ్మ.

పల్లెనుంచి వచ్చిన రాములమ్మ తన జీవితంలో అంత మంది జనాన్ని ఎప్పుడూ చూడలేదు. వేలాది రూపాయ

లుపోసి చేసిన బొమ్మల్ని నీళ్లలో కలిపేయడం అంటే లక్షలాది రూపాయలు గంగపాలుచేస్తున్నట్లే గదా? అని ఆమె పేద హృదయం సన్నగా మూలిగింది. తనలాంటోళ్లు ఎన్ని జన్మలెత్తి రెక్కలు ముక్కలు చేసుకుంటే ఒక లక్ష రూపాయలు సంపాదించగలరు?

"సూడే అమ్మా... ఆ ఇనాయకుడెంత బాగుండాడో!" అంటూ యాదగిరి చెయ్యిపట్టుకొని గుంజడంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకొచ్చింది రాములమ్మ.

నాలుగేళ్లన్నా నిండని యాదగిరి సీమటపాకాయ లాంటివాడే! ఉన్నచోట ఉండే రకంకాదు. "రాయే... అమ్మా! ఇంకా ఎదరకి బోయిసూద్దాం... నాకీడనుంచుంటే ఏం కనబడ్డంలేదు" అని అక్కడికి వచ్చినప్పటి నుంచీ శతపోరు పెడ్తున్నాడు వాడు.

"వద్దయ్యా... ఎదరకెడ్తే జనం తోపిడికి నీళ్లల్లోపడిపోతాం... ఈడ్నే నుంచోని సూద్దాం"

"అయితే ఎత్తుకొని సూపించు.." ఉడుంపట్టుపట్టాడు యాదగిరి.







అందాకా ఎత్తుకొని, ఎత్తుకొని రెక్కలు పడిపోతున్న రాములమ్మకి ఏంచేయాలో తోచలేదు. ఒక పావలా పెట్టి ఐస్‌ఫ్రూట్ కొని కొడుకు చేతిలో పెట్టింది. అది తింటూ వరుసగా వస్తున్న విగ్రహాల్ని చూస్తూ నిలుచున్నాడు యాదగిరి.

ముఠామేస్త్రి రమ్మంటే కట్టుబడి పనికి తక్కిన కూలీలతో కల్సి నిన్ననే నగరానికి వచ్చింది రాములమ్మ. వినాయకుడి నిమజ్జనం బ్రహ్మాండంగా ఉంటుందంటే ఈ రోజెలాగూ పనిలేకపోవడంతో కొడుకును వెంటపెట్టుకొని అక్కడికి వచ్చిందామె. ఈ నగరమూ.. ఇక్కడి ప్రజలూ పుట్టలోంచి బయటకు వచ్చే చీమల్లా ఈ వాహనాలూ.. పెద్దపెద్ద భవనాలు చూస్తుంటే తనేదో మరో ప్రపంచంలో విహరిస్తున్నట్లుంది రాములమ్మకు.

"అమ్మా ఎదరకెళ్లి ఇనాయకుడ్ని నీళ్లలో ఎలా పడేస్తారో సూద్దామే" ఐసు ఫ్రూట్ తినడం పూర్తవగానే మళ్లీ నసమొదలెట్టాడు యాదగిరి. చెప్పీ చెప్పీ విసుగెత్తిపోయిన రాములమ్మ కోపం పట్టలేక వాడి వీపుమీద రెండంటించింది. అంతే.. ఆరున్నొక్క రాగం ప్రారంభమైంది.

ఇకలాభం లేదని ఓ రూపాయిపెట్టి మిఠాయి కొని వాడి చేతిలో పెట్టింది తల్లి. బుగ్గలమీద నీటిచారికల్ని పైట కొంగుతో తుడిచి, చిన్నగా ముద్దాడిందామె. మిఠాయితింటూ మౌనంగా వచ్చేపోయే జనాన్ని చూడసాగాడు యాదగిరి.

ఇంతలో రంగురంగుల పంజాబీ డ్రెస్సులు, జీన్స్‌ప్యాంట్లు, మిడ్డీలు ధరించిన అమ్మాయిల గుంపు నవ్వుతూ, తుళ్లుతూ రావడం రాములమ్మ కంటబడింది. లేత గులాబి రంగులోనున్న వాళ్ల శరీరాలు ముట్టుకుంటేనే మాసిపోతాయేమో అన్పిస్తున్నాయి. తలకట్టునుంచి, కాలిజోళ్లవరకూ రకరకాల ఫేషన్లతో ఒకర్ని మించి ఒకరు కళకళలాడిపోతున్నారా అమ్మాయిలు.

తనూ ఉంది. ఎందుకు? రెండే రెండు చీరలు.. అవీ అక్కడక్కడా పిగిలిపోయి అతుకులుపడి ఉన్నాయి. తనూ వాళ్లవయస్సుదే అయినా తిండీ తిప్పల్లేక ఎముకల పోగులా తయారైంది. అదీగాక తెల్లారిలేచింది మొదలు రాత్రి పడుకునేంతవరకూ గాడిదచాకిరీ! పెళ్లాం బిడ్డల్ని పోషించాల్సిన మొగోడు పెళ్లాం సంపాదన్ని కూడా తాగుడికే తగలేస్తుంటే ఏం చేయగలదు తను? మొగుడు గుర్తురాగానే "ఎద్దెమొగపోడు" అని కసిగా తిట్టుకుంది రాములమ్మ.

"గాడీ ఆరే... హట్‌జావ్...హట్‌జావ్!" అంటూ పోలీసులు లాఠీతో గదమాయించేసరికి ఊహల్లోంచి వాస్తవంలోకి వచ్చిన రాములమ్మ గుండె ఒక్కసారి ఝల్లుమంది!

'ఏడీపోరడు...?' అని మెల్లగా అనుకొని "కొడుకా యాదగిరీ!" అని పిలుస్తూ నలుదిక్కులా చూసింది. వాడెక్కడా కనబ



డలేదు. "బిడ్డా బిడ్డా..." అంటూ ఆ జనంలో పిచ్చెక్కినట్లు తిరిగిన రాములమ్మకు నిరాశే మిగిలింది. కళ్లవెంట నీళ్లు ధారాపాతంగా కారిపోతున్నాయామెకు. ఎందరెందరినో తన కొడుకు గురించి అడిగింది. అంతా పెదవి విరిచారే తప్ప తన గోడెవరూ పట్టించుకోవడంలేదు. దుఃఖం వెక్కిళ్లరూపంలో ఎగదంతోంది. "ఒకేల నీల్లగ్గిరికి పోయాడేమో..." ఆలోచన వచ్చిందే తడవు తూనీగలా జనాన్ని చీల్చుకుంటూ వెళ్లి సాగరతీరమంతా వెదికింది. ఇప్పడామెకు నీళ్లలో పడిపోతానన్న భయంగానీ, బెంగగానీ లేదు... తన కొడుకేమైపోతాడోనన్న ఆలోచనే ఆమెని నిలువెల్లా వణికించేస్తోంది.

యాదగిరి ఎక్కడా కన్పించలేదు

"పోలిసోళ్లకి చెప్పమ్మా!" సలహాయిచ్చారెవరో.

గబగబా ఓ పోలీసు దగ్గరకి వెళ్లింది. "అదుగో...ఆడ ఠానా ఉంది! ముందాడ కంప్లెంటియ్యి. తర్వాత మేం ఎదుకులాడతాం" అన్నాడా కానిస్టేబుల్ తాపీగా కారాకిళ్లీ నములుతూ.

పిచ్చిపట్టిన దాన్లా అటుపరుగెత్తిన రాములమ్మకి అతనుజెప్పిన పోలీస్‌స్టేషన్ ఎక్కడా కన్పించలేదు.

"ఎంత పని జేసినవ్‌రో కొడుకా..." శోకాలుపెడుతూ చీకట్లో కొట్టుమిట్టాడుతున్నదాన్లా ఆ జనంలో దారీ తెన్నూ తెలియక గిజగిజలాడి పోతోందామె.

**"ఎంత పని జేసినవ్‌రో కొడకా..." శోకాలుపెడుతూ చీకట్లో కొట్టుమిట్టాడుతున్నదాన్లా ఆ జనంలో దారీ తెన్నూ తెలియక గిజగిజలాడి పోతోందామె.**

"పిల్లోడ్ని తెచ్చిందానివి జాగర్త ఉండక్కర్లే..." ఎవరో పెద్దాయన విసుక్కుంటున్నాడు.

అంతలో ఒడ్డున ఉన్న జనం ఘొల్లున అరిచారు.

"ఏమైంది? ... ఏమైంది? "

"నాలుగేళ్ల గుంటడెవడో నీళ్లలో పడ్డడంట..."

ఆ మాటలు చెవుల్లో పడ్డంతోనే "బాబూ యాద్గిరీ..." అంటూ బాణంలా పరుగెత్తిన రాములమ్మకు బుడ్డోడు మునకలేస్తూ కన్పించాడు.

వెంటనే వెనకాముందూ చూస్కోకుండా చెర్లో దూకేసిందామె. అంతకుముందే అందులో పడేసిన బొమ్మతాలూకు ఇనపచువ్వేదో బలంగా ముఖానికి తగలడంతో పైప్రాణాలు పైనే పోయాయన్పించిందామెకు. అయినా బాధపడలేదు. ముఖం చిట్లి రక్తంవస్తున్నా లెక్కచేయక మునిగిపోతున్న బిడ్డని వడిసి పట్టుకొని ఒడ్డుకులాక్కొచ్చింది. కాని...

ఆ పోరడు యాదగిరి కాదు...

అప్పుడే ఎవరో తండ్రి ఆదుర్దాగా వచ్చి ఆ బిడ్డని అందుకొని హృదయానికి హత్తుకున్నాడు.

తడిసిన బట్టలు నీళ్లోడుతుంటే ఒడ్డున నిలబడి పిచ్చిచూపులు చూస్తున్న రాములమ్మ చెవులకు 'అమ్మా...' అన్న చిరపరిచితమైన పిలుపు... అమృతపుజల్లులా సోకింది.

ఒడ్డునే నిలబడి తనవంకే ఆశ్చర్యంగా చూస్తున్న యాదగిరి కంటబడ్డంతోటే ఆమె ముఖం సూర్యబింబంలా ఎర్రగా వెలిగిపోయింది.

అందుకు గుర్తు అన్పించేలా ముఖంపైన గాయం చిక్కని, ఎర్రటి నెత్తుర్ని స్రవిస్తూ- కోటి సూర్యప్రభాసముజ్వలంగా ప్రకాశిస్తోంది! గుండెలోని బాధనంతటినీ నిమజ్జనంచేసి ఒడ్డుకువస్తున్న ఆ తల్లిని చూసి పక్కకు తొలిగి దారిచ్చారు జనం.

– చంద్రప్రతాప్



# వెలుగుజాడ... గురజాడ

**తెలుగు సాహిత్యానికి కొత్త ఒరవడి పెట్టి, ఆధునిక పందిళ్లు వేసినవాడు గురజాడ అప్పారావు. 'కన్యాశుల్కం' నాటకం ఆయన కీర్తికిరీటంలో కలికితురాయి. ఓ రకంగా చెప్పాలంటే ఆ నాటకం ఆయనకు మరోపేరుగా మారిపోయింది. నవంబరు 30 గురజాడ వర్ధంతికి 'చతుర' నివాళి ఇది..**

ఏ కాలంలోనయినా, ఏ జీవనరంగంలోనయినా సరే, బహుచర్చితుల- లేదా అతి చర్చితులది ఎప్పుడూ అల్పసంఖ్యాకవర్గమే. ఇట్లాంటి చర్చనీయత కేవలం ఎవరో కొందరు వ్యక్తులకు మాత్రమే పరిమితం కానక్కరలేదు. సిద్ధాంతాలూ, గ్రంథాలు, క్రియాకలాపాలు వంటివేటికయినా విస్తరించవచ్చు. అదట్లా ఉంచి- ఈ చర్చనీయత తత్కాలానికి, అంటే ఏదో ఒక కాలపరిధికి మాత్రమే పరిమితమయి ఆగిపోనూ వచ్చు. లేదా, ఎంతో కొంత కాలవ్యవధానాలతో సుదీర్ఘకాలం సాగవచ్చు- సాగుతూనే ఉండవచ్చు. దీనికి చివరి హద్దు ఎప్పుడేర్పడుతుందనేది ఎవరూ చెప్పలేరు. అదేమయినా, చర్చ సాగుతూనే ఉంటున్నదంటే ఆ వ్యక్తి, గ్రంథం, సిద్ధాంతం మొదలయినవి సజీవంగా, ప్రాసంగికంగా ఉన్నాయనవచ్చు. ఈ నేపథ్యంలో గమనిస్తే- తెలుగు సాహిత్యరంగంలో అధునికంగా బహు-అతి చర్చితుడయిన వ్యక్తి- తొలివ్యక్తి, బహుశః గురజాడ అప్పారావుగారే అయి వుండవచ్చు.

అప్పారావుగారనగానే వెంటనే అనివార్యంగా స్ఫురించేది 'కన్యాశుల్కం' రచన-రూపకం. ఆయనవలె ఆ రచనగూడా అతిగా చర్చల పాలయింది. అయింది కాదు, అవుతూనే ఉంది. తాను చర్చనీయమవుతూ ఆయన్ని గూడా చర్చనీయుడిని చేస్తూనే ఉంది. అయితే, నిజానికి గురజాడ అంటే కేవలం కన్యాశుల్కం మాత్రమే కాదు, ఆయన కవిత్వమూ రాసారు. భాషమీద పరిశోధనా ప్రయోగాలూ చేశారు. చరిత్ర రచనలో కృషి చేశారు. శాసనాల పరిశోధనలోనూ పరిశ్రమించారు. విస్తృతంగా సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యాధ్యయనం చేశారు. వివిధ సాహిత్య సాహిత్యేతర రచనా ప్రక్రియలను లోతుగా పరిశీలించారు. ఈ విధమయిన విస్తృతి, వైవిధ్యం గల అధ్యయనం, లోకానుభవం ద్వారా బహుసామాజిక విషయాలకు సంబంధించి స్పష్టమయిన అవగాహన ఆయనకుంది. ఆయనకు సాహిత్యం-సమాజాల గుర్చి స్థిరపడిపోయిన అభిప్రాయాలున్నాయి. ఆయన ఒక విచిత్రమయిన వైరుధ్యం, వైవిధ్యం గల అనేకానేక భావనల సంపుటి అయితే, ఆ సంపుటి వివిచ్ఛమానంగా కాక అల్లిక జిగిబిగి లాంటివి. మరి ఇట్లాంటి బహుముఖీన మేధావి కేవలం కన్యాశుల్క రచనలో ముడిపడి ఉండిపోవడమే ఒక విచిత్రం. బహుశః విమర్శకులూ, పరిశోధకులు,



అభిమానులూ... కన్యాశుల్కం మీద విపరీతంగా మోజు పడటం, ఆ మోజును విపరీతంగా ప్రచారంలోకి తేవడం వల్ల ఇట్లాంటి పరిస్థితి నెలకొందనిపిస్తుంది. అద ట్లా ఉంచి-

'కన్యాశుల్కం' రచన మాత్రం వివాదాలకు అతీతంగా ఉండి పోగలిగిందా? అంటే, అట్లాంటిదేమీలేదు. (కథా) వస్తునిర్మాణం, పాత్రలు, సన్నివేశాల కల్పనలోని ఆవశ్యకత, అనావశ్యకతలు, ఔచిత్య, అనౌచిత్యాల వంటి అనేకానేక విషయాలలో విమర్శకుల నుంచి విపరీతంగా ఇబ్బందులపాలయింది. కన్యాశుల్కం గూర్చిన ప్రతి అంశమూ ఇప్పటికీ చర్చించబడుతూనే ఉంది. 'మొదటికే మోసం' అన్నట్లు గురజాడ కన్యాశుల్కం రచించలేదనీ, ఎవరో రచించిన ఆ రచన గురజాడ ఖాతాకు దఖలు పడ్డదని కొన్నాళ్లు చర్చ. గురజాడ రచించింది 'కన్యాశుల్క'మా? కన్యాశుల్కం రచించిన వ్యక్తి గురజాడనా? ఇదీ ఒక వింత చర్చ. మొదటి ప్రశ్నలో రచయితకు ప్రాధాన్యం. రెండవ ప్రశ్నలో రచనకు ప్రాధాన్యం- ఇదీ ఇందులోని కిటుకు. ఏదయితే ఏంగాని, చివరకు గురజాడ అప్పారావుగారు రచించిన రచనయే 'కన్యాశుల్కం' అని నిర్ధారితమయింది. Thank God!

సరి, అక్కడికాగలేదు. గురజాడ కూడా ఊరుకోలేదు. తన కన్యాశుల్కం రచనను ఆయన- 'కన్యాశుల్కము-హాస్యరస ప్రధానమగు నాటకము' అని రెండవ కన్యాశుల్కము ప్రకటించారు. (మొదటి కన్యాశుల్కం ఒకటి ఆయన 1897 ప్రచురించారు. దాన్ని 'A comic play in five acts' అన్నారు. ఆ తరువాత-ఒక పుష్కరకాలం తరువాత ఆ అయిదంకాల రచననే బాగా పెంచి ప్రచురించారు. అందుకని దీన్ని రెండవ కన్యాశుల్కమంటారు. కాగా, విమర్శలు వగైరాలన్ని రెండవదాన్నే ఆశ్రయించుకొని సాగినయి.) ఆ ప్రకటనతో విమర్శకుల్లో చిచ్చు రగుల్కొంది. ఆ చిచ్చు స్వరూపం -'హాస్యరస' ప్రధానమయితే అది 'నాటకం' కాదు. అది 'నాటకమయితే హాస్యరస ప్రధానం కారాదు. ఇది



ఇక్కడి చిక్కు. భారతీయ వివేచనామార్గంలో (హాస్య)రసం, నాటకం అన్నవి పరిభాషా పదాలు (Technical words). వాటి అర్థతాత్పర్యాలూ, లక్షణాలూ సునిశ్చితంగా ప్రసిద్ధిలో ఉన్నాయి. అందుకని ఆ పరిభాషా పదాలతో సుదీర్ఘమయిన చర్చలు ఏమీ తేల్చకుండానే సుదీర్ఘకాలం సాగినాయి. ఒకవిధంగా ఆలోచిస్తే అప్పారావుగారే కావాలని- ఈ అంశాన్ని నిరూపించవలసిన అవసరం ఈనాడు లేదు. ఆయనకు భారతీయాలంకార శాస్త్రంతో గాఢమయిన పరిచయం ఉండనే ఉంది(ఆయన ఉత్తరాలు, డైరీలు వగైరా వగైరా ఈ అంశాలను నిరూపిస్తాయి). రస వ్యవస్థ, రూపక వ్యవస్థ తెలిసి గూడా ఆయన ఆ పారిభాషిక పదాలను సాధారణ శబ్దార్థాలతో ఉపయోగించటం చూస్తే, ఆయన తన రచనల విమర్శకులకు తానే సరంజామా సృష్టించి పెడుతుండినారేమో ననిపిస్తుంది.



సహజంగానే గురజాడ 'వ్యవస్థ'ల విరోధా? అనిపిస్తుంది. ఏయే వ్యవస్థలకనేది అట్లా ఉంచి ప్రస్తుతానికి సాహిత్య-సామాజిక వ్యవస్థలకు విరోధి అన్పిస్తుంది. గురజాడ ఇటు జీవితంలోనూ, అటు సాహిత్యంలోనూ రకరకాల 'దోషా'లనే గుర్తించి మహా చిరాకు పడ్డారు. బాధపడ్డారు. అయితే ఆయా 'దోషా'ల (? )కు మూలాలను అన్వేషించి పరిష్కారాన్ని సంపాదించే ప్రయత్నం గానీ ఆయన చేసినట్టు కన్పించదు. దానికాయన విరోధి. ఆయనది ఆలోచనా రంగమే తప్ప క్రియా రంగం కాదు. సమాజంలో నెలకొన్న 'బాల్య వివాహ వ్యవస్థ' ఆయనకు గిట్టదు. 'కన్యాశుల్కం' రచనలో ఈ విషయం స్పష్టమే కాని, ఆయన తన కూతురికి 'బాల్య వివాహం' చేసారు. వ్యక్తికి ప్రాధాన్యం వచ్చేటప్పటికి ఇట్లాంటి వైరుధ్యాలు ఆయన్ను అభిమానించేవారిని గూడ ఇబ్బంది పెట్టినయి. నిజానికి ఆయన నిశితంగా ఆలోచించే మేధావి. కార్యక్షేత్రంలో క్రియాశీల వ్యక్తి- కందుకూరి మాదిరిగా- కాదు. కందుకూరి గురజాడకు ఒక ఆదర్శమూర్తి కావచ్చు కాని ఆయన కార్యాచరణ రీతి ఈయనకు గిట్టదు.

అదట్లా ఉంచి, ఆయన వ్యక్తిత్వాన్నీ అట్లా ఉంచి, ఆయన రచనలనే ప్రధానంగా స్వీకరిస్తే- నిజానికి ఇదే సరయిన విధానం. కాలాంతరాల్లో వ్యక్తికి ప్రాధాన్యం పోయి, రచనకే ప్రాధాన్యం వస్తుంది- ఉంటుంది. అందుకని-

ఆయన పలు రచనలు ఏయే సాహిత్య 'ప్రక్రియ'లకు చెందుతాయని భావించబడుతున్నాయో- ఆయా ప్రక్రియా ప్రమాణాలకు అవి ఒదగవు. ఒక ప్రక్రియకు ప్రమాణాలు ఏర్పడ్డాయంటే అది ఒక 'వ్యవస్థ' అయిందన్నమాట. ఆయన తన రచన 'నాటక'మన్నాడన్నా, అది 'నాటక' రచనా వ్యవస్థకు లొంగదు- ఒదుగదు. ఆయన 'కథ'లూ అంతే, కవితలూ అంతే. ఆయన రచనలన్నీ- ఒక విధంగా చెప్పితే- ప్రమాణాల్ని పక్కకు తోసేసిన రచనలు- ప్రక్రియలు. వాటికి అవే ప్రమాణాలు తప్ప మరేవీ కాదు. ఈ తీరు ఒక సంచలనం సృష్టించినా సరే, అవి'స్వతఃప్రమాణాలు'.

నిజానికి 'కన్యాశుల్కం' అప్పటిదాకా నిశ్చితంగా ఉండిన నాటక ప్రమాణాలను బద్దలు కొట్టింది. అంతవరకూ బాగానే ఉంది కాని, కొత్త ప్రమాణాలను సృష్టించిన తీరు మాత్రం కన్పించదు. (రెండవ) కన్యాశుల్కం తరువాత ఎన్నో ఉత్తమ నాటకాలూ, నాటక ప్రయోగాలూ వచ్చి ఉండవచ్చు కాని, కన్యాశుల్కం 'ప్రమాణా'లతో వచ్చిన రచన ఆ ప్రక్రియలో కన్పించదు. ఈ స్థితి కన్యాశుల్కం గొప్పతనమూ కావచ్చు దాని ప్రమాణ రాహిత్యమూ కావచ్చు.

'కన్యాశుల్కం' మనగానే స్ఫురించేది అందులోని హాస్యం. 'హాస్య రసం' కాదు. రస వ్యవస్థ గురజాడకు సరిపడినట్టు లేదు. ఆయన ఒక మిత్రుడికి రాసిన ఉత్తరంలో ఆద్యంతం నవ్వు తొణికిసలాడేట్టు ఇంత గంభీర ఇతివృత్తాన్ని నిర్వహించటం అంత తేలికయిన పనికాదు అంటారు. గంభీరమయిన ఇతివృత్తాన్ని నవ్వు తొణికిసలాడేట్టు నిర్వహించటం ఒక ప్రతిభ కావచ్చునేమోగాని, ఆ ఇతివృత్తం గాంభీర్యం ఈ 'నవ్వు'తో ఎంత తేలికపడిపోయిందో ఆయన భావించినట్టు కన్పించదు. అదేమయినా అందులోని హాస్యం అత్యంత పదునయింది. నిజానికి అది 'హాస్యం' కాదు. అచ్చమయిన హాస్యం కేవలం వినోదప్రాయం. కన్యాశుల్కంలోని హాస్యం అచ్చమయిన హాస్యం కాదు. ఒక విధంగా చెప్పితే అది మిశ్రమ హాస్యం. సామాజిక రుగ్మతల పట్ల రచయిత గాఢమయిన వేదనకు పైపూత మాత్రమే. ఈ పైపూత హాస్యంగా కన్యాశుల్కంలో కన్పించే విన్పించే రకరకాల వ్యాఖ్యలు సామాజిక బుద్ధుల మీదికి విసిరిన కొరడా విసుళ్లు. ఆయా విసుళ్లు ఆ బుద్ధులకు ఎట్లా తగిలాయా అనేది ఆయా బుద్ధుల స్థితిగతుల మీద ఆధారపడి ఉంటుంది.

ఆయా వ్యాఖ్యలకు అంతశక్తి ఎక్కడి నుంచి వచ్చింది? ఆయన సామాజిక పరిశీలనలో వాస్తవిక దృక్పథం నుంచి వచ్చింది. మౌలికంగా గురజాడలో కాల్పనికత కన్పించదు. మహా అయితే చాలా తక్కువ. బహుశః అందుకే కావచ్చు, పలువురు ఆయన్ను 'కవి'గా గుర్తించటానికి వెనుకాడినట్టూ, 'అ కవి' అనటానికి సాహసించినట్టూ అన్పిస్తుంది. కాని, ఆయన కవితాశక్తి అంతా 'పూర్ణమ్మ'లో ఉంది. 'కన్యక'లో ఉంది. మిగిలిన ఆయన 'కవిత'లన్నీ కొన్ని కొన్ని అభిప్రాయాలూ, నీతి వాక్యాలుగానే మిగిలిపోయినయి. అదంతా ఆయనలోని కాల్పనికతా రాహిత్యానికి, వాస్తవికతా శక్తికీ సూచనలుగా గుర్తించవచ్చు.

ఆయన కవిత్వం, కథలు వగైరా వగైరాల కన్నా ఆయన జీవన సర్వస్వం 'కన్యాశుల్కం'. దాని రచనా స్వరూపాన్ని గూర్చి విమర్శకులు ఎందరెందరో ఏమన్నా గూడా, అది అద్భుతమయిన సంభాషణా రూపం. అది చదువుతూ ఉంటే, ఇతివృత్తం, పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన వంటి అనేకానేకాంశాల కన్నా పాఠకులను లోభపరిచేది ఆయన సంభాషణా శిల్పం. ఆయన కన్యాశుల్కంలోని వ్యక్తులందరూ ఆనాటి సంక్లిష్ట సమాజంలోని సంక్లిష్ట జీవులు. ఆ జీవులందరూ ఏదో ఒక సామాజికకాలిక రూపాలు మాత్రమే కాదు. ఒక విధంగా చూస్తే సార్వకాలికులు. ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. అది సృష్టి లక్షణం.

వాస్తవికత, విమర్శనాత్మక రచయితలందరికీ రచనలో వస్తువు ప్రధానం. గురజాడ రచనలన్నీ వస్తు ప్రధానాలు- భావ ప్రధానాలు. గురజాడ గొప్ప వాక్చమత్కారి. కన్యాశుల్కంలోని సంభాషణలే ఆ రచన గొప్ప శక్తి. గొప్ప ఆకర్షణ.



# కొత్త గొంతులకు స్వాగతం

## తళుక్కున మెరిసే హైకూలు
## చురుక్కుమనిపించే నానీలు

మీ ఆలోచన ఏదైనా అక్షర రూపం ఇవ్వండి.
క్లుప్తంగా నాలుగైదు పంక్తులకు మించకుండా చూసుకోండి.
ఆ ఆలోచనకు వేదికగా నిలుస్తుంది చతుర

మీ కవితను పంపాల్సిన చిరునామా :
**సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,**
**సోమాజిగూడ, హైదరాబాద్–500 082**

అందుకే అందులోని అనేక వ్యాఖ్యలు సామెతలుగా, పలుకుబళ్లుగా వ్యాప్తిలోకి వచ్చినయి. బహుశః ఆయన అధ్యయనం చేసిన సమాజంలోని 'వ్యవహారా'లే ఆ సంభాషణలుగా పదునెక్కాయనిపిస్తుంది. అందుకే వాటికి అంత బలం. ఆ రచన కంత శక్తి. కన్యాశుల్కంలోని సంభాషణల్లో హాస్యం ఆంగ్ల పదాల మిశ్రమం వల్ల కలిగిందని చాలామంది అపోహ. కాని యథార్థం దానికి భిన్నంగా ఉంది. ఆంగ్ల మిశ్రమం గిరీశంలోనే తప్ప మరే పాత్రలోనూ కన్పించదు. చిత్రమేమిటంటే- కన్యాశుల్కంలో ప్రతి పాత్రా- అది చిన్నది కావచ్చు, పెద్దదీ కావచ్చు- హాస్యం సృష్టిస్తుంది. ఆ హాస్యం గూడా వాటి వాటి పరిధులకు, పరిమితులకు ఒదిగే ఉంటుంది. 'అవును, అది ఆ వ్యక్తి అనవలసిన మాటే' అనిపిస్తుంది. 'ఆ సందర్భంలో అదే సరయిన మాట', అనిపిస్తుంది. కన్యాశుల్కంలోని సంభాషణలు 'హాస్యం'గానే ఉండవచ్చు- అనిపించవచ్చు గాని, వాటినుంచే ఆయనలోని అలజడి నుంచి ఉత్పన్నమయిన, ఆందోళనకరమయిన సామాజికాభిప్రాయాలు వ్యక్తమవుతూ ఉంటాయి. అవే ఆయన్ను, కన్యాశుల్కాన్ని గురించి ఆలోచించేవారికి ప్రతి విషయంలోనూ ఊతమిస్తూ ఉన్నాయి. సామాజికంగా ఆయనలో నెలకొన్న తీవ్రమయిన అశాంతిని, చికాకును వ్యక్తం చేస్తున్నాయి. కాగా, అదునిక తెలుగు సాహిత్యగమనంలో

గురజాడ ఒక అలజడి
గురజాడ ఒక ఆందోళన
అందుకనే ఆయన సంస్మరణ.

– కోవెల సంపత్కుమారాచార్య

## గుచ్చి చంపే చేప

పసిఫిక్-హిందూ మహా సముద్రాల్లో 15 అంగుళాల పొడవుగల రంగురంగుల లయన్‌ఫిష్ ఇది. దీనికి చెరోపక్క రెండు విషపు గ్రంథులుంటాయి. అలాగే 13 విషపు ముళ్లు, 14 అందమైన రెక్కలుంటాయి. శత్రువులు ఎదురైతే ముళ్లతోగుచ్చి విషాన్ని వదులుతుంది.

దీని పోటుకు గురైన ప్రాణి కోలుకోవడం కష్టమేనట!



# ఇద్దరూ ఇద్దరే!

**నా**గేశం గొంతు ఎండుకపో తోంది. ఇది ఎండాకాలం కాబట్టి పాపం దప్పికతో గొంతు ఎండిపోతున్నదని మీరు అను కుంటే మాత్రం పప్పులో కాలేసినట్లే! ఏ కాలమైనా అతని దాహం మాత్రం అంతు లేనిది. సాయంత్రం అయ్యేటప్పటికి క్వార్టర్ బాటిల్ గొంతులో పోసుకోనిదే అతని మనసు శాంతించదు. ఆ రాత్రికి నిద్రపట్టదు.

సాయంత్రం ఆరు దాటింది. నాలుక పిడచ కట్టుకుని పోతున్నది. జేబులో చూస్తే చిల్లిగవ్వ లేదు. నెలాఖరు రోజులు. ఏంచెయ్యాలో తోచక కాలుగా లిన పిల్లిలా రోడ్డుమీద తిరుగుతున్నాడు నాగేశం. కళ్ళు, కాళ్లు బార్ వైపు లాగు తుంటే ఖాళీ జేబు మాత్రం వెక్కిరిస్తూ పగ్గాలేస్తున్నది. ఇంతలో రోడ్డుమీద నడిచివస్తున్న అప్పారావు పడ్డాడు నాగేశం దృష్టిలో. 'దొరికాడు వెధవ! రోజుకి పది గంటలు పేకాటలోనే గడుపుతూ ఉంటాడు. వీడి జేబులో ఎప్పుడూ ఎంతో కొంత డబ్బు వుంటుంది. కాని అడిగితే ఇవ్వడే- అంతా వూడగొట్టి పంపించారని ఏడుస్తూ చెబుతాడు. కాబట్టి అడిగి లాభంలేదు. ఏదో ఒక ఉపాయంతో లాగించాలి' అనుకుంటూ అప్పారావుకు ఎదురువెళ్లాడు నాగేశం.

ఎదురు వస్తున్న నాగేశాన్ని చూడగానే

## చతుర కతలు

# ఆడవారి మాటలకు అర్థాలే వేరులే!



**రా**జ్యం విసవిసా భర్త దగ్గరికి వచ్చింది. శేషగిరి ఆఫీసుకు వెళ్లేం దుకు రెడీ అవుతున్నాడు.

'ఈ గోల నేను పడలేను'

'ఏ గోల?' భార్య కేసి ఆశ్చర్యంగా చూస్తు అడిగాడు.

'ఆ ఎదురింటి డాబాపై స్టూడెంట్ కుర్రాడు బైట పంచలోకి వెళ్లడం ఆల స్యం... మిడిగుడ్లు వేసుకుని మింగే సేట్లు చూస్తున్నాడు' అన్నది.

'వాడి సంగతి చెబుతాను. నువ్వు బాధపడకు. ఈ కుర్రవెధవలకు వావీ వరసా తెలియకుండా పోతున్నది' ఆవేశంతో వెళ్లి ఎదురింటి డాబాపై గదిలో అద్దెకుంటున్న స్టూడెంట్‌కి

పోయిన ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది- అప్పారావుకు. పేకాటలో సర్వమంగళం పాడించుకొని లేచి వస్తున్నాడు అప్పారావు. మళ్లీ కూర్చుని ఆడాలంటే చేతిలో డబ్బుల్లేవు. 'పోయిన డబ్బంతా తిరిగి సంపాదించుకొని వచ్చేయాలి. ఇందుగ్గాను ఎవరు తగులుతారా, ఓ యాభై అప్పు అడుగుదాం' అనుకుంటూ వస్తున్నాడు అప్పారావు.

'ఈ నాగేశంగాడి దగ్గర పగలంతా ఏమోకాని, సాయంత్రం అయ్యేటప్పటికి మాత్రం విస్కీ నీళ్లకోసం డబ్బులు కచ్చితంగా వుంటాయి. కానీ అడిగితే చచ్చి గీపెట్టినా ఇచ్చేరకం కాదు. ఎలాగైనా ఓ యాభై లాగించేసి, పోయిన డబ్బులు సంపాదించి వీడికో క్వార్టర్ బాటిల్ కొట్టించేస్తే సరిపోతుంది' అని మనసులో అనుకున్నాడు అప్పారావు.

'హల్లో అప్పారావు! కులాసానా? చాలా రోజులకు కనిపిస్తున్నావు?' అంటూ నాగేశం చేతులు చాచి అప్పారావును వాటేసుకున్నాడు.



మరుక్షణంలోనే తన మనస్సులో ఆలోచించుకున్న ఉపాయాన్ని ఆచరణలో పెట్టాడు. నాగేశం చేతులు అప్పారావు జేబుల్లోకి వెళ్లి ఖాళీగా తిరిగి వచ్చాయి. ఐడియా ఫెయిల్ అయినందుకు ముఖం చిట్లించుకున్నాడు. కాని నాగేశానికి తెలియదు- తనకొచ్చిన ఆలోచనే తన మిత్రుడికీ వచ్చిందని, అతని చేతులు తన జేబుల్లోకి వెళ్లి వచ్చాయని!

ఇద్దరూ ముఖం చిట్లించుకుని 'వెధవ పీనుగ! జేబులో పైసా లేకుండా రోడ్డుమీద ఎందుకు తిరుగుతున్నట్లో' అని మనసులో అనుకుంటూ చెరోదారి పట్టారు.

–బద్దిగం పాండు రంగారెడ్డి

తీవ్రంగా వార్నింగ్ ఇచ్చాడు- శేషగిరి. బెదిరిపోయిన ఆ కుర్ర స్టూడెంట్ రెండు రోజుల్లోనే గది ఖాళీ చేసి వెళ్లిపోయాడు.

పదిరోజులు గడిచాయి.

అదే డాబా మీద గదిలోకి మరో స్టూడెంట్ అద్దెకు వచ్చాడు. కొద్దిరోజులు గడిచాక మాటల్లో పక్కింటి పార్వతి అడిగింది రాజ్యాన్ని-

'ఈ కుర్రాడు మంచివాడులా వున్నాడు. అసలు నీవైపు కన్నెత్తి చూడటమే లేదనుకుంటాను?'

'అదేం లేదు. ఒంటరిగా ఉన్నప్పుడు ఆత్రంగా చూస్తున్నాడు. పోయిన అతను అస్సలు చూడడు. అందుకే ఆయనతో అబద్ధం చెప్పి బెదిరించి పంపించేశాను'

'ఇతని మీద చెప్పవా?'

'భలేదానివే. ఈ వయసులో కూడా మనల్ని ఒక కుర్రాడు ఆత్రంగా చూడడంలో ఆనందం నీకు తెలీదా?' నవ్వుతూ చెప్పింది ముప్పై అయిదు సంవత్సరాల రాజ్యం.

# ఇటు వెన్నెల అటు లావా!



సున్నితంగా కన్పించే దాశరథి అక్షర వాచస్పతి. తన కవితా విస్ఫులింగాలతో నిజాం సర్కారును గజగజలాడించాడు. మరో పక్క లలితమైన సినీగీతాలు, ప్రణయ కవితారస వధూటిని ఆవిష్కరించి రసలుబ్ధుల్ని అలరించాడు. దాశరథి వర్ధంతి (నవంబరు 5) సందర్భంగా ఇలా నివాళులు అర్పిస్తోంది 'చతుర'.

'ప్రాణములొడ్డి ఘోర గహ
నాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించ నెముకల్
నుసిజేసి పొలాలు దున్ని బో
షాణములన్ నవాబునకు
స్వర్ణము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే; ముసలి
నక్కకు రాచరికంబు దక్కునే?'

అని నిరంకుశ ప్రభువుగా పేరొందిన నిజాం రాజరికాన్ని ధిక్కరించిందో కంఠం!

ఫలితం జైలు జీవితం!! అయినా మొక్కవోని ధైర్యాన్ని సంతరించుకున్నాయి, ఆ కంఠం తాలూకు చేతులు. అందుకే నిజామాబాద్ జైలు గోడలమీద బొగ్గుతో ఇలా రాశాయి.

'ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని;
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ, కోటి రతనాల వీణ'

జైలు అధికార్లనూ, పోలీసులనూ గంగ వెర్రులెత్తించాయీ అక్షరాలు. నిజాం నిరంకుశత్వంపై, భూస్వామ్య పీడనపై, వెట్టిచాకిరీ దౌర్జన్యాలపై అగ్నిధారలు కురిపించి, రుద్రవీణలు పలికించిన ఆ స్వరం, కరం. మహాంధ్రోద్యమ కవి దాశరథి కృష్ణమాచార్యది.

అప్పటి హైదరాబాద్ సంస్థానమనే జనారణ్యంలో గంధపు మొక్కలాంటి గ్రామం- గూడూరు. వరంగల్ జిల్లాలోని కుగ్రామమది. అక్కడొక పండిత కుటుంబం. వారి తాత తండ్రుల వద్ద దాదాపు అయిదువేల కుటుంబాలు విద్య నేర్చుకున్నాయి. అప్పుడా కుటుంబ పెద్ద విద్వాన్ వేంకటాచార్యులు; గొప్ప పండితుడు. ఆయన సతీమణి వెంకటమ్మ; తెలుగులో పంచ కావ్యాలూ చదివిన విదుషీమణి. వారి తొలి సంతానం దాశరథి కృష్ణమాచార్యులు. మలి సంతానం దాశరథి రంగాచార్యులు. తరువాత ముగ్గురు ఆడ పిల్లలు.

వారి వంశంలో ప్రతి తరంలోనూ ఒక్కడే మగ పిల్లాడట. అయితే ఈ దంపతులకు ఇద్దరు మగ పిల్లలు పుట్టారు. ఈ ఇద్దర్లో ఒక్కడే బతుకుతాడని తల్లిదండ్రుల విశ్వాసం. అలా బతికేదేదో పెద్దవాడే బతుకుతాడనీ; అతడ్ని బాగా చదివించి,

తహసీల్దారును చేయాలనీ నిశ్చయించుకున్నారు. చిన్నవాడు మొండికేసి బతికి బట్టకడితే, సాంప్రదాయిక విద్య నేర్పించి, గ్రామంలో వ్యవసాయ పనుల్ని అప్పగించవచ్చనీ అనుకున్నారు.

కొన్నాళ్ల తరువాత వీరి కుటుంబం ఖమ్మం దగ్గరున్న గార్ల గ్రామానికి మారాల్సి వచ్చింది. గుడిసెలో నివాసం... దానికి పూర్తిగా గోడలుల్లేవు. పక్కనే అడవి. చీకటిపడితే మృగాల భయం. చెల్లెళ్లు పసివాళ్లు.

సరిగ్గా ఇలాంటి స్థితిలో సదరు కుటుంబ యజమాని ఇంట్లో గొడవపడి భార్యనూ, పిల్లల్నీ వదిలేసి, వేరే వెళ్లిపోయి మరో పెళ్లి చేసుకున్నారు. ఆస్తిలో చిల్లిగవ్వకూడా ఇవ్వలేదు. కుటుంబ భారమంతా పెద్దకొడుకు కృష్ణమాచార్యపై పడింది. కొన్ని రోజులు ఈ భారాన్ని మోశాడు. కుటుంబానికి అండగా ఉన్నాడు. కానీ చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితులు, రాజకీయ వాతావరణం, పెల్లుబుకుతున్న రైతుల తిరుగుబాట్లు, సంస్థానాన్ని వేడెక్కిస్తున్న ప్రజాగ్రహం అతడ్ని స్థిమితంగా ఉండనివ్వలేదు. కుటుంబానికి పరిమితం కాలేకపోయాడు. ఆంధ్ర మహాసభ నడుపుతున్న పోరాటానికి పూర్తిగా అంకితమైపోయాడు.

'ఇదే మాట ఇదే మాట - పదేపదే అనేస్తాను

కదం తొక్కి పదం పాడి - ఇదే మాట అనేస్తాను

దగాకోరు బటాచోరు- రజాకారు పోషకుడవు

ఊళ్లకూళ్లు అగ్గిపెట్టి - ఇళ్లన్నీ కొల్లగొట్టి

తల్లిపిల్ల కడుపుగొట్టి - నిక్కిన దుర్మార్గమంత నీ బాధ్యత నీ బాధ్యత'

అంటూ నిజాం ప్రభుత్వంపై నిప్పులు కురిపించడం మొదలుపెట్టాడు.



'వద్దంటే గద్దె ఎక్కి - పెద్దరికం చేస్తావా?

నీకు నిలుచు హక్కులేదు - నీకింకా దిక్కులేదు

దిగిపొమ్మని జగత్తంత - నగారాలు కొడుతున్నది

దిగిపోవోయ్ తెగిపోవోయ్ - తెగిపోవోయ్ దిగిపోవోయ్'

అంటూ ధిక్కార స్వరాన్ని వినిపించాడు.

అటు బ్రిటీషాంధ్ర ప్రాంతంలో గరిమెళ్ల సత్యనారాయణ రాసిన ప్రజాగ్రహగీతం 'మాకొద్దీ తెల్లదొర తనము' ఎంతగా ప్రజలను ప్రభావితం చేసిందో, ఇటు నిజామాంధ్ర ప్రాంతంలో దాశరథి గీతాలు అంతగా ప్రకంపనలు సృష్టించాయి.

ఫలితంగా అటు ఆ జాతీయోద్యమ కవికి జైలు జీవితం తప్పనట్లే, ఇటు ఈ ప్రజోద్యమ కవికీ కారాగారం తప్పలేదు. దుర్భరమైన జైలు జీవితం. రాసుకోడానికి కలమూ, కాగితమూ లేని దుస్థితి. అప్పుడే కవికి పద్యం ఉపయోగపడింది. జైలు గోడల మధ్య అల్లుకున్న పద్యాలు, అక్కడ బొగ్గుతో రాయడంతోబాటు మనస్సులో మననం చేసుకుంటూ పదిలపరచుకు



న్నాడు. మాత్రాచ్ఛందస్సు, లయబద్ధత ఉన్నందున తన పద్యాలన్నీ తనకు గుర్తుండిపోయేవి. 'కవిత్వం గుర్తుపెట్టుకోదగిన కళారూపం' అని ఎక్కడో చదివాడు. దాని ప్రేరణతో జైల్లో అనేక పద్యాలు అల్లుకుని, ఆ తరువాత చాలా కాలానికి నెమరువేసుకుని కాగితంపై పెట్టాడు. అలా రూపొందినవే - అగ్నిధార, రుద్రవీణ.

ఉర్దూ ముషాయిరాల్లో గాలిబ్ ఆశువుగా తాను చెబుతున్న గజళ్ళలోని ఒక్కో షేర్‌కు ఒక్కో ముడి తన పైజామా నాడాకు వేసుకునేవాడట. ఆ మరునాడు ఉదయం ఒక్కొక్క ముడి విప్పుతుంటే ఒక్కొక్క షేర్‌షాహిరీ అతనికి గుర్తొచ్చేదట. వాటిని జాగ్రత్తగా రాసిపెట్టుకునేవాడట. ఇలాంటి ఉదంతాలు దాశరథిపై ప్రగాఢమైన ప్రభావాన్ని చూపాయి.

'పోరాటం నుండి కళ పుడుతుంద'ని దాశరథి విశ్వాసం. ఆయన జీవితమంతా పోరాటమే. ఎన్నో ప్రతీప శక్తులతో పోరాడాడు. ఆశావాది కావడంతో ప్రతిబంధకాలెదురైనప్పుడు ఏనాడూ నిరాశ చెందలేదు. నమ్రతతో తన దారినతాను పయనించాడు. అతని గమ్యం ప్రపంచ శాంతి. అతని ధ్యేయం ప్రజాస్వామ్య సామ్యవాదం.

'జనం మనం - మనం జనం
జనం లేక మనం లేము'

అన్న స్పష్టత ఉన్నవాడు. అందుకే...

'రానున్నది ఏది నిజం? - అది ఒకటే సోషలిజం
కలపండోయ్ భుజం భుజం - కదలండోయ్ గజం గజం'

అంటూ ఉద్యమాహ్వానం పలికాడు.

హైదరాబాద్ సంస్థానాన్ని పాలించిన ఏడో నిజాం, మీర్ ఉస్మాన్ అలీఖాన్ పాలనలో జరిగిన గృహ దహనాలు, ఆస్తుల దోపిడులు, పడతుల మానభంగాలు, ఊళ్లకు ఊళ్లనే అగ్గిపెట్టిన అమానుష కృత్యాలు, రజాకారు ముష్కరుల రాక్షసకాండ, భూస్వాముల దుర్మార్గమైన దౌర్జన్యాలు దాశరథి కృష్ణమాచార్య హృదయంలో నిప్పు కణికలు రగిలించాయి. ప్రజల సహేతుకమైన ధర్మాగ్రహానికి ప్రతిధ్వనులుగా అనేక కవితా ఖండికలకు జీవం పోశాడు.

ఖమ్మం జైలు జీవితకాలంలో దాశరథి ప్రేమాభిమానాలు పొందిన మరో మహా రచయిత వట్టికోట ఆళ్వార్ స్వామి. జైలు గోడల మీద దాశరథి బొగ్గుతో రాసే పద్యాలను ఇతను కంఠస్థం చేసేవాడు. పదే పదే చదువుతూ పదిమందికీ వినిపించేవాడు. జైలు అధికార్లు ఆ పద్యాలను గోడలమీద చెరిపేసినప్పుడల్లా, అవి మరో గోడమీద ప్రత్యక్షమయ్యేవి. వాటిని దాశరథి రాస్తున్నాడని జైలు పోలీసుల అనుమానం. నిజానికి రాస్తున్నవాడు ఆళ్వార్ అని వాళ్లు కనిపెట్టారు. ఫలితంగా అతడ్ని గుల్బర్గా జైలుకూ, దాశరథిని హైదరాబాద్‌లోని చెంచల్‌గుడా జైలుకు మార్చారు.

జైలు శిక్ష పడేనాటికి దాశరథి వయస్సు ఇరవై ఏళ్లు. నూనూగు మీసాల నూత్న యవ్వనం. ఆకాశంలోకి తలెత్తి చూస్తే, మేఘాలు అందమైన ఆడపిల్లల ఆకారాలు ధరించి, పొంగిన వక్ష స్థలాలతో ఇతడ్ని కవ్వించడానికి వస్తున్నట్లనిపించేది. తల దించి బ్యారక్ వైపు చూస్తే తళ తళా మెరుస్తున్న నగ్న ఖడ్గంతో తుపాకి చేతబూని, కవాతు చేసే భటుడు కనిపించేవాడు. వాణ్ణి నరికేసి, లేదా వానిచే నరకబడి మేఘభామిని వైపు వెళ్లాలని కలలు కనేవాడు. ఇదీ దాశరథి భావుకత.

మానుకోట తాలూకాలోని నెల్లికుదురు గ్రామంలో పోలీస్‌స్టేషన్ నుండి దాశరథి తప్పించుకుని అడవిలో పడి పరుగు లంఘించినప్పుడు, గుర్రాల మీద నలభై

మంది సైనికులు అతడ్ని వెంటాడసాగారు. క్షణం ఆగకుండా ఆయన అరణ్యంలో పరుగెత్తుతుంటే, దూరాన పది గుడిసెల చిన్నపల్లె తటస్థించింది. అక్కడ కాస్సేపు ఆగి, మంచినీళ్లడిగితే, ఆప్యాయంగా ముంతతో నీళ్లందించిన రైతుపిల్ల ఒయ్యారం, ఆమె కళ్లలోని అమాయికత ఈ కవిని మైమరిపించాయి.

జైలు కిటికీలోంచి చూస్తే, బయట మామిడికొమ్మ చిగిర్చి పూలు పూస్తే లక్ష ఉగాదులు ఒక్కసారి ఇతని హృదయంలో దూకినట్లుండేది.

'ఏ పొలమున నిరుపేదకు దొరకదో తిండి

ఆ పొలమున గల పంటను నిర్దయగా తగులబెట్టండి'

అని జాతీయ విప్లవకవి ఇక్బాల్ రాసిన పద్యపంక్తులు తలచుకున్నప్పుడల్లా దాశరథి హృదయం ఉద్రేకంతో పొంగిపోయేది. కాస్త చల్లబడ్డాక ఆలోచిస్తే, ఆ పొలాన్ని కాపలా కాసే అందమైన అమ్మాయికి ఏ అపకారం జరక్కుండా అక్కడి పంటను తగుల బెట్టాలి సుమా! అని హెచ్చరించేది అతని సున్నిత హృదయం.

ఇలా జమిలిగా కలగలిసి పోయిన కాల్పనిక, విప్లవ సముచిత సమ్మేళనం దాశరథి కవిత.

"నా కలంపు వి
న్నాణముతో రచింతు లల
నా! నును చెక్కులపైని కావ్యముల్"

అంటాడు దాశరథి. అంతేకాదు, 'కవితా మదిరానుపానమే అతులిత మోహనౌషధం' అని కూడా అంటాడు. 'ఇంతి... వాసంతి దాశరథికి అతిప్రియమైన కవితా వస్తువులు. ఉషస్సులో, చంద్రోదయంలో, శరత్తులో, శిశిరంలో అన్నింటా ఆయనకు అతివలే కన్నులకు కట్టుతారు' అని విశ్లేషించారు మాన్యులు దేవులపల్లి రామానుజరావుగారు.

హైదరాబాద్ సంస్థాన విమోచనానంతరం, 1949లో వీరి 'అగ్నిధార' అచ్చయింది. అగ్ని- ధారలా ప్రవహిస్తుందా? అని కొందరు మిత్రులు ఆక్షేపించారట. దానికి దాశరథిగారి సమాధానమేమిటో తెలుసా? విద్యుత్తు అగ్ని కాదా? అది ప్రవహించదా? సముద్రంలోని బడబ, అగ్నికాదా? అది నీటిలో అన్నివైపులా సాగిపోదా? అయినా అగ్ని ప్రవహించడాన్ని ఊహించండి. అగ్నిధారలోని అగ్ని అనేది చైతన్యానికి సంకేతం. ఆ చైతన్యం మానవుని హృదయంలో నుండి ఇంకొకరిలోకి ప్రవహించి, ఇలా జాతినంతటినీ ఏక సూత్రాన బంధిస్తుంది' అంటాడు దాశరథి.

అంగారం, శృంగారం కలగలిసిన కవిత్వం ఇతనిది. మఖ్దూం, కైఫీ ఆజ్మీ, అలీ సర్దార్ జాఫ్రీల కవితా విధానమిది. సైనికుడు యుద్ధరంగంలో పోరాడుతూ, అప్పుడప్పుడూ తన ప్రియురాలి అందమైన కళ్లను తలచుకోవడం స్వాభావికం కాదా? అన్నది దాశరథి ప్రశ్న. క్రాంతిని ప్రబోధించే ఎందరో కవులు కమ్మని శృంగార గీతాలు రాశారన్నది దాశరథి వాదన. దుర్మార్గులైన నైజాం సిపాయిలను ఎదిరిస్తూ అడవుల్లో తిరుగుతున్నప్పుడూ, జైల్లో ఏకాంతం బాధిస్తున్నప్పుడూ... తమ ఊళ్లో నదినుండి మంచినీళ్లు మోసుకెళ్లే పచ్చని అమ్మాయి తలపులో మెదులుతుండేది. దాంతో సుందరమైన కవితాపంక్తులు గుండె గొంతుకలో కదలాడుతుండేవంటాడు దాశరథి. గాయపడిన కవి గుండెలలో రాయబడిన కావ్యాలే ఇతని కవితా ఖండికలు.

'అనాదిగా సాగుతోంది - అనంత సంగ్రామం

అనాధులకూ, ఆగర్భ శ్రీమంతులకూ







నడుమ అన్న వర్గస్పృహ గల దాశరథి కృష్ణమాచార్య, తమ కలాన్నీ, గళాన్నీ పీడిత ప్రజల వాణికి మైక్‌లాగా వినియోగించాడు.

ఉద్యమకాలంలో అగ్నిధార, రుద్రవీణలను మీటిన దాశరథి 1955లోనే మహాంధ్రోదయానికి స్వాగతం పలికాడు.

'నేనురా తెలగాణ నిగళాలు తెగగొట్టి
ఆకాశమంత ఎత్తరిచినాను
నేను రాక్షసిగుండె నీరుగా, పద్యాలు
పాడి మానవుని కాపాడినాను
నేను వేస్తంభాల నీడలో నౌక తెల్గు
తోట నాటి సుమాలు దూసినాను
నేను పోతన కవీశానుగంటములోని
ఒడుపుల కొన్నింటి బడిసినాను
కోటి తమ్ముల కడ రెండుకోట్ల తెల్గు
టన్నలను గూర్చి వృత్తాంతమంద జేసి
మూడు కోటుల నొక్కటే ముడిబిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి'

అంటూ తెలుగు ఊరులు, తెలుగు వారలు ప్రతిఫలించే మహాకావ్యం తనకు కావలెనన్నాడు.

'గతాన్ని కాదనలేను
వర్తమానం వద్దనబోను
భవిష్యత్తు వదులుకోను
కాలం నా కంఠమాల
నా పేరు ప్రజాకోటి
నా ఊరు ప్రజావాటి'గా ప్రకటించిన ప్రజాకవి దాశరథి కంటికి కనిపించిందంతా కైతగా రాశాడు. మాట్లాడని మల్లె మొగ్గ మాదిరిగా నడిచాడు. నిశ్శబ్దం ఎరుగనట్టి నిమ్నగవలె నడిచిపోయాడు.

పునర్నవం, అమృతాభిషేకం, కవితాపుష్పకం, నవమి, నవమంజరి, దాశరథీ శతకం, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు, గాలిబ్ గీతాలు మొదలైన కవితా సంపుటుల్లో దాశరథి ఆలోచనల్లోని భిన్న పార్శ్వాలు దర్శనమిస్తున్నాయి. అతను రాసిన సినిమా గీతాలు సాహిత్య విలువలకు నిలువెత్తు సంతకాలు.

దాశరథి కవితాపుష్పకానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు (1967) లభించింది. గాలిబ్ గీతాల కృతి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అనువాద బహుమతి (1965)ని పొందింది. తిమిరంతో సమరం కవితా సంపుటిని కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు (1974) వరించింది. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు వీరిని 'కళాప్రపూర్ణ' (1975)తో గౌరవించింది. ఆగ్రా విశ్వవిద్యాలయం 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' (1976)తో సత్కరించిన దాశరథి కొంతకాలం పాటు (1977) ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవిగా గౌరవింపబడ్డారు.

'రానున్నది ఏది నిజం?
అది ఒకటే సోషలిజం!'

అని త్రికరణశుద్ధిగా విశ్వసించిన ప్రజాకవి నేడు లేడు. అతని కవితా పంక్తులు జాతి జనుల నాలుకలపై నాట్యం చేస్తూనే ఉన్నాయి.

'జైలు గోడల మధ్య
కేళీ విలాసంగా ఉండగలవాడు
శరీరంలో ప్రతి అణువూ
ఆరోగ్య స్నానం చేసే రీతిని
నిష్కల్మశంగా నవ్వగలవాడు
అతని కలం వజ్రాయుధం
అతనిది న్యాయపథం
అతన్ని మృత్యువు ప్రేమించింది
మనల్ని వదిలేసి పోయాడు
అయినా ఎంతదూరం పోతాడు?
మన హృదయాల మల్లెపందిళ్ళ కింద
దోహదక్రియ జరుపుతుంటాడు'

అంటూ తన అగ్నిధార కావ్యాన్ని అంకితమిస్తూ ఆళ్వార్ స్వామికి దాశరథి అర్పించిన నివాళి, సరిగ్గా దాశరథికి కూడా అన్వయిస్తుంది.

– డా॥ ఎస్వీ సత్యనారాయణ

# తెరతీయగ రాదా!



మార్క్ ట్వేన్

## హాస్యానికి నిర్వచనం

"ఆకలితో వున్న కుక్కకు తిండి పెడితే అది నిన్ను కరవదు. అదే మనిషికీ, కుక్కకూ వున్న ముఖ్యమైన భేదం"

"ఒకసారి ఒకటి కన్నా ఎక్కువ చుట్టలు కాల్చటం ఆరోగ్యానికి హానికరం"

"ఏప్రిల్ ఒకటి: మిగతా మూడు వందల అరవై నాలుగు రోజులూ మనమేమిటో గుర్తు చేసుకునే రోజు"

"తను మారితే తప్ప లోకం మారదు. అందరికీ ఎదుటి మనిషిని సంస్కరించాలనే వుంటుంది"

ఇలాంటి హాస్య, వ్యంగ్య బాణాలు సంధించిన మార్క్‌ట్వేన్‌కు (శామ్యూల్ లాంగ్‌హార్న్ క్లెమెన్స్), జీవిత చరమాంకంలో లోకమంతా విషాదమయమైంది. "సాటి మనుషులను చూసి జాలిపడతాను. మరణించినవాళ్లను చూసి అసూయపడతాను" అన్నాడు దుఃఖభారంతో.

1835లో నవంబర్ 30న ఆయన్ను ఈ లోకంలోకి తీసుకువచ్చిన హేలీ (తోకచుక్క), డెబ్బై ఏడేళ్ల తర్వాత 1910లో ఏప్రిల్ 21నాడు తనతో తీసికెళ్లింది.

అమెరికన్ సాహిత్యంలో తోకచుక్కలా వ్యాపించి, టామ్‌సాయర్, హకల్ బెర్రీఫిన్, రాజూ పేదా, ఎ కనెక్టికట్ యాంకీ ఇన్ కింగ్ ఆర్థర్స్ కోర్ట్, మిస్టీరియస్ స్ట్రేంజర్ లాంటి రచనలతో, అసంఖ్యాకమైన హాస్యోక్తులతో పాఠకులను, శ్రోతలను నవ్వుల కడలిలో ముంచెత్తిన మార్క్‌ట్వేన్ బాల్యం మిసిసిపీ నదీ తీరంలోని హానిబల్ లో గడిచింది. తల్లి నుండి మార్క్‌ట్వేన్‌కు సంక్రమించినవి రెండు: ఒకటి- ప్రతి మనిషి ప్రతి చేతలోనూ హాస్యాన్ని చూడగలగడం. రెండు- మతిమరుపు.

"ఏమ్మా, నీ పిల్లాడెప్పుడూ తుంటరి పనులుచేస్తూ అందర్నీ ఏడిపిస్తుంటాడు. ఎవరైనా కోపంవచ్చి కాళ్లూ చేతులూ విరిచినా విరుస్తారు. చంపినా చంపుతారు" అంటే-

"అయ్యో, వాణ్ణింతవరకూ ఎవరూ చంప



లేదనేగా నా దిగులు" అని నిట్టూర్చిందట ఆ తల్లి.

చిన్నప్పుడు మార్క్‌ట్వేన్ ఈత కొట్ట డంలో చేపల్తో పోటీపడాలనుకునేవాడు. ఆ ప్రయత్నంలో సావాసగాళ్ళిద్దరు మునిగి పోయారు. ఈ గడుగ్గాయి విద్యాభ్యా సమంతా రోజుల్లోనో, మహా అయితే వారాల్లోనో గడిచింది. ఏళ్లలో మాత్రం కాదు. బాల్యానుభవాలనే సాహిత్య వస్తువుగా స్వీకరించిన రచయిత ఆయన. మిసిసిపీ మీద స్టీమ్ బోట్లలో తను గడి పిన రోజుల్ని, అనాటి తన మిత్రుల్ని కథల్లో అజరామరంగా చిత్రించాడు. ఈయన కలం పేరు వెనకో కథ ఉంది. అప్పటిదాకా 'మార్క్‌ట్వేన్' పేరుతో రాసిన ఇసయ్యా సెల్లర్స్ మరణించాడని తెలిసి తను ఆ పేరు పెట్టుకున్నాడట. 1863 ఫిబ్రవరిలో తొలిసారి 'మార్క్‌ట్వేన్' పేరుతో అతడి కథ అచ్చయ్యింది. ఆ తర్వాత అతని జీవితంలో రాయని రోజులు చాలా తక్కువ ఉన్నాయంటారు. ఎన్ని పుస్తకాలో, ఎంత డబ్బో. కాని మార్క్‌ట్వేన్ చేతిలో డబ్బు నిలవదు. ఎంత వచ్చినా మళ్ళీ అప్పులే. రచనలతో వచ్చే ఆదాయం సరిపోదని లెక్చర్ టూర్లు చేశాడు. ఢిల్లీకి వచ్చినప్పటి తన అనుభ వాన్ని గురించి ఒక ఉత్తరంలో ఇలా రాస్తాడు-'ఓ ఉదయం హోటలు గదిలోకి రెండు కోతులొచ్చాయి. ఒకటి అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకుంది. ఫరవా లేదు. కాని మరొకటి నేను రాసిన కాగి తాలు చదువుతూ కన్నీరు పెట్టుకుంది. ఎంత అవమానం!'

మార్క్‌ట్వేన్ జీవితంలోని చివరి దశాబ్దం సన్మానాలతో, సత్కారాలతో నిండింది. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ఆయ నకు డి.లిట్ ఇచ్చింది. అదే దశాబ్దం వరుస విషాదాలతో నిండింది. ఉపన్య సిస్తూ ప్రపంచ పర్యటనలో ఉన్నప్పుడు పెద్ద కూతురు మరణించి, మరో కూతురు మూర్ఛరోగానికి గురైంది. 1904లో భార్య కూడా మరణించింది. ఈ అనుభవాలు ఆయన జీవిత దృక్పథాన్నే మార్చేశాయి. "వ్యక్తులూ, సమాజాలూ, సంస్కృతులూ నశించక తప్పదు.

ఇది మానవ జాతికి విధాత పెట్టిన శాపం" అంటాడు 'వాటీజ్ మాన్'లో. అలా, పాఠకుల్ని కితకితలు పెట్టడంతో ప్రారంభమైన మార్క్‌ట్వేన్ సాహితీ ప్రస్థానం నిరాశా నిస్పృహలతో ముగి సింది. "అమెరికన్ సాహిత్యానికి ఆద్యుడు మార్క్‌ట్వేన్" అని కీర్తించాడు ఎర్నెస్ట్ హెమింగ్వే.

–స్వప్న

---

**చతుర సమీక్ష** | **నవంబరు '07 నవల 'ఆకృతి'**

చతుర సమీక్షకు ఆఖరి తేది 25

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

# న్యూయార్క్ సబ్ వే




ప్రపంచంలోని మొట్టమొదటి సబ్‌వే (భూమికింది సొరంగంలో ప్రయాణించే రైలు మార్గం) న్యూయార్క్ నగరంలో 1904 అక్టోబర్ 27న ప్రారంభమైంది. 1900 మార్చిలో దీన్ని మొదలుపెట్టి నాలుగున్నరేళ్లలో నిర్మాణం పూర్తి చేశారు.




ఆ తర్వాత 1905లో లండన్‌లో సబ్‌వేని ఆరంభించారు. న్యూయార్క్‌లో 3000 మంది పనివాళ్ళు కలిసి 35 కిలోమీటర్ల దూరం సొరంగం తవ్వి ఈ సబ్‌వేని ఏర్పాటు చేసారు. న్యూయార్క్‌లోని మన్‌హాటన్ కింద గట్టిరాతిపొర(సిస్ట్) తగిలింది. దాన్ని అప్పటి పరిజ్ఞానంతో ఛేదించడం కష్టమై దానిమీద సబ్‌వేని నిర్మించారు. సొరంగం నిడివి 9 మీటర్ల డయామీటర్ ఉంటుంది. 1929లో వాల్‌స్ట్రీట్ క్రాష్ జరిగే దాకా న్యూయార్క్ సబ్‌వే లాభాల దిశలో వుంది. నిత్యం లక్షలాది మంది తమ ప్రయాణానికి, రవాణాకి సబ్‌వేనే ఉపయోగించేవారు. అంత దాకా కొత్త మార్గాలని వేస్తూ వచ్చారు. ఆ గ్రేట్‌క్రాష్ తర్వాత ఈ సబ్‌వే విస్తరణ పూర్తిగా కుంటుపడింది.

అదే సమయంలో ఫోర్డ్‌కార్లు సామాన్య అమెరికన్స్‌కి కూడా ఆర్థికంగా అందుబాటులోకి రావడంతో న్యూయార్క్ ప్రజలు సబ్‌వేలని విస్మరించి స్వంత కార్లని వాడ సాగారు. దాంతో సబ్‌వేలో ట్రాఫిక్ బాగా తగ్గిపోయింది. బాగా మంచుకురిసి రోడ్లమీద కార్లు నడపలేని స్థితిలో మాత్రమే సబ్‌వేలు కిటకిటలాడసాగాయి.

అప్పట్లో న్యూయార్క్ సబ్‌వేలో ప్రయాణించే రైళ్లు గంటకి 65 మైళ్ళవేగంతో ప్రయాణించేవి. 1920లో శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో నిర్మితమైన సబ్‌వేలోని రైళ్ళు గంటకి అంతకు రెట్టింపుగా 130 మైళ్ళ వేగంతో ప్రయాణించేవి. ఇందుకు కారణం సబ్‌వే నిర్మాణంలో వైజ్ఞానికంగా సాధించిన ప్రగతి.

1970-80 మధ్య న్యూయార్క్ సబ్‌వేలోని రైళ్ళలో ప్రయాణించే వారి సంఖ్య అది నష్టాల ఊబిలో కూరుకునేలా తగ్గిపోయింది. అందుకు ప్రధాన కారణం స్వంత కార్లే కాక, సబ్‌వేలో నేరస్థులు విచ్చలవిడిగా ప్రయాణికులను చంపడం, దోచుకోవడం లాంటి అసాంఘిక కార్యక్రమాలు కూడా అందుకు దోహదం చేశాయి. 'న్యూయార్క్ మెట్రో ట్రాన్సిట్ అథారిటీ' తీసుకున్న అనేక చర్యల ద్వారా ఇప్పుడు తిరిగి ట్రాఫిక్ పుంజుకుంది. న్యూయార్క్‌లోని ఓ చోట నించి ఏ చోటకైనా సబ్‌వేలో వెళ్ళగలిగేలా రైలుమార్గం వేయడం ప్రధానం కారణం.

ప్రస్తుతం ఎన్.టి.పి. కొత్తరకం రైలు బోగీలని ప్రవేశపెట్టింది. ఇది పూర్వపు వాటికన్నా సౌకర్యవంతమైనవే కాక అధిక రక్షణ కలిగినవి. ప్రతీరైలు డబ్బాని అనేక పరీక్షలు చేసి ప్రవేశపెట్టారు. ఉదాహరణకి రైలు డబ్బా తలుపులు 500 సార్లు మూసితెరిచే పరీక్ష, రైలు చక్రాలు ముందుకి, వెనక్కి పోనించే పరీక్షల్లాంటివి నిర్వహిస్తున్నారు. ఆ పరీక్షలో నిలబడలేనివి ఉపయోగించకుండా ఆపేస్తారు. ఇలా పరీక్షించే ప్రతీ 100 డబ్బాల్లో 8 రిజెక్ట్ అవుతుంటాయి. ఒకో డబ్బా ఖరీదు 25 లక్షల డాలర్లు.

ప్రస్తుతం న్యూయార్క్‌లో భూమికి 50 మీటర్ల అడుగున మరో సొరంగ నిర్మాణం జరుగుతోంది. ఇది పూర్తయితే ప్రయాణ వేగం పెరిగి, గమ్యానికి చేరే సమయం బాగా తగ్గుతుంది. మనదేశంలో కలకత్తాలో తొలిసారిగా అండర్‌గ్రౌండ్ రైల్వే నిర్మాణం జరిగింది. తర్వాత ఢిల్లీలో దీన్ని ఆరంభించారు.

# 132 ఏళ్లయినా వసివాడని వందేమాతరం

ఆ గేయం శక్తి అమేయం!

నిజానికి అది గేయం కాదు..

నిర్నిద్రావస్థలో ఉన్న ఒకజాతి మొత్తాన్నీ తట్టిలేపి, పరుగులెత్తించిన కదన శంఖా రావం!

జాతి గొంతులోంచి కాక గుండెల్లోంచి పెల్లుబికిన సింహనాదం!

ముప్పైకోట్లమంది గుండెలకు హత్తు కున్న వేదం!

అక్షరానికి 'అక్షర' శక్తి ఉందని నిరూపిం చిన బీజాక్షరం!

ఆసేతు హిమాచల పర్యంతం జనావ ళిని ఉర్రూతలూగించిన పంచాక్షరీ మంత్రం!!

విచిత్రమేమంటే- అంతటి శక్తిమంత మైన ఆ గీతం ప్రాణం పోసుకుంది ఓ రైలు పెట్టెలో!

కవిగారు దాన్ని తొలిసారి రాసి, తనతో కలిసి పనిచేసేవారిలో ఒకరికి చూపితే 'అబ్బే బాగా లేదు' అని అతను పెదవి విరి చాడట.

దాంతో కవిగారు అదే గీతాన్ని కొన్నేళ్లు గడిచాక తాను రాసిన ఓ నవలలో చేర్చారు. ఆ సమయంలో ఆయన అనుకో లేదు, తాను రాసిన ఆ గీతం చరిత్ర సృష్టి స్తుందని. ఉరికొయ్యకు వేలాడే వేళ సైతం దేశభక్తుల నాలుకలపై నర్తిస్తుందని.

దురదృష్టం ఏమంటే- తాను రాసిన ఆ గీతం మహావైభవాన్ని కళ్లారా చూడకుం డానే ఆ కవిగారు పరమపదించడం.

కుతంత్రాలకు, కుత్సిత రాజకీయా లకు, వివక్షకులోనై అదేగీతం పాలకుల నిరాదరణకు గురవడం ఇంకో దురదృష్టం.

ఇంతకీ ఆ గీతం ఏమిటో తెలుసా? సుమారు వందేళ్లకు పైగా మన గుండెల్లో మార్మోగుతున్న వందేమాతర గీతం!

ఆ కవిపేరు బంకించంద్ర ఛటర్జీ!!

నిద్రపోతున్న భారతీయులను స్వాభిమానంతో ముందుకు దూకే సింహాలుగా మార్చింది వందేమాతరం. బాపూజీ అన్నట్లు మనముందొక అఖండ భారత మాత రూపాన్ని సాక్షాత్కరింప చేసింది వందేమాతరం. వెయ్యి ఆవేశపూరిత ప్రసంగాలు, ఉద్రేకపూరిత చర్యలు సాధించలేని అద్భుత విజయాన్ని సాధించింది వందేమాతరం. ఖుదీరాంబోసు, చంద్రశేఖర ఆజాద్, భగత్‌సింగ్, మదన్‌లాల్ ధీంగ్రా లాంటి యోధులెందరో 'వందేమాతరం' అంటూ భరతమాతకోసం ప్రాణాలు విడిచారు.

'వందేమాతరం' అని వినబడితేచాలు ఆంగ్లేయులు వణికిపోయారు. వందేమాతరం వ్యక్తీకరణం దేశభక్తి భావనా సూచనం. అది జాతీయ భావనను బోధిస్తుంది తప్ప విజాతీయ కార్యకలాపాల్ని రెచ్చగొట్టేది కాదు.

ఈ మహత్తర గీతాన్ని 1875 నవంబరు 7న బంకించంద్రుడు ఒకరైలులో ప్రయాణిస్తూ రాశాడు. ఆ రోజు ఆదివారం.. అక్షయనవమి! భాషాభేదాలకతీతంగా సంస్కృత బెంగాలీ పద సమ్మిశ్రితంగా మణిప్రవాళంగా ఈ గీతం మెరిసింది. కోల్‌కతాకు సమీపంలోని తన స్వగ్రామమైన కాంతల్పాడాలో ఆయన తన ఇంట్లోనే దీన్ని రాశాడనేది మరికొందరి వాదన. ఏదైతేనేం? నవంబరు 7 నాటికి ఈగీతం ప్రాణం పోసుకుని నూట ముప్ఫయి రెండేళ్లు. ఇంత సుదీర్ఘకాలం పాటు ప్రజల గుండెల్లో ఓ గీతం కొలువుండడం అపురూపమే.

బెంగాల్‌లో దసరాకు ఉండే ప్రాముఖ్యం తెలిసిందే. దేవీనవరాత్రులకు చండీసప్తశతి పారాయణం తప్పనిసరి. వందేమాతరం కూడా దసరా నవరాత్రి ఉత్సవాలు ముగిసిన తర్వాత పుట్టిందేమో అన్పిస్తుంది.

యాదేవీ సర్వభూతేషు విద్యారూపేణ సంస్థితా

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః -

అని చండీ సప్తశతిలోసాగే శ్లోకపరంపర లక్ష్మి, లజ్జ, శ్రద్ధ, పుష్టి, ఆకలి, శక్తి, తెలివి, బుద్ధి, నిద్ర, కోరిక, శాంతి, కాంతి, భ్రాంతి, వృత్తి- అన్నీ ఆ మహామాయ రూపాలేనని వెల్లడిస్తుంది. వందేమాతర గేయానికి ఈ శ్లోకాలు ప్రేరణ కావచ్చు.

ముఖ్యంగా 'తుమివిద్యా తుమిధర్మ, తుమిహృది, తుమిమర్మ, త్వం హి ప్రాణాః శరీరే...' అనిసాగే ఉత్తరార్థమంతా సప్తశతి భావాలకు గేయానుసరణమే. వందేమాతర గీతంలో ఒక దైన్యం, ఆర్తి, అభయం, రక్షణ, ఆత్మార్పణం, ప్రస్తుతి, శరణాగత పరిరక్షణ మొదలైనవన్నీ ప్రతీకాత్మకంగానో, వాచ్యంగానో నిక్షిప్తమయ్యాయి.

బంకించంద్రుడు తానే సంపాదక సారథ్యం వహిస్తున్న 'వంగదర్శన్' పత్రికలో ప్రచురణకు ఈ గీతాన్ని ఇచ్చాడు. ప్రూఫ్‌రీడర్ ఒకతను 'ఇది బెంగాలీ, సంస్కృతాల కల్తీకవిత్వం.. ఏం బావుంటుంది?' అని పెదవి విరిచాడట. తనే సంపాదకుడైనా బంకించంద్రుడు కింది స్థాయి ఉద్యోగి మాట మన్నించాడు. తర్వాత 1880-82 ప్రాంతాల్లో సీరియల్‌గా రాస్తున్న 'ఆనంద మఠం' నవల్లో ఆ గేయాన్ని నిక్షేపించాడు.

'ఆంగ్ల విజ్ఞాన సర్వస్వం' లాంటివి వందేమాతర గీతానికి అంతటిపేరు ప్రఖ్యాతులు వస్తాయని బంకించంద్ర సైతం భావించలేదని రాశాయి.

కాని- '20, 30 ఏళ్ల తర్వాత ఈ గీతం వింటేచాలు... వంగదేశమంతా హోరెత్తి



పోయే రోజు రాకమానదు. అప్పుడు జాతి తనకాళ్లమీద తాను నిలుస్తుంద'ని బంకిం చంద్ర ఒక మిత్రునికి రాసినలేఖలో ముందే పేర్కొనడం గమనార్హం. 1894 ఏప్రిల్ 8న యాభై ఆరేళ్లకే ఆయన అస్త మించడంతో వందేమాతర గీతం మహావై భవాన్ని బంకించంద్రుడు చూడలేకపో యాడు.

1905 జులై 20న బ్రిటిష్ ప్రభుత్వం బెంగాల్‌ను విభజించి ప్రజల్లో చీలికను తెచ్చింది. నేటి బంగ్లాదేశ్ ఆవిర్భావానికి ఒకతీరుగా కర్జన్ మూలకారకుడన్నా తప్పు లేదు. చైతన్యకేంద్రమైన కలకత్తాను నిర్వీ ర్యంచేసి ఢాకాను అభివృద్ధి చేయడాన్ని, ఢాకా నవాబు సతాముల్లాకు లంచం ఎర జూపి వశపర్చుకోవడాన్ని జాతీయవాదు లైన మహ్మదీయులూ అప్పట్లో ఖండిం చారు. 1905 సెప్టెంబరు 23న కలకత్తాలో అబ్దుల్ రసూల్ అధ్యక్షతన జరిగిన మహాసభలో బెంగాల్ విభజనకు వ్యతిరే కంగా 'వందేమాతరం' నినాదం చేశారు.

విభజనవల్ల తూర్పు బెంగాల్‌కు లెఫ్టి నెంట్ గవర్నర్‌గా వచ్చిన ఫుల్లర్ హిందూ మహ్మదీయుల నడుమ చిచ్చు రగుల్కొవ డానికి చేయాల్సిందంతా చేశాడు. ఇందులో భాగంగా 1905 నవంబర్ 8న 'వందేమా తరం' పాడడాన్ని నిషేధించాడు. వందే మాతరంపై పడిన తొలివేటు ఇది.

ఇదంతా తూర్పు బెంగాల్(ప్రస్తుత బంగ్లాదేశ్)లో జరిగిన వ్యవహారం. కలక త్తాలో ఆగస్టు 7, 1905న అపార జనవా హిని ఒకేవేదికమీద వీలుకాక నాలుగు చోట్ల సమావేశమై వందేమాతర నినాదం తో ఆకాశాన్ని చిల్లులు పొడిచి బెంగాల్ విభజనను ఖండించింది. సురేంద్రనాథ్ బెనర్జీ దీనికి నాయకత్వం వహించారు.

రవీంద్రుడన్నట్లు స్వదేశీ ఆత్మ వందేమా తరంలో ఆవిష్కృతమైంది. 1906 ఏప్రిల్ 14న పశ్చిమ బెంగాల్‌లోని బారిసాల్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు సభ రవీంద్రుని వందేమాతర గానాలాపనతో ప్రారంభమైంది. ఆ సందర్భంగా పోలీసు లు రెచ్చిపోవడంతో సురేంద్రనాథ్ బెనర్జీ తలకు గాయాలయ్యాయి. మనోరంజన్ గుహ కుమారుడు చిత్తరంజన్ గుహను



నీళ్ళున్న చెరువులోకి విసిరేశారు. అదృ ష్టవశాత్తు అతన్ని ఎవరో రక్షించారు.

పోలీసుల విపరీత ప్రవర్తనకు రాజప్రతి నిధి లార్డ్‌మింటో సంజాయిషీ ఇచ్చుకోవ లసి వచ్చింది.

'స్థానిక అధికారులు గైకొన్న చర్య ఏవి ధంగాను సమర్థనీయం, చట్టబద్ధం కానం దువల్లనే గవర్నర్ జనరల్ జోక్యం చేసు కోవాల్సి వచ్చింది. సురేంద్రనాథ్ బెనర్జీని అరెస్టు చేయడంలోను, ఊరేగింపులో జోక్యం చేసుకోవడంలోను పోలీసులు న్యాయ సమ్మతంగా ప్రవర్తించలేదు.

పైపెచ్చు వందేమాతరం అంటే చట్టాన్ని ఉల్లంఘించడమేనని ప్రకటించడం చట్టానికి తప్పుడు వ్యాఖ్యానం చేసినట్లే' అని మింటో ప్రకటన ఇచ్చాడు.

అలా వందేమాతరం బెంగాల్ అంతటా ప్రతిధ్వనించింది. 1906లో అరవిందుడు 'వందేమాతరం' పేరుతో ఒక పత్రిక ప్రారంభించాడు. 1905 లోనే సుబ్రహ్మణ్య భారతి వందేమాతరానికి తమిళానువాదం చేశారు. మేడంకామా 'వందేమాతరం' పేరుతో పత్రిక నడిపింది. 1905లోనే హిందు మహ్మదీయ మతాల ప్రతీకగా దేవనాగరి లిపిలో వందేమాతరం.. పైన పద్మం, కింద నెలవంక ఉండేలా జెండా రూపొందింది. దక్షిణాఫ్రికాలో ఉన్న రోజుల్లోనే గాంధీజీ 1905 డిసెంబర్ 2న 'ఇండియన్ ఒపీనియన్' పత్రికలో 'వందేమాతర గీతం ఉత్తేజకరమైన ప్రబోధాత్మకమైన ప్రార్థనా గీతం' అని రాశాడు.

1905 డిసెంబర్ 12న బెనారస్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభల సందర్భంగా వందేమాతరం ఉత్తరప్రదేశ్‌లో అడుగుపెట్టింది. రవీంద్రుని మేనకోడలు సరళాదేవి ఆ గీతాన్ని గానం చేశారు. లాలాలజపతి రాయ్, తిలక్, బిపిన్ చంద్రపాల్, తమ మహోద్రేక ఉపన్యాసాలతో వందేమాతర గీతాన్ని యావద్భారత వ్యాపితం చేశారు.

1923లో మౌలానా మహ్మదాలీ అధ్యక్షతన జరిగిన కాకినాడ కాంగ్రెసు సమావేశంలో 'సంగీతం మా మతానికి వ్యతిరేకం' అంటూ వందేమాతర గీతాలాపనకు మహ్మదాలీ అభ్యంతరం పెట్టాడు. ఇది మతవేదిక కాదు. పైగా మిమ్మల్ని మేళతాళాలతో ఊరేగించినపుడు లేని అభ్యంతరం ఇప్పుడెందుకని తీవ్రంగా పలికి విష్ణుదిగంబర్ పాలుస్కర్ వందేమాతరం గీతాన్ని ఆలపించారు.

శాసనసభల్లో వందేమాతరం ఆలాపన పట్ల మహ్మదీయుల వ్యతిరేకత, వాకౌట్‌లు ఎక్కువయ్యాయి. 1937 అక్టోబరులో 'వందేమాతరం'లోని తొలి రెండు చరణాలే పాడాలని, అవసరమైతే దీని స్థానంలో వేరేగీతాన్ని పాడుకొనే స్వేచ్ఛ సభానిర్వాహకులకు ఉందని కాంగ్రెస్ కమిటీ ప్రకటించింది.

ఇంగ్లాండ్‌లో బారిస్టర్ చదివినవాడు,

*బంకించంద్రుడి సంతకం*

మతపరమైన భావాలను పట్టించుకోనివాడిగా పేరున్న మహ్మదాలి జిన్నా 1938 మార్చి 17న వందేమాతర గీత నిషేధంతోపాటు మరో 14 కోర్కెలు కోరుతూ నెహ్రూకు ఉత్తరం రాయడం సంచలనం సృష్టించింది. అధికారం కోసమే జిన్నా ఇలా వ్యవహరించాడని పలువురు విమర్శించారు. ఏమైతేనేం? క్రమేణా జిన్నా నేతృత్వంలో పాకిస్తాన్ ఆవిర్భావం దాకా కథ నడిచింది.

రిపబ్లిక్ డే ముందు జాతీయగీతం నిర్ణయవేళ.. ప్రధాని నెహ్రూ అతి విచిత్రంగా వందేమాతర స్థానంలో రవీంద్రుని 'జనగణమన'ను ప్రతిపాదించాడు. 1948 ఆగస్టు 25న ఆయన రాజ్యాంగ సభలో మాట్లాడుతూ 'ఐక్యరాజ్య సమితిలో మన ప్రతినిధి వర్గానికి జాతీయ గీతంతో అవసరం వచ్చినప్పుడు జనగణమన రికార్డ్ తప్ప వేరే లేకపోయింది. వాద్యాల కనుగుణంగా ఉండంతో అది పలువురి ప్రశంసలు చూరగొంది' అంటూ ఆకుకు అందని, పోకకు పొందని వివరణ ఇచ్చాడు.

వందేమాతరం లయబద్ధంగా లేదనడాన్ని సంగీతజ్ఞులు తిరస్కరించారు. 'ఒక పాటను సమర్థించే నిమిత్తం, వేరొక గీతా







నికి వంకలు పెట్టడం సంగీతాన్ని కించపరచడమే. 'వందేమాతరం' అంటూ వేలాదిమంది ఉరికంబాలెక్కారు. ఆ వీరుల త్యాగాలే ఆ గీతానికి ఆ అర్హతను సాధించిపెట్టాయి' అని అరవిందాశ్రమం వెలువరించే 'మదర్ ఇండియా' పత్రిక స్పష్టంగా రాసింది.

అయినా వందేమాతర గీతం ఏ నాయకుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడకుండా భారతీయుల హృదయాల్లో చిరనివాసముంటుంది.

సంతోష సమయాల్లో దాన్ని మరచిపోవచ్చు. కాని కష్టకాలంలో ఆ గీతం మనలను మరవదు. అందుకే ద్వితీయ భారత స్వాతంత్ర్యసమర మనదగిన ఎమెర్జెన్సీ (1975-77)లో సైతం 'వందేమాతరం' పేర ఒక పత్రిక వచ్చింది. అవసరం తీరిన వెంబడే మళ్లీ మాయమైంది.

భారతీయులను ఎల్లవేళలా ఉత్తేజపరిచి దేశసేవలోకి పునరంకితం చేసే పవిత్రాతిపవిత్రమంత్రం వందేమాతరం.

తెలుగు సాహిత్యంలో వందేమాతరం నినాదప్రాయంగా, మాతృ రూపకల్పనలోను, మాతృభావ కల్పనలోను కనిపిస్తుంది. ముదిగొండ వీరభద్రమూర్తి 'వందేమాతరం' పేరుతో మహోజ్జ్వల కావ్యాన్ని రాశారు. ప్రసాదరాయ కులపతి 'వందేమాతరం' పేరుతో వందేమాతర చరిత్రను గ్రంథస్తం చేశారు. బంకించంద్రుని సర్వరచనలను జీవితాన్ని విశ్లేషిస్తూ ప్రప్రథమంగా 'భారతీయ జ్వలిత చేతన బంకించంద్ర' అనే పరిశోధన గ్రంథాన్ని ఈ వ్యాసకర్త వెలువరించారు. వందేమాతర ప్రభావంతో ఎందరో కవులు గీతాలు రాశారు. నాటకాల్లోను, నవలల్లో వందేమాతర ప్రస్తావన కనిపిస్తుంది.

*- డాక్టర్ వెలుదండ నిత్యానందరావు*

కథవెనుక కథ

## పఠితల్ని కదిలించిన

# దేవుడికి ఉత్తరం

భర్త ప్రోత్సాహంతో వివాహానంతరం ఎం.ఎ., ఎల్.ఎల్.ఎం. చదివి వివిధ విభాగాల్లో ఉన్నతాధికారిణిగా, రాజ్యసభ సెక్రెటరీ జనరల్‌గా, కర్ణాటక రాష్ట్ర గవర్న రుగా సేవలందించిన వి.ఎస్. రమాదేవి రచయిత్రిగానూ మంచిపేరు తెచ్చుకు న్నారు. చదువు పూర్తికాకముందు, చాలా పిన్నవయసులోనే రచనలు చేయడం ఆరంభించారామె. కరగిపోయే కలల రమాదేవిగా ఆ రోజుల్లో సాహితీ మిత్రుల్లో పేరొందిన ఆమెను కథవెనక కథ గురించి అడిగితే తాను రాసిన రెండో కథ 'దేవుడికి ఉత్తరం'. అది రాయడానికి తనను ప్రేరేపించిన సంఘటన గుర్తుచేసు కున్నారు.

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు ప్రాంతానికి చెందిన రైతు కుటుంబంలో జన్మించిన రమాదేవి చాలా చిన్నవయసులోనే తల్లిని కోల్పోయారు. చిన్నపిల్లల్ని తల్లిలా చూసుకోవాల్సిన బాధ్యత అక్కమీద పడింది. 'ఓరోజు పాఠశాల నుంచి ఇంటికి వచ్చేసరికి మూడేళ్ల వయసున్న నా చిన్న చెల్లెలు ఇంటి గుమ్మం ముందు మెట్లమీద ఒంటరిగా, దిగాలుగా కూర్చుని ఉంది. దూరాన్నుంచి దాన్ని ఆ స్థితిలో చూడగానే నాకు చాలా బాధనిపించింది. కేరింతలతో ఆడుకోవాల్సిన పసివయసులో అంత ఒంటరితనం, కళ్లనిండా దిగులుచూస్తే





అమ్మలేనిలోటు తెలిసివచ్చింది. మాకూ అమ్మ ఉంటే చక్కగా సాయంత్రం అమ్మ చేసిన వేడి వేడి టిఫిన్‌తిని, తోటి పిల్లలతో ఆడుకునేది కదా అన్పించింది. ఆ సంఘ టనే 'దేవుడికి ఉత్తరం' కథకి ప్రేరణ. కథాంశం అదే కానీ మిగిలిన కథనమంతా నేను అల్లుకున్నదే' అని చెప్పారు రమా దేవి.

తనకథలన్నీ సమాజంలో మనుషుల ప్రవర్తన, స్వభావాల మీదే ఆధారపడి సాగుతాయనే రమాదేవి నిజజీవిత సంఘ టనలు ప్రేరణ మాత్రమే కలిగిస్తాయని, వాటిని కథారూపంలో పెట్టడానికి రచయి తకు కాల్పనిక చాతుర్యం కావాలని అన్నారు. 'దేవుడికి ఉత్తరం' మొదట ఏ పత్రికలో ప్రచురితమైందో గుర్తులేదు కానీ భార్గవీరావు సంపాదకత్వంలో వెలువడిన 'నూరేళ్లపంట' పుస్తకంలో చోటుచేసుకుం దని చెప్పారు. దీంతోపాటు మరికొన్ని కథానికలు కలిపి రమాదేవి 'దేవుడికి ఉత్తరం' కథలు, కథానికల సంపుటిని ప్రచురించారు.

కథ ఇది!

అయిదేళ్ల సుశి, స్నేహితురాలు సీతతో కలిసి స్కూలునుంచి ఉత్సాహంగా ఇంటికి పరిగెత్తుకువచ్చింది. ఇంటికి తాళంవేసి ఉండేసరికి స్కూల్లో తాను సాధించిన డబుల్ ప్రమోషన్ విషయం చెప్పడానికి ఎవరూ లేరని దిగులుపడుతుంది. వెంటనే సీత తన ఇంటికి రమ్మని తీసుకె ళ్తుంది సుశిని. సుశి ఫస్టు, తాను సెకండు వచ్చామని తల్లికి చెప్తుంది సీత. సీత తల్లికి సుశి పరిస్థితి తెలిసి ఆత్మీయంగా అక్కున చేర్చుకుని మెచ్చుకుంటుంది. పిల్ల లిద్దరికీ ఉప్మా చేసిపెడుతుంది. అయినా సుశికి అమ్మ గుర్తొస్తుంది. గబగబా తినే సివెళ్లి అక్కకోసం ఎదురుచూస్తుంటుంది.

## చలం మెచ్చిన రచయిత్రి

ఎన్నో కథలు, మరెన్నో నవలలు రాయడమేకాక పలు పత్రికల్లో శీర్షికలు కూడా నిర్వహించిన, నిర్వహిస్తున్న రమా దేవి అవార్డుల గురించి అసలు పట్టించు కోరు. 'నాకంతగా ఆసక్తి లేదు. నాకు ప్రక టించినా తీసుకున్న అవార్డుల కన్నా తీసు కోనివే ఎక్కువ' అన్నారామె. రమాదేవి తొలుత ప్రచురించిన పుస్తకం 'నా కరిగి పోయే కలలు' (మ్యూజింగ్స్). అది చదివి 'నా కలలోకి వచ్చిన అమ్మాయిని చూడా ల'ంటూ వచ్చారట కాటూరి వెంకటేశ్వర రావు. ఎవరో చెప్పగా విని పుస్తకం చది విన చలం.. గుర్తుంచుకుని తీరాల్సిన రచ యిత్రి అన్నారట. ఉద్యోగంలో చేర కముందే ఎక్కువగా రాశారు రమాదేవి. ఎమర్జెన్సీ సమయంలో రాసిన 'రాజీ' నవ లకు అనుబంధంగా తర్వాత మలుపులు, మజిలీ, అనంతం అనే మూడు నవలలు రాశారు. అందరూ మనుషులే, దారితప్పిన మానవుడు, సంసార సాగరాలు, కాల చక్రం, అనుబంధాలు, తల్లీబిడ్డలు, పంకజం, లేడీస్ కంపార్ట్‌మెంట్... ఆమె రాసిన ఇతర నవలలు. 'మీరు నేను జట్టు' పిల్లలతో కబుర్లు అయితే, 'మనం మన సంసారాలు' స్త్రీలతో కబుర్లు. చాలాకాలం నిర్వహించిన శీర్షిక 'విపులాచపృథ్వీ' కూడా ఒక పుస్తకంగా ప్రచురించారు. న్యాయశా స్త్రానికి సంబంధించిన పుస్తకాలెన్నో ఆమె ఆంగ్లంలో కూడా రాశారు. వాటిని తెలు గులో ఈ మధ్యనే తెలుగు అకాడమీ వారికి రాసిచ్చారు.

అక్క రాగానే 'నాకు డబుల్ ప్రమోషన్ వచ్చింది. చెప్పాలని వస్తే ఇంట్లో ఎవరూ లేరు' అంటూ ఫిర్యాదు చేస్తుంది. చిన్నపి ల్లకు సమాధానం చెప్పలేక మాటమార్చడా నికి ప్రయత్నం చేసిన అక్క ఆ పాప

'నాకు జ్వరం వచ్చినా మన అమ్మ ఎందుకు రాదు..' అంటూ తరచి తరచి అడిగేసరికి బాధ తట్టుకోలేకపోతుంది. తండ్రి దగ్గరికెళ్లి బావురుమంటుంది. ఇంతలో ఆకలిగా ఉందంటూ తమ్ముడు వస్తాడు. అన్నకీ తన ప్రమోషన్ విషయం చెప్పి అమ్మగురించి అడుగుతుంది సుశి. అమ్మ చచ్చిపోయింది, రాదంటాడు అన్న. చచ్చిపోవడమంటే ఏమిటో అర్థంకాని సుశి మళ్లీ వెళ్లి తండ్రిని అడుగుతుంది. 'నేను రేపు వెళ్లి తీసుకువస్తా'నని ఆయన హామీ ఇస్తాడు. 'నువ్వు మారాం చేయకుండా చదువుకో. అమ్మను పంపమని దేవుడు తాతయ్యకి ఉత్తరం రాసివ్వు. తప్పకుండా పంపుతాడు' అని చెప్తుంది అక్క. సుశి ఉత్సాహంగా తన నోటుపుస్తకం తీసుకుని ఒక కాగితంలో 'దేవుడు తాతయ్యా... అమ్మని దబ్బున పంపు' అని రాసి, తండ్రికిస్తుంది పోస్టుచేయమని.

**తండ్రి అమ్మను తీసుకొస్తానని ఊరెళ్తోంటే తానూ వస్తానని ఏడుస్తుంది సుశి. చిన్నపిల్లలను అక్కడికి రానివ్వరని చెప్పి వెళ్లిన తండ్రి ఒక కొత్తావిడను తీసుకుని కారులో వస్తాడు.**

రెండురోజుల తర్వాత తండ్రి అమ్మను తీసుకొస్తానని ఊరెళ్తోంటే తానూ వస్తానని ఏడుస్తుంది సుశి. చిన్నపిల్లలను అక్కడికి రానివ్వరని చెప్పి వెళ్లిపోయిన తండ్రి ఒక కొత్తావిడను తీసుకుని కారులో వస్తాడు. అమ్మకోసం ఆత్రంగా పరిగెత్తుకెళ్లి కొత్తమనిషిని చూడగానే అక్క పక్కన చేరుతుంది సుశి. 'మన అమ్మే. జ్వరం వచ్చింది. ఆ ఊరెళ్ళి అన్ని రోజులుండేసరికి అలా మారిపోయింది. అక్కడ ఎవరైనా అలాగే మారిపోతారట..' అంటూ నచ్చజెప్తున్న అక్కని, కొత్త అమ్మని తెల్లబోయి చూస్తుంది సుశి.

### క్లాసిక్‌గా ఎంపికైంది.

ఈ కథ ప్రచురితమైనప్పుడు వచ్చిన స్పందన గురించి తనకేమీ తెలియదన్నారు రమాదేవి. 'అప్పుడు ఇవన్నీ తెలియవు. రాయాలనిపించి రాశాను. చదివిన వారు ఏమనుకుంటున్నారన్న ఆలోచన లేదు. పైగా చదువు తప్ప మరో లోకం తెలియని మాకు రచయితలతో పరిచయాల్లేవు. దీనికన్నా ముందు నేను రాసిన మొదటి కథ 'కలిమి లేమి' ఆంధ్ర పత్రికలో ప్రచురితమైంది. అచ్చులో మొదటిసారి నా కథ చూసుకుని చాలా ఆశ్చర్యపోయాను. మా ఇంటి ముందు ఖాళీజాగాలో ఎరుకలవాళ్లు గుడిసెలేసుకుని ఉండేవారు. వాళ్ల ఇంట్లో పసిపిల్ల కలరా వచ్చి చనిపోతే రెండురోజులు ఏడ్చిన తల్లి మూడోరోజు పనికి వెళ్లిపోయింది. వెళ్లకపోతే వారికి గడవదు మరి. ఆ విషయాన్నే డబ్బున్న మరో కుటుంబంతో పోలుస్తూ 'కలిమిలేమి'(ఈ కథే 'నిజం నిష్ఠూరం' పేరుతో దేవుడికి ఉత్తరం కథల సంపుటిలో చేర్చారు) రాశాను. అసలు అచ్చవుతుందా అనుకున్న కథ అచ్చవడమే కాక కాంప్లిమెంటరీ కాపీ, పారితోషికం వచ్చాయి. నాన్నగారికి సాహిత్యమంటే అభిమానం ఎక్కువ. ఆయన నేనురాసిన ప్రతి కథా చదివేవారు. అచ్చులో నా కథ చూసి చాలా సంతోషించారాయన. 'దేవుడికి ఉత్తరం' 'నూరేళ్లపంట' పుస్తకంలో వచ్చినప్పుడు చాలామంది చెప్పారు- మీ 'దేవుడికి ఉత్తరం' కథ మాకు కళ్లనీళ్లు తెప్పించింది అని. 'క్లాసిక్స్ కేటగిరిలో టీవీ వాళ్లు ఎంపిక చేసుకుని చిత్రీకరించిన కథల్లో ఈ కథ కూడా ఉందని నాకు తర్వాతతెలిసింది..' అని చెప్పారు రమాదేవి.

సేకరణ: పద్మశ్రీ యలమంచిలి



# కాలాతీతం

# అంకుల్ టామ్స్ కేబిన్



బానిసలను కూడా ఇంటి మనుష్లాగే చూడగలిగినంత మంచిమనిషి.

జార్జిహారిస్ పరిస్థితి యిందుకు భిన్నం. ఒక జనపనార ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. నారను శుభ్రం చెయ్యడానికి ఒక కొత్త యంత్రాన్ని కనిపెట్టాడి టీవలే. అతడి యజమాని క్రూరుడు. చెయ్యని నేరాలకు కూడా తన బానిసలను శిక్షించటం అతడి స్వభావం.

ఒకనాడు, తన కొత్త ఆవిష్కరణ గురించి మాట్లాడుతున్న జార్జి పట్ల యజమానికి అసూయ పెరుగుతుంది. తన చెప్పుకింద పడుండాల్సిన బానిస తలెత్తుకుని తిరుగుతాడా? ఆ కోపంతో, జార్జిని తక్షణం ఫాక్టరీ పని నుండి తప్పించి పొలం పనులు చెయ్యమని ఆజ్ఞాపిస్తాడు. కాని, జార్జి కష్టాలు అంతటితో తీరలేదు. మరోసారి, యజమాని కొడుకు గుర్రాన్ని కొట్టి చంపుతుంటే అడ్డుపడ్డందుకు, అతణ్ణి చెట్టుకు కట్టించి చర్మం వూడేటట్టు కొట్టిస్తాడు.

ఇది విన్న ఎలిజా కన్నీరుమున్నీరై "అన్నింటికీ దేవుడే వున్నాడు, జార్జ్. మా యజమానురాలు కూడా అదే చెబుతుంది.

కథలో సెంటిమెంటుపాలు కాస్త ఎక్కువే. ఎంతటి దుర్భర పరిస్థితుల్లోనూ దేవుడే దిక్కని బతికారు నల్లవాళ్ళు. తమను జంతువులుగా చూసిన తెల్ల యాజమానుల పట్లకూడా కొందరు వల్లమాలిన ప్రేమ, విశ్వాసం ప్రకటించారు. మతప్రభావం అధికంగా వున్న కుటుంబంలో పెరగటం వల్ల, "కరుణ ముఖ్యం" అన్న జీసస్ బోధనలు కూడా రచయిత్రి కథనిలా మలచటానికి సహాయం చేసి వుంటాయి.

ఒక క్వాడ్రూన్(సంకరజాతి నాలుగో వంతు 'నల్ల'రక్తం వున్న) బానిస యువతి ఎలిజా మరొక ములాటో(సంకరజాతి యురోపియన్, నల్లవాళ్ల సంతానం) బానిస యువకుడు జార్జ్ హారిస్‌ను పెళ్లాడుతుంది. ఎలిజా అందగత్తె. ఆమె యజమానురాలు మిసెస్ షెల్బీది జాలిగుండె.

# ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

మన యజమానులకు మన మీద జాలిక లగాలని ప్రార్థించాలి మనం" అంటుంది.

కాని, జార్జి, మరో దుర్వార్త కూడా మోసుకొచ్చాడు. ఎలిజాను వదిలేసి, మరో స్త్రీని పెళ్లాడమన్నాడు యజమాని.

"అదెలా, ప్రీస్టే మన పెళ్లి చేశాడుగదా? " అంది ఎలిజా కొడుకును గుండెలకు హత్తుకుంటూ. తన యజమానుల యింటికి బానిసల వ్యాపారి హేలీ వచ్చాడనీ, షెల్బీ తన ఎస్టేటులోని కొందరు బానిసల్ని అమ్మకానికి పెడుతున్నాడనీ ఆమె చెప్ప లేదు.

"నేను బతికుండాలంటే ఒకే మార్గం కనిపిస్తున్నది. కెనడా పారిపోతాను ఎలిజా. నా ప్రాణం వుండగా వీళ్లకు చిక్కను" అన్నాడు జార్జి.

షెల్బీ ఎస్టేటుకు మేనేజరుగా పనిచేస్తున్నాడు టాం. కలపతో చేసిన ఒక కేబిన్ అతని నివాసం. భార్య 'క్లో' యజమానుల యింట్లో వంటమనిషి.

ఒకనాడు, కొడుకును చంకనేసుకొని పరుగెత్తుకుంటూ వచ్చి

"పిల్లాణ్ణి తీసుకొని నేను పారిపోతున్నాను" అని చెప్పింది ఎలిజా.

టాం దంపతులకీ విషయం అర్థం కాలేదు.

"యజమాని మమ్మల్నమ్మేశాడు. అప్పులు పెరిగాయట. కొందర్నైనా అమ్మి భారం తగ్గించుకోవాలనుకుంటున్నాడు. మిసెస్ షెల్బీ వద్దని వారించింది. కాని ఆయన వినలేదు. అంకుల్ టాం, నిన్ను కూడా అమ్మేస్తారట. పారిపోదామా, ఎందుకు కొత్త యజమానుల చేతిలో తన్నులూ తిని చస్తావు? "

"అందరితోపాటే నేను. ఎలా రాసుంటే అలా జరుగుతుంది" అన్నాడు టాం.

"ఎలాగైనా ప్రయత్నించి కెనడాలో తనను కలుసుకుంటానని జార్జితో చెప్పండి" అంటూ కన్నీళ్లతో నిష్క్రమించింది ఎలిజా.

★ ★ ★

ఎలిజా కొడుకు పెద్దవాడే, నడవగలడు. కాని ఒక్క క్షణం వాణ్ణి కిందికి దింపాలన్నా మనస్కరించలేదామెకు. రోజంతా నడిచి, సాయంత్రం వరకు ఒహియో నదీ తీరానికి చేరుకుంది.

ఈ లోగా షెల్బీ ఎస్టేట్‌లో బానిసల్ని



# హారియెట్ బీచర్ స్టౌవ్ (1811-1896)

ఈ రచయిత్రి కనెక్టికట్‌లోని లిచ్‌ఫీల్డ్‌లో 1811 జూన్ 14న జన్మించింది. తండ్రి ప్రొటెస్టెంట్ ప్రీచర్. సోదరి నెలకొల్పిన హార్ట్‌ఫోర్డ్ ఫిమేల్ అకాడెమి (బాలికల పాఠశాల)లో ప్రాథమిక విద్యాభ్యాసం ముగించింది హారియెట్. తనకు తెలిసిన విషయాలు నలుగురితో పంచుకోవాలని ఆమె తపన. 1833లో పిల్లల కోసం ఒక జాగ్రఫీ పుస్తకం రాసింది. ఇదే ఆమె తొలి ప్రచురణ. ఆ తర్వాత కవిత్వం, యాత్రాకథనాలు, జీవితచరిత్రలు, బాలసాహిత్యం పుంఖానుపుంఖంగా ప్రచురించింది. ఆమె రచనల్లో కొన్ని: మే ఫ్లవర్ (1834), ది మినిస్టర్స్ వూయింగ్ (1859), ది పెర్ల్ ఆఫ్ ఆర్స్ ఐలండ్ (1862), ఓల్డ్ టౌన్ ఫోక్స్ (1869); లిటిల్ పస్సీవిల్లో (1870), లేడీ బైరన్ విండికేటెడ్ (1870); మై వైఫ్ అండ్ ఐ (1871), పింక్ అండ్ వైట్ టిర్రనీ (1871), పాల్మెటో లీవ్స్ (1873) వగైరా.

1836లో కాల్విన్ ఎల్లిస్ స్టౌవ్‌ను వివాహం చేసుకుని ఏడుగురు పిల్లల్ని కన్న హారియెట్‌కు ఆనాటి ప్రముఖ సాహిత్యకారులతో సన్నిహిత సంబంధాలున్నాయి. లేడీ బైరన్(కవి బైరన్ భార్య), ఆలివర్ వెండెల్ హోమ్స్, జార్జి ఎలియట్‌లు ఈమెకు మంచి మిత్రులు.

అయితే ఈ రచయిత్రికి అశేష కీర్తినార్జించి, ఆమెరికాలో నీగ్రో బానిస విధానం

కొన్న హేలీ ఎలిజా పారిపోయిందని తెలిసి కోపగించుకున్నాడు. మొత్తం మీద తనూ తన 'సరుకు'తో ఒహియో వైపే కదిలాడు. అతడి అసిస్టెంట్లందరూ, వేట కుక్కల్లా పారిపోయిన బానిసల కోసం గాలించారు. ఒక సత్రంలో తలదాచుకున్న ఎలిజా ఈ మానవ జాగిలాలను చూసి ఒక్కవుదుటున నదిలో తేలుతున్న మంచు గడ్డల మీదికి దూకింది. ప్రాణంపోయినా సరే, వీళ్లకు మాత్రం చిక్కకూడదు అనుకున్న ఆమె అతి కష్టం మీద అవతలి తీరం చేరుకుని, యాదృచ్ఛికంగా కనిపించిన భర్త జార్జితో కలిసి కెనడావైపు నడిచింది.

షెల్బీ ఎస్టేట్‌లో తన కొత్త యజమాని కోసం నిరీక్షించాడు అంకుల్ టాం.

"యజమానులు వేరైనా, దేవుడొక్కడే" అంటూ ధైర్యం చెప్పింది భార్య.

"కాని మనకే ఎందుకో యిన్ని కష్టాలు" అన్నాడు అంకుల్ టాం.

తన బానిసల్ని అమ్ముకున్నందుకు మిసెస్ షెల్బీకి కూడా కన్నీరాగలేదు. డబ్బు కాస్త సర్దుబాటు కాగానే తిరిగి కొనుక్కుంటానంది.

హేలీ వచ్చి టాంను యినుప గొలుసులతో బంధించి తీసికెళ్లాడు.

"మిస్టర్ హేలీ, గొలుసులనవసరం. అతడెక్కడికీ పోడు," అంది మిసెస్ షెల్బీ.

"ఇప్పటికే ఒక పెద్దమనిషీ, ఒక పిల్లాడూ పారిపోయారు. అయిదు వందల డాలర్ల నష్టం వచ్చింది" అంటూ గొణుక్కున్నాడు హేలీ (ఇక్కడ బానిసల స్థితిగతులను హృదయవిదారకంగా వర్ణిస్తుంది రచయిత్రి).

అలా బానిసల మంద న్యూఆర్లియన్స్ వైపు ప్రయాణించింది. దారిలో, ప్రమాదవశాత్తూ నదిలో పడిపోయిన బాలిక

రద్దు కావటానికి కారణమైంది మాత్రం 1852లో ఈమె ప్రచురించిన అంకుల్ టామ్స్ కేబిన్- తొలుత వాషింగ్టన్ నుండి వెలువడే 'నేషనల్ ఎరా' పత్రికలో సీరియల్‌గా వచ్చింది.

ఆ రోజుల్లో నీగ్రోలు, తెల్ల యజమానుల ప్రైవేటుఆస్తి. పశువుల్లాగే వీళ్లను సంతల్లో అమ్మకానికి పెట్టేవాళ్లు. పారిపోయిన వాళ్లను యజమానులు వెంటాడి పట్టుకుని, అమానుషంగా శిక్షించడానికి 'ఫ్యూజిటివ్ స్లేవ్‌లా' కూడా అమల్లో వుండేది. "నేనే రచయిత్రినైతే ఇంత దారుణమైన చట్టానికి వ్యతిరేకంగా ఓ పుస్తకం రాస్తాను" అంటూ హేరియెట్ ముందు ఆక్రోశించింది ఆవిడ వదినగారు. ఆ మాటలు రచయిత్రిని కదిలించాయి. కథావస్తువు గురించి పరిశోధన ప్రారంభించింది.

అనేక మంది బానిసల్ని ఇంటర్వ్యూ చేసింది. లైబ్రరీలకెళ్లి, పత్రికలలో, పుస్తకాలలోవున్న సమాచారమంతా సేకరించింది. ఫలితంగా, ఒక ఆఫ్రో -అమెరికన్ (నల్లవాళ్లనక్కడ 'నీగ్రో' అని సంబోధించటం అమర్యాద) ప్రధానపాత్రగా తొలి అమెరికన్ నవల అవతరించింది. (బానిస విధానాన్ని నిషేధిస్తూ అబ్రహం లింకన్ చట్టం చేసిన వెంటనే, బానిసత్వం ప్రబలంగా వున్న దక్షిణాది రాష్ట్రాలకూ, కొంత ప్రగతి శీలమైన ఉత్తర రాష్ట్రాలకూ మధ్య యుద్ధం జరిగింది.) ఇది చదివిన లింకన్ "సన్నగా పీలగా వున్న మీరా యింతటి యుద్ధానికి కారణం!" అన్నాట్ట హేరియెట్‌తో. అనుకున్న ఫలితం సాధించడంతో, ఇదే ఇతివృత్తంతో 'డ్రెడ్'అనే మరో నవలను 1856లో ప్రచురించింది రచయిత్రి.

ఎవాంజ్‌లైన్‌ను రక్షిస్తాడు టాం. ఆ తర్వాత ఆమె తండ్రి సెయింట్ క్లేర్ అతణ్ని తిరిగి హేలీ నుండి కొనుక్కుని తన కోచ్‌మాన్‌గా పెట్టుకుంటాడు. అయితే అతని భార్య మేరీ, కజిన్ ఆఫేలియా మాత్రం టాం లాంటి బానిసలకు చనువివ్వకూడదంటారు.

ఒకనాడు సెయింట్ క్లేర్ తొమ్మిదేళ్ల నీగ్రో పిల్ల టాప్సీని తీసుకొచ్చి తన కజిన్‌కు బహుమతిగా ఇచ్చాడు.

"ఈ రోజు నుండే ఈ పసిదాని సంరక్షణ, పోషణ నీ బాధ్యత" అన్నాడు.

టాప్సీ తారులాగ నల్లగా ఉంది. ఒళ్లంతా మురికి. స్నానం అనేది తెలియనట్టుంది. జుత్తు అట్టలు కట్టుకుపోయింది.

"టాప్సీ, నువ్వు అమ్మగారు చెప్పినట్టు వినాలి. చదువు, సంస్కారం నేర్చుకోవాలి" అంటూ ఆమెకు చెప్పాడు సెయింట్ క్లేర్.

టాప్సీ తెలివైనదే కాని మహాతుంటరి. ఆఫేలియా ఆమెకు స్నానంచేయించి, శుభ్రమైన దుస్తులు వేసి ఇంటి పద్ధతులు ఒక్కొక్కటే బోధించసాగింది. కొన్నాళ్ల తర్వాత, జంతువులా యింటికొచ్చిన పిల్ల కాస్త మనిషిగా కనిపించింది. కాని అప్పుడప్పుడూ వస్తువులు దొంగిలించేది.

"ఎందుకిలా చేస్తావు? " అని సెయింట్ క్లేర్ అడిగితే, "నేను చెడ్డదాన్ని, నన్ను కొరడాలతో కొట్టండి. నేను నీగ్రోను కదా! నీగ్రోలనెవరూ ప్రేమించరు" అందాపిల్ల. ఈ మాటలు విన్న ఎవాంజ్‌లైన్ మనసు కరిగింది. అప్పటికే ఆమెకు జబ్బుగా వుంది.

"నువ్వంటే నాకు చాలా యిష్టం టాప్సీ. నీకు అమ్మా, నాన్న లేరు. నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. ఎక్కువ కాలం బ్రతకను. నా కోసమన్నా నువ్వు మారి... సత్ప్రవర్తన అలవర్చుకోవాలి"

అంది ఎవాంజ్‌లైన్.

★ ★ ★

ఎవాంజ్‌లైన్ ఆరోగ్యం దిగజారుతుంది. తను మరణించిన తర్వాత అంకుల్ టాంకు స్వేచ్ఛ ప్రసాదించాలని తండ్రితో వాగ్దానం చేయించుకుంటుంది. తన యజమానురాలి పరిస్థితి చూసి టాప్సీ వెక్కి వెక్కి ఏడుస్తుంది. తను సంస్కారవంతురాలనవుతానని, అందుకోసం ప్రయత్నిస్తున్నానంటుంది టాప్సీ. ఎవాంజ్‌లైన్ మరణం తర్వాత ఆమె లేని లోటు తెలిసి వస్తుంది. నల్లవాళ్లను అంతగా ప్రేమించే వాళ్లు ఈ లోకంలో ఆరుదు. ఆ బాధను తట్టుకోలేక బైబిల్ పఠనంలో మునిగిపోతాడు సెయింట్‌క్లేర్. కూతురు కోరిక ప్రకారం టాంకు విడుదల ప్రసాదించటానికి అవసరమైన పత్రాలు తయారు చేయాలనుకుంటాడు. టాప్సీని విడుదల చేసే బాధ్యత ఆఫేలియాకప్పగిస్తాడు. కాని ఒక సాయంత్రం క్లబ్బుల్లో పోట్లాడి తీవ్రంగా గాయపడతాడు. వైద్య సహాయం వచ్చేలోగానే మరణిస్తాడు. అలా, టాం బానిసజీవితం కొనసాగుతుంది.

★ ★ ★

సెయింట్ క్లేర్ మరణంతో ఆ ఇంటి వాతావరణమే మారిపోతుంది. అతడి భార్య మేరీ, తన బానిస యువతిని పదిహేను కొరడా దెబ్బలు కొట్టమని ఒక అధికారికి ఉత్తరం రాస్తుంది (బానిసలను శిక్షించటానికి ప్రత్యేక వ్యవస్థ ఒకటుండేదా రోజుల్లో!). ఆ వుత్తరం పట్టుకుని వచ్చి ఆఫేలియా కాళ్లమీద పడుతుంది బానిస. ఆ తర్వాత, ఆఫేలియా, అధికారికి అప్పీలు చేసినా ఫలితముండదు.

మరి కొన్నాళ్లకు మేరీ తన ఆస్తినంతా అమ్ముకుని, టాంతో సహా, బానిసలందర్నీ వేలంపాటకు పంపుతుంది. ఆక్షన్ హాలు అందాలను బాగా వర్ణిస్తుంది రచయిత్రి. దేశదేశాల వర్తకులు తమకు నచ్చిన 'సరుకు'ను ఎంపిక చేసుకోవటం కోసం నిరీక్షిస్తుంటారక్కడ. అలాంటి ఒక వర్తకుడు లెగ్రీ చూడటానికే అసహ్యంగా ఉన్నాడు. దగ్గరగా వచ్చి టాం దవడలు పట్టుకుని అటూ ఇటూ తిప్పి పరీక్షించాడు. చివరికి టాంతో సహా మరో ఎనిమిదిమంది బానిసల్ని కొనుక్కుని తన పొలాల్లో పని చేయించటానికి తీసికెళ్లాడు. విశ్రాంతి లేకుండా శ్రమించాలి బానిసలు. 'జాలి' అనే మాట తెలియదు లెగ్రీకి. వీళ్లు చస్తే కొత్తవాళ్లను కొనుక్కుంటాడు. ప్రస్తుతమున్న మందలో 'ఎమ్మెలైన్' అనబడే బాలిక కూడా వుంది. ఆమెను చూసి "నువ్వు సుఖపడతావులే పద' అంటూ వికటంగా నవ్వి లోపలికి లాక్కెళ్లాడు లెగ్రీ.

★ ★ ★

ఎందుకోగాని, లెగ్రీకి టాం పట్ల ద్వేషం పెరిగింది. చుట్టూ వున్న హింసను, అన్యాయాన్ని కొందరు 'ఇదే మన ఖర్మ' అనుకుని అంగీకరిస్తారు. కొందరు మాటల్లో కాకపోయినా, చూపుల్లో నిరసన తెలియచేస్తారు. టాం కళ్లలో ఆ నిరసన కనిపిస్తుంది.

మరుసటిరోజు పొలాల్లో మరో బానిస స్త్రీ కనిపించింది. ఆమె పేరు కాసీ. సన్నగా, పొడుగ్గా వుంది. ఆమె పిల్లల్ని లెగ్రీ అమ్మేశాడు. ఎమ్మెలైన్ లాగే ఆమె కూడా లెగ్రీకి ఉంపుడుకత్తె. యజమానికి తన బానిసల ఇష్టాయిష్టాలతో పనిలేదు. ప్రైవేటు ఆస్తి మీద భగవంతునికి కూడా అధికారం లేదని అతని విశ్వాసం.

★ ★ ★

పత్తి పొలాల్లో పనిచేసి సాయంత్రానికి అందరూ ఇళ్లకు చేరుకున్నారు. ఒక మూలాటో బానిస సరిగా పని చెయ్యక పోతే ఆమెను పిన్నులతో గుచ్చి శిక్షిం

చారు. కాని ఇంకా లెగ్రీ కోపం చల్లార లేదు.

"ఈ పని దొంగకు బుద్ధిచెప్పాలి. ఒరే టాం, దీన్ని కొరడాతో కొట్టు" అని టాంను ఆదేశించాడు.

"అయ్యగారు నన్ను క్షమించాలి. అలాంటి పని చెయ్యలేను" అన్నాడు టాం. వెంటనే ఫెడేల్మని అతడి మొహం మీద గుద్దాడు లెగ్రీ.

"ఇప్పుడు చేస్తావా? "

"ఎంత చాకిరీ చెయ్యమన్నా చేస్తాను. కాని ఇలాంటి పని చెయ్యలేను. కొట్టటం తప్పు."

బానిస తనకు ఎదురుచెప్పటమే!

"హుం, తప్పొప్పులు నువ్వా నాకు చెప్పేది? ఇప్పుడే నీ పొగరణుస్తాను చూడు!" అంటూ తన బానిసల సూపర్‌వైజర్లు శాంబో, క్వింబోల చేతులకు పని చెప్పమన్నాడు.

వాళ్లిద్దరూ క్రూరులు. అవకాశం కోసం ఎదురుచూస్తున్నారు. "ధిక్కరించిన ఆ దవడను పగలగొట్టాల్సిందే" అలసిపోయిందాకా టాంను చితకబా దారు.

★ ★ ★

రాత్రికి టాం గదికి వచ్చి గాయాలకు కాపడం పెట్టింది కాసీ. మరి కాసేపటికి లెగ్రీ వచ్చి బూటుకాళ్లతో తన్ని, "క్షమా పణ చెబుతావా లేదా? " అంటూ గద్దిం చాడు.

"నాకు న్యాయమనిపించిన మాటే నేను చెప్పాను" అన్నాడు టాం.

"ఓహో, అలాగా, నిన్ను చెట్టుక్కట్టేసి నిప్పంటిస్తాను. అప్పుడు చెబుదువుగాని నీ నీతులు" అన్నాడు లెగ్రీ.

"మాస్టర్, మీరు ఈ శరీరాన్ని హింసించగలరు. చివరికి నన్ను చంపే స్తారు. అంతేగదా! కానీ పరలోక రాజ్యంలో నాకు చోటున్నది. మీరు నన్నెంత త్వరగా చంపితే నేనంత త్వరగా అక్కడికి పోతాను" అన్నాడు టాం.

ఆ తర్వాత అనుభవించిన చిత్రహిం సలో, క్రీస్తు కనిపించి తనతో మాట్లాడిన ట్టనిపించింది. అరుపులు విన్న కాసీ మళ్లీ వచ్చి 'టాం పొలం పనులు బాగా చేస్తాడు. చంపొద్ద'ని లెగ్రీకి నచ్చచెప్పింది.

ఆ తర్వాత ఎంత శిక్షించినా, టాం మొహం మీద చిరునవ్వు చెరగలేదు. దేవుడే స్వయంగా వచ్చి టాంను రక్షిస్తు న్నాడనిపించింది లెగ్రీకి.

ఒకనాడు కాసీ, ఎమ్మెలైన్ పారిపో యారు.

టాంను నిలదీశాడు లెగ్రీ.

"వాళ్లెక్కడికెళ్ళారో తెలుసు కాని చెప్పను. నన్ను చంపినా సరే. కాని చంపి పాపం మూటకట్టుకోవద్దు" అన్నాడు టాం. అలా మాట్లాడగలిగిన ధైర్యం ఇవ్వ గలిగేది క్రీస్తుగాక మరెవ్వరు?

★ ★ ★

రెండు రోజుల తర్వాత జార్జి షెల్బీ వచ్చి టాంను తిరిగి కొనుక్కుంటాన న్నాడు. "చచ్చిన బానిసల్ని ఏం చేసు కుంటావన్నాడు" లెగ్రీ హేళనగా. కోపం పట్టలేని జార్జి, ఆ దుర్మార్గుణ్ని ఎడాపెడా కొట్టాడు. మరికొన్నాళ్లకు ఆ దెబ్బలతోనే మరణించాడు లెగ్రీ. టాంను గౌరవ ప్రదంగా సమాధి చేసి ఇంటికి తిరుగు పయనమయ్యాడు జార్జి. దారిలో ఎలిజా, జార్జి హారిస్ వాళ్లకొడుకు కనిపించారు. ఆ తర్వాత కాసీ ఎమ్మెలైన్‌లు కూడా తార సపడ్డారు. అందర్నీ వెంటపెట్టుకుని కెంట కీ (తన ఎస్టేట్‌కు) చేరుకున్నాడు జార్జి షెల్బీ. తప్పిపోయిన తన కూతురే ఎలిజా అని తెలుసుకుంటుంది కాసీ. టాం జ్ఞాపకార్థం తన వద్దవున్న బానిస లందర్నీ విడుదల చేస్తాడు జార్జి షెల్బీ.

– ఎం.వసంత

## సెప్టెంబరు చతుర నవల 'ఉరి' పై పాఠకుల సమీక్షలు

### ఆలోచనాత్మకం
రూ. 100/- పొందిన సమీక్ష

చంద్రశేఖర ఆజాద్ నవల 'ఉరి' ప్రజ్ఞావంతంగానూ, ఆలోచనాత్మకంగానూ సాగింది. చైతన్య, గోపాల్, పద్మ, సుధీర్, దేవి, వరూధిని యిలా అన్ని పాత్రలూ సగటు స్థాయిని మించిన పరిణతినీ, విలక్షణతనూ ప్రదర్శిస్తూ కొత్తస్థాయిని ఆవిష్కరిస్తాయి. కథావస్తువు, వర్తమాన సమాజ పోకడ, ఆలోచనలూ, సంఘటనలూ, స్పందనలూ, సిద్ధాంతాలూ, వాదాలూ, పరిణామాలూ- యిలా అన్నింటినీ రంగరించిన యీ నవల విశిష్టంగా వుంది- సిద్ధాంతాలు నేర్పే దానికన్నా జీవితం నేర్పేది ఎక్కువ. ఉద్యమాలు చేసే వాళ్లు మామూలు మనుషులకంటే అతీతులు కారు; రక్తసంబంధాలు వదలుకోవడంలో అర్థం లేదు; అనుభవమే ఎవరినైనా మారుస్తుంది. ఉరి శిక్ష అమలు గురించిన వాదోపవాదాలు ఎలా సాగుతున్నా- మారణకాండ కొనసాగుతూనే వున్నది, ఇవన్నీ నిత్యసత్యాలు. నేరమూ- శిక్షా అనేవి సమాజాన్ని తీవ్రంగా ప్రభావితం చేసే అంశాలు- అని అనుకున్నా - అలాంటి దాఖలాలు మాత్రం ఎక్కడా కనిపించడం లేదు.




మనిషి ప్రాణాలకు విలువ వుంది; మనం మానవత్వం పక్కన నిలబడాలి; ఓ మనిషి ప్రాణాన్ని తీసిన వారికి జీవించే హక్కులేదు; ఒకరి ప్రాణం యింకొకరు తీసుకొనే అవసరం వుండకూడదు- అనేవి గోపాల్ సిద్ధాంతాలు. ఈ క్రమంలో అతను భార్యా పిల్లలను పట్టించుకోకుండా సమాజంలోని మనుషుల గురించి వకాల్తా తీసుకున్నాడనే విమర్శలు వచ్చినా చలించని వ్యక్తి. చివరకు తనే శంకర్‌ను చంపడం - అతన్ని ఎక్కడినుంచి ఎక్కడికో తీసుకువెళ్లిన పరిణామం. తను నేరం చేసినందున తనకు ఉరి శిక్షనే విధించమని అడగడం విషాదం. "అయినా నేను బయటకు వస్తాను, నన్ను కాపాడటానికి మేధావులున్నారు, సంస్థలున్నాయి" అని అతని చేత అనిపించడం వాద ప్రతివాదాలకు పెద్ద చురక.

సిద్ధాంత రాద్ధాంతాల మధ్య పద్మ పొందినదీ, పోగొట్టుకున్నదీ ఏమిటో కాలమే చెప్పాలి. ఏ సంఘాలవాళ్లైనా కేవలం "తమ" వాళ్ల గురించే కాకుండా బాధలు పడే వారి గురించి ఉమ్మడిగా మాట్లాడితేనే ప్రయోజనం. అలాంటి మార్పు కావాలి. ఈ రోజున ఎటువంటి నేరాలకైనా ఏ రకమైన శిక్ష లేకపోవడం; నేరాలకూ, ఘోరాలకూ ప్రభుత్వాలూ, పాలకులూ, వారి వ్యవస్థలే కర్తలూ కర్మలూ అవుతుండటం; వాటినుంచి ఏ సామాన్యుడికీ ఏ రక్షణా లేకపోవడం- యివన్నీ ప్రత్యక్షంగానే కనిపిస్తున్నాయి. ఈ దురవస్థలుగానీ, ఈ వ్యవస్థగానీ సమూలంగా నాశనమైపోయి మళ్లీ ఒక కొత్త సమాజం ఏర్పడి అందరికీ మేలు జరగాలంటే- అది ఏ ఉద్యమం, ఏ పోరాటం వల్ల సాధ్యం అవుతుంది? అటువంటి రోజు ఎప్పుడు వస్తుంది? మంచిలోక స్పర్శను యీ నవల అందించింది. మంచి ఆలోచనలను కలిగించినది.

–వి.కామేశ్వరరావు,
నాచారం, హైదరాబాద్

### మేధో మధనం
రూ. 75/- పొందిన సమీక్ష

సమకాలీన సమాజంలో విజృంభిస్తున్న నేర ప్రవృత్తికి తార్కాణంగా జరిగిన ఒక సంఘటనతో మొదలైన నవల ఆద్యంతం పాఠకుల్ని చదివించింది. వారిని మేధోమధనానికి పురిగొల్పింది.

ప్రేమ విషయంలో తిరస్కారం చూపిన తోటి విద్యార్థిని హాసినిని కిరాతకంగా హత్య చేసిన శంకర్‌కు తప్పని సరిగా ఉరిశిక్ష పడవలసిందే. సదరు నేరానికి లభించే శిక్షేమిటో తెలిసికూడా నేరానికి పాల్పడి, లేశమైనా పశ్చాత్తాపంలేని, క్షమాభిక్ష కోరడానికైనా అంగీకరించని ఆ

మానవ మృగానికి ఉరిశిక్ష రద్దు చేయించిన పాపానికి గోపాల్ కూతుర్నే బలిపెట్టవలసి వచ్చింది. నేరస్థులు ప్రణాళికా బద్ధంగా హత్యలు చేస్తుండగా మానవీయ కోణంలో ఆలోచిస్తూ ఉరిశిక్ష రద్దు చేయాలనే గోపాల్ వంటి వారి వైఖరిని రచయిత ప్రశ్నించారు.

చిన్న వయసులోనే పరిణతి చెందిన చైతన్య తండ్రి వ్యవహారశైలిని క్షుణ్ణంగా చదివింది. వృత్తి, ప్రవృత్తి పరమైన భావాలలో వచ్చిన తేడాల కారణంగా గోపాల్ భార్యనుండి వేరు పడవలసి వచ్చింది. సుధీర్, చైతన్యల సునిశిత మైన ప్రశ్నలకు జవాబివ్వలేని గోపాల్ ఒక దశలో శంకర్‌కు ఉరిశిక్ష సబబే అనే నిర్ణయానికి వచ్చి కూడా ఆ నరరూపరాక్షసుడిలో మానవత్వం వెతికే వ్యర్థ ప్రయత్నం చేశాడు. శంకర్‌లో గోపాల్‌కు కనిపించిన సత్ప్రవర్తన కేవలం చైతన్యతో 'కోరిక' తీర్చుకోవాలనుకోవడం, తప్పించుకోబోయిన చైతన్యను హత్య చేయడంగా పరిణమించడం నేరస్థుల నిర్భీతిని, రాజ్యాంగంపై గౌరవం లేకపోవడాన్ని సూచిస్తోంది.

ఇతరుల 'జీవించే హక్కు'ను కాలరాసే హంతకులకు మానవహక్కులు వర్తింప జేయాలనుకోవడం ఎంత అవివేకమో ఈ నవల చాటిచెప్తోంది. అందరూ చూస్తుండగా హత్యలు జరుగుతున్నా సాక్ష్యం లేకపోవడం కారణంగా న్యాయాధికారులు సైతం తమ నిస్సహాయతను ప్రకటించడానికి పరిష్కారం ప్రజా చైతన్యమేనని పద్మపాత్ర ద్వారా రచయిత విశదపరచారు.

విద్యార్థుల పసిమనసుపై విషప్రభావం చూపే అంశాల గురించి, మహిళలపై జరుగుతున్న దుర్మార్గాలను అరికట్టాలనే విషయాల గురించి నవలలోని పాత్రల ద్వారా చెప్పించి రచయిత పాఠకులలో ఆలోచనలు రేకెత్తించారు.

ఇటువంటి విశ్లేషణాత్మకమైన రచన చేసిన చంద్రశేఖర ఆజాద్ గారికి, ప్రచురించిన చతురకు అభినందనలు

**-జె.వి.రమణ,** పి.వి. టౌన్‌షిప్, మణుగూరు

## తనదాకా వస్తేనే...

రూ. 50/-
పొందిన సమీక్ష

**హం**తకులకి ఉరిశిక్ష విధించడం మానవత్వమా? బర్బరత్వమా? అన్న ప్రశ్నని సభ్య సమాజంపై విసిరిన నవల- 'ఉరి'.

తనని నిరాకరించిందన్న కసితో హాసినిని క్లాసరూం ఎదుటే 'మద్దు' కత్తితో నరికేస్తాడు శంకర్. శంకర్‌కి న్యాయస్థానం 'ఉరిశిక్ష' వేయమంటుంది. వద్దు- అది మానవత్వం కాదంటాడు 'ప్రజాహక్కుల సంఘ' ప్రతినిధి గోపాల్. కాదు, కాదు- ఒక వనితని మట్టుబెట్టిన వాడికి ఉరిశిక్షే సరైనదంటుంది- ఒక మహిళాసంఘం నాయకురాలు పద్మ. ఈ 'ఉరిశిక్ష' కేస్‌లో ఉత్తర దక్షిణ ధ్రువాలైన గోపాల్, పద్మలు- భార్యాభర్తలు. వారి బిడ్డ చైతన్య, హతురాలు హాసినికి కాలేజ్‌మేట్. ప్రేమికుల పంట చైతన్య ఒంటరి దైన అమ్మమ్మకి ఊరట కోసం ఆలంబన. తన కూతురు పద్మని 'అలా' దూరం చేసుకున్న తల్లి- కొడుకు అమర్‌నీ దూరం చేసుకొని వాపోతుంది. అమర్ అమెరికాకి చెక్కేసి చక్కగా తన కుటుంబం అమరికకి పూనుకుంటాడు. వారి కథ ప్రధాన కథతో యిమిడి పోయేలా జాగ్రత్త పడ్డారు రచయిత. శంకర్ ఉరిశిక్ష తప్పించుకుని యావజ్జీవ కారాగార శిక్ష పొందుతాడు, గోపాల్ చలవవల్ల. పెరోల్‌పై బయటికొచ్చి తన కృతజ్ఞతలు సమర్పించడానికి గోపాల్ యింటికి వస్తాడు. ఐతే అక్కడ తనకి చైతన్య కనిపిస్తుంది. అతని ఆలోచనలు యథావిధి- కుక్క తోక చందాన- 'నిన్నే పెళ్ళాడతా' అని ఆమెతో అంటాడు. దానికి చైతన్య నిరాకరిస్తుంది. పర్యవసానంగా ఆమెని నరికేస్తాడు శంకర్. పోలీసులకి లొంగిపోయిన అతన్ని న్యాయ స్థానానికి తీసుకురాగా అక్కడికక్కడే అతని తల తెగ్గొడతాడు గోపాల్. ఇప్పుడు హతురాలు తన కూతురు- ఆ నెప్పి ఏమిటో- తెలిసి వస్తుంది గాబట్టి. ఉరిశిక్షకి విరోధి గోపాల్ అంతకన్నా దారుణంగా శంకర్‌ని అలా నరకడమేమిటని చదువరులు ఆలోచనాపరులయ్యే తరుణంలో గోపాల్ ప్రశ్న ధ్వనిస్తుంది- ఇప్పుడు తన భార్య పద్మ హంతకుడైన తనని, అంటే ఆమె భర్తని ఉరిశిక్షకి గురి చేయ మంటుందా? ఒక విన్నపం- హంతకుడైన తనని ఉరిదీయమని. చదువరులకి ఒక ఆలోచనాక్రమం- పరిస్థితులు యిలా పరిభ్రమిస్తాయా? ఫలితాలు యిలా తేలుతాయా? - అని. 'ఉరి' ఎంత వరకు సబబు అన్నదాన్ని చక్కగా నిర్వహించిన రచయితకి హేట్సాఫ్!

**-శ్రీ పెరంబుదూరు నారాయణరావు,**
హైదరాబాద్

## సందేశాత్మక నవల

రూ. 50/- పొందిన సమీక్ష

ఆద్యంతం ఆసక్తిగా సాగిన 'ఉరి' నవల వాస్తవికతకు దర్పణం పట్టింది. ఉరిపై గతంలో ఎన్నో రచనలు వచ్చినా ఇది ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ప్రజాస్వామ్యాన్ని రక్షించే హక్కుల సంఘాలు చేసే పోరాటాల ఫలితం ఏ పరిణామాలకు దారితీసే అవకాశం ఉందో అవగతమవుతుంది. గోపాల్- పద్మ పాత్రలు పరస్పర విరుద్ధమైనవిగానే నడిపించారు. చివర్లో మాత్రం చైతన్యను చంపిన శంకర్‌ను నరికిన గోపాల్ స్వానుభవానికీ, ఉద్యమ పంథాకు గల తేడాను తన చర్యతో వివరించినట్లయింది. గోపాల్, పద్మల మధ్య జరిగిన భావసంఘర్షణలో అంతిమంగా పద్మే విజయం సాధించింది. చట్టాలంటే నమ్మకం, శిక్ష అంటే భయం ఉంటేనే సమాజంలోని సభ్యులు తలెత్తుకొని తిరుగుతారు. శంకర్‌ను గోపాల్ నరకటం చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవడమే. అది నేరమే. అయినా అతనున్న పరిస్థితికి అది తప్పదు. ఒకవేళ చట్టమే న్యాయం చేస్తుందని ఎదురు చూసినా ఒరిగేదేమిటి? హాసిని హత్య విషయంలో ఏం జరిగింది? అలా మరో యువతి బలి కాకుండా ఉండాలంటే గోపాల్ అలా చేయాల్సిందే. పాత్రల చిత్రీకరణ తీరుతెన్నులు బాగానే ఉన్నాయి. ఉరి చుట్టూ అల్లుకున్న సమకాలీన అంశాలన్నీ ఇందులో చర్చించారు. చివరికి ఏం జరుగుతుందోననే ఆసక్తిని కల్గించింది ఈ నవల. కొసమెరుపులోనే సందేశాన్ని ఇమడ్చారు. మనిషి ప్రాణాలను తీసే వారికి జీవించే హక్కు లేదన్నది సందేశం.

–హనుమంతవఝుల శ్రీనివాసరావు, రేలంగి

## సామాజిక చిత్రణ

రూ. 50/- పొందిన సమీక్ష

ఉరిశిక్ష తప్పు చేసిన వాడికే పడుతుంది. ఆ మాటకొస్తే తప్పు చేసిన ఎందరో శిక్షల నుండి చట్టంలోని లొసుగుల వల్ల తప్పించుకుంటున్నారు. దానికి తోడు మానవతా దృక్పథంతో క్షమాభిక్ష పెట్టాలని వాదించేవారు ఎందరో. ఇలాంటి రసవత్తరమైన చర్చను సామాజిక స్పృహతో కొనసాగించిన నవల 'ఉరి'. నవల చదివే పాఠకుడు అడుగడుగునా సమాజంలోని నేటి స్థితిగతులను పోల్చుకుంటాడు.. రచయిత చతుర నవల కోసం మంచి డెప్త్ ఉన్న సబ్జెక్టును ఎంచుకున్నారు. కథాపరంగా లా, మానవహక్కులు, ప్రేమ, మానవ సంబంధాలు వున్నా ఉరిశిక్ష అమలు గురించే కథనం చక్కర్లు కొడుతుంది. కళాశాల విద్యార్థినిని హత్య చేసిన శంకర్‌కు ఉరిశిక్ష పడుతుంది. దాన్ని రద్దు చేయాలని కొందరు, అమలు చేయాలని మరికొందరు తమ కార్యకలాపాలు కొనసాగిస్తారు. ఉరిశిక్ష రద్దు చేయాలని వాదించే అడ్వకేటు గోపాల్ కూతురు చైతన్యను పెరోల్‌పై వచ్చిన శంకర్ హత్య చేయడంతో కథ క్లైమాక్స్‌లో పడుతుంది. మారిపోయాడనుకున్న శంకర్ రెండో హత్య చేయడంతో అందరూ ఖంగు తింటారు. శంకర్ మారిపోయి చైతన్యను పెళ్ళి చేసుకుంటాడని ఊహిస్తాం. మన దేశంలో ఎంతోమంది ఉరిశిక్ష నుండి తప్పించుకుంటున్నారు. సుప్రీంకోర్టు తీర్పిచ్చినా అఫ్జల్ గురును ఈనాటి వరకు ఉరి తీయించలేని ఓటు బ్యాంకు ప్రభుత్వాలు మనవి. ఉరిశిక్ష తప్పా, ఒప్పా అన్న వాదనలు పక్కన పెడితే- దీన్నుండి తప్పించుకుంటున్న వారిని చూస్తే సామాన్యులు ఆత్మవిశ్వాసం కోల్పోయే ప్రమాదముంది. నేరగాళ్లు తమ మధ్య దర్జాగా తిరుగుతుంటే నీతి నిజాయితీలతో బతికే పౌరులు తమ జీవనశైలిపై నమ్మకం కోల్పోతారు. మెజారిటీ ప్రజల మనోభావాలకు అనుగుణంగా ఉరిశిక్షను కచ్చితంగా అమలుచేయాలి.

–గూరుడు శోభ, గోదూర్, కరీంనగర్ జిల్లా

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.




## ఈ కయ్యం ఎందుకంటే...!

కుస్తీపట్టి అమీతుమీ తేల్చుకుంటున్న ఈ మహా రాక్షస పక్షుల్ని చూశారా? ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండాల్లో కనిపిస్తాయి ఈ భారీ పక్షులు. ఇంతకీ వీటి సమరం దేనికంటే- ఓ ఆడపక్షితో సరసం ఎవరాడాలి అన్న విషయంలో గొడవ తలెత్తినందుకే! మనుషుల్లాగే వీటికీ ఇలాంటి బుద్ధులు ఉండడం విచిత్రమే మరి!

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78